## తరళా దలాల్* వివరిస్తున్నారు,



## "వంట మొదలెట్టక మునుపే వంటకాలకు రుచి తేవడమెలా"

వంటకాలకు నిజంగా రుచి తెచ్చేది వంట మొదలెట్టక ముందే మీరు చేయవలసిన పని. అంటే-వంటకాలకై సరైన దినుసుల్ని ఎంచుకోవడమన్నమాట. ఒక్కొక్క దినుసూ సరైన రుచీ వాసనా ఉండేలా చూసుకోవాలి. మసాలా దినుసులన్నీ నిండుగానూ, సువాసనా భరితంగానూ ఉండాలి. బియ్యం పొడుగ్గా ఉండాలి. కూరగాయలు పచ్చిగా, తాజాగా, రసం నిండి ఉండాలి. ఈ దినుసులన్నిటికీ సరిజోడుగా వంట నూనె సరైనదిగా ఉండాలి. సన్‌ఫ్లవర్ వనస్పతి లాగానన్నమాట. నాకిష్టమైన వంటకం ఒకటి చెప్తాను దీనితో చేసిచూడండి:

## మలబారీ కర్రీ

### మసాలా

½ కొబ్బరి కాయ తురుమినది, 1 పెద్ద-చెమ్చా ధనియాలు, 1½ చిన్న చెమ్చాలు జీలకర్ర, 3 చెక్కలు దాల్చిని, 3 లవంగాలు, 3 మిరియాలు, 5 గర్భలు వెల్లుల్లి, 10 కాశ్మీరీ మిరపకాయలు, 3 చిన్న చెమ్చాలు, గసగసాలు 1 పెద్ద ఉల్లిపాయ ముక్క 1 చిన్న చెమ్చా సన్‌ఫ్లవర్ వనస్పతి.



### చేసే పద్ధతి

1. సన్‌ఫ్లవర్ వనస్పతిని వేడి చేసి దినుసులన్నిటినీ 2 నిముషాలపాటు వేయించండి.
2. కొద్ది నీళ్లు వేసి ముద్దగా నూరండి.

### కర్రీ

2 పెద్ద టొమాటోలు 2 కప్పులు ఉడికించిన కూరగాయలు మిశ్రమం (కారట్లు, కాలీఫ్లవర్, బఠాణీలు, బీన్సు, బంగాళాదుంపలు) 1 పెద్ద చెమ్చా తాజా మీగడ ½ చిన్న చెమ్చా పంచదార 3 పెద్ద చెమ్చాలు సన్‌ఫ్లవర్ వనస్పతి (రుచికి తగినంత ఉప్పు)

### చేసే పద్ధతి

1 టొమాటోలను వేడి నీళ్లలో 10 నిముషాలు నానబెట్టండి. గుజ్జుగా తురమండి. 2. సన్‌ఫ్లవర్ వనస్పతిని వేడి చేసి, ముందు చెప్పిన మసాలా ముద్దను ఒక నిముషం పాటు వేయించండి. 3. అందులో టొమాటోలు, కూరగాయలు, ½ కప్పు నీళ్లు వేసి 4 నిముషాల పాటు ఉడకనివ్వండి. 4. అందులో పంచదార, మీగడ, ఉప్పు వేయండి.

మంచి నెయ్యి వాడకుండా దానికి బదులుగా సన్‌ఫ్లవర్ వనస్పతి వాడానేమిటా అని ఆశ్చర్యపోతున్నారా! ఫలితాలు చూశారంటే మరింతగా ఆశ్చర్యపోతారు. మీకై మీరే చూసుకోండి.

*సుప్రసిద్ధ పాకశాస్త్ర నిపుణులు.






Closer to the consumer

WPL 2545

**సన్‌ఫ్లవర్ వనస్పతి-మంచినెయ్యి మాత్రమే దీన్ని మించగలది**

# గూర్ఖాలాండ్ వ్యవహారం!

గూర్ఖాలాండ్ మీద ఇటీవలి రాజీవ్ గాంధి ప్రకటనలు వింతగా ఉన్నాయి. ఇటీవల డార్జిలింగ్‌లో తల ఎత్తిన జాతి వ్యతిరేక ఉద్యమానికి బాధ్యత గెయిసింగ్‌ది కాక పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసుదేనని అన్నారాయన.

జ్యోతిబసు తమ విషయం తాము చూసుకోగలరు భింద్రన్ వాలెలా మారుదామనుకున్న గెయిసింగ్ ఆ వేషం తనకి పనికి రాదని హఠాత్తుగా నిర్ణయించుకున్నారు. ఒకప్పుడు భింద్రన్‌వాలెకి యోగ్యతా పత్రం ఇచ్చినట్లే ఇప్పుడు గెయిసింగ్‌కి కూడా ఇచ్చారు. దూరదృష్టిలేనటువంటి కాంగ్రెసు వాదులు అకాలీలతో పోట్లాడటానిక భింద్రన్‌వాలెని ఉపయోగించుకున్నారు. ఇప్పుడు కమ్యూనిస్టులతో పోరాడటానికి గెయిసింగ్‌ని వాడుకుంటున్నారు. రాజీవ్ గాంధి కంప్యూటర్లు రెండేళ్లు వెనక్కి వెళ్లి చూస్తే ఆయన తల్లి, భింద్రన్ వాలె కూడా కాలగర్భంలో కలిసి పోయారని, అధికారంలోక వచ్చింది అకాలీలే కానీ కాంగ్రెసు వారు కాదన్న విషయాన్ని ఆయన తెలుసుకోగలుగుతారు పశ్చిమ బెంగాల్‌లో ఎవరు ఉంటారో ఉండరో నాకు తెలియదు కానీ జ్యోతిబసు మాత్రం ఇప్పటికన్నా ఇంకా ఎక్కువ మెజారిటీతో తిరిగి అదికారంలోకి రావచ్చు. ప్రియాదాస్ మున్షీ, అర్జున్ సింగ్ వంటి వారిపై ఎవరైనా గెలవగలుగుతారు. వాళ్లు కూడా గెయిసింగ్‌క యోగ్యతా పత్రాన్ని ఇచ్చారు. అస్లలు అర్జున్ సంగ్ కన్నా యోగ్యులుగా ఎవరు ఉండగలరు?

ఏది ఏమైనా అది అంత ముఖ్య విషయం కాదు అర్థరహితమైన అంశాలపై రాజీవ్ మిత్రబృందం జ్యోతిబసు బృందంతో తగాదా పడుతున్నారు. గూర్ఖాలాండ్ వ్యవహారం అన్నది కలకత్తాలో ఉన్న రాష్ట్రప్రభుత్వం తేల్చవలసింది తప్ప కేంద్రప్రభుత్వం చూడవలసినది కాదని ఆయన అంటున్నారు. 1983లో నే గూర్ఖాలాండ్ జాతియ విముక్తి సంఘటన పశ్చిమ బెంగాల్ ప్రభుత్వానికి రాసిందనీ కానీ దానికి సమాధానం లేదని రాజీవ్ అంటున్నారు. గెయిసింగ్ దేనినీ ఖండించలేదు కానీ అందిన సమాచారాన్ని బట్టి గూర్ఖాలాండ్ జాతీయ విముక్తి సంఘటన రాష్ట్రపతికి, ప్రధాన మంత్రికి కూడా తమ కోరికల గురించి రాసింది. దాని నకళ్లని నేపాల్ రాజుకి కూడా పంపారని తెలుస్తున్నది. నాకు తెలిసినంత వరకూ వారు పశ్చిమ బెంగాల్ ప్రభుత్వానికి ఎలాంటి నకలూ పంపలేదు ఎందువల్ల అన్నది చెప్పటం చాలా సులభం. గూ. జా. వి. సంఘటన అడుగుతోన్నవి నెరవేర్చాల్సింది కేంద్రమే తప్ప రాష్ట్ర ప్రభుత్వం కాదు. వాళ్ళ పోరాటం కొత్త ఢిల్లీతో తప్ప కలకత్తాతో కాదు. ఇంతకీ ఆ వినతి పత్రంలో ఉన్న కోరికలు ఏమిటి? భారత దేశంలో ఉంటున్న నేపాలీ వారికి భారతీయ పౌరసత్వం మంజూరు చెయ్యటం. దీనికి రాజీవ్ గాంధి కూడా వొప్పుకున్నారు.

మన చట్టాల ప్రకారం జాతీయత విషయాన్ని



# న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

నిర్ణయించాల్సింది కేంద్రమే తప్ప రాష్ట్ర ప్రభుత్వం కాదు అందువల్ల గూర్ఖాలాండ్ వ్యవహారం విషయం కూడా బాధ్యత జ్యోతిబసు మీద కాక రాజీవ్ గాంధి పై ఉన్నదన్నది నిర్వివాదాంశం. ఆ రాష్ట్రంలో ఉన్నటువంటి దానికి సంబంధించిన జిల్లా విషయంలో తప్ప పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం అసలు రంగంలోకి రావాల్సిన పనిలేదు. 1983 డిసెంబరు నుంచీ ఏదో ఒక రూపంలో ఉద్యమం కొనసాగుతున్నా రాష్ట్ర ప్రభుత్వం ఎటువంటి చర్యా తీసుకోలేదని రాజీవ్ గాంధి నొక్కి చెబుతున్నారు. గూర్ఖాలాండ్ వారు చెబుతున్న దాన్ని బట్టి ప్రధానమంత్రి కార్యాలయం కూడా 1983 డిసెంబరు నుంచీ రంగంలో నే ఉన్నది. అయినా శ్రీమతి గాంధి కానీ, ఆమె కుమారుడు కానీ దాన్ని గురించి ఎటువంటి చర్యా తీసుకోలేదు. అంటే వారి మనసులలో ఇంకేదో ఉండి ఉండాలి.

ఇప్పుడు గెయిసింగ్ విషయానికి వద్దాము రాజీవ్ గాంధీలాగా కాకుండా ఆయన దొర టోపిని ధరిస్తారు. దాన్ని గురించి మాట్లాడతారు. అది ఇకపై తమాషాగా అనిపించదు. గెయిసింగ్ ఇప్పుడు తామూ, తమ మిత్రులు భారతీయ పౌర సత్వాన్నే అడుగుతున్నామని అంటున్నారు అలాంటప్పుడు వాళ్లు తమ సంస్థని జాతీయ విముక్తి సంఘటన అని ఎందుకు అంటున్నారు? గెయిసింగ్ నిరక్షరకుక్షే కానీ ఆయనకి "జాతీయ", "విముక్తి" అన్న పదాలక తప్పకుండా అర్థం తెలిసే ఉంటుంది డార్జిలింగ్‌ని ఆయన ఎవరి నుంచి విముక్తం చేయాలని ప్రయత్నిస్తున్నారు? కలకత్తా ప్రభుత్వం నుంచి చెయ్యలేరు. ఎందుకంటే అది దాని చేతులలో లేదు. అల్లర్లు లేవదీసే వారి చేతులలో దేశాన్ని చిన్న చిన్న ముక్కలుగా చేసి అది పెట్ట లేదు అసలు విభజన అన్నది నెహ్రూల ప్రత్యేకత. మౌంట్‌బాటన్‌ల సహకారంతో జవహర్‌లాల్ నెహ్రూ 1947లో దేశ విభజనక సహాయ పడ్డారు దాని నుంచి స్ఫూర్తి ని



పొందిన గెయిసింగ్ ఇప్పుడు ఈ ఉద్యమాన్ని రూపొందించి ఉండాలి. ఆయన ఏమి చెప్పినా గూర్ఖాలాండ్ విముక్తి సంఘటన అన్న పేరే దాని అర్థాన్ని సూచిస్తున్నది. భారత దేశం ఉత్తర భాగాన గల జిల్లాల నుంచి గూర్ఖాలాండ్‌ని ఏర్పాటు చెయ్యాలన్నదే దాని లక్ష్యం. అందుకే నేపాల్‌రాజుకీ ఐక్యరాజ్యసమితికీ వినతి పత్రాన్ని పంపారు. దేశంలో దానిపై చెలరేగిన గొడవలకి వారు చలించినప్పటికీ కలకత్తాలో రాజీవ్‌గాంధీ చెప్పిన మాటలు, బూటాసింగ్ చెబుతున్నవి వాళ్ళకి వీనుల విందు చేస్తున్నాయి.

మరో అంశం ఉన్నది. భారత జాతీయత కోసం గెయిసింగ్ అంత ఆసక్తి చూపిస్తున్నప్పుడు భారతీయులని చంపటం ఎందుకు? దేశంమీద, దాని ప్రజల పట్ల ప్రేమని వ్యక్తం చెయ్యటానికి అదొక విచిత్రమైన మార్గం. జరిగిన దానిని బట్టి గూ. జా. వి. సంఘటన అంత ప్రమాదకరమైనది కాదనటానికి వీలు లేదు పంజాబ్‌లో జరిగినటువంటి కుట్ర వంటిదే ఇది కూడా, అదే పద్ధతిలో నడుస్తున్నది. అందులో సుబాష్ గెయిసంగ్ పేరుకి మాత్రమే నాయకుడు. మామూలుగా కంటికి కనిపించే దానికన్నా ఎంతో దాని వెనుక ఉన్నది. రాజీవ్‌గాంధీ చెప్పేది ఒక బడి పిల్లవాడు చెప్పినట్లే ఉన్నది. ఇప్పుడు దాని విషయంలో నిర్ణయం తీసుకోవాల్సింది ఆయనే. ఆయన పూర్తిగా దాన్ని కాదంటే తప్ప జ్యోతిబసు మంత్రి వర్గానికీ, దానికీ ఎలాంటి సంబంధం లేదు. నెహ్రూ కూడా దేశ విభజనలో తమ బాధ్యత ఏమీ లేదనే అన్నారు. అంతేకాక ఇతరులని తప్పు పట్టేవారు. కానీ ఆయన పనుల వల్ల, పొరపాట్ల వల్లనే అది జరిగింది.

మన పాలకుల మనస్థితిలో ఏదో లోపం ఉన్నదా? అందువల్లనే ఎదిగిన ప్రతి భారతీయుడికీ అర్థం అయ్యే విషయం కూడా వాళ్ళు గ్రహించలేక పోతున్నారేమో? అరుణాచల్ ప్రదేశ్‌లో చైనా వారి దురాక్రమణకి కూడా వారి ప్రతిస్పందన అలాగే ఉన్నది మొట్టమొదట ఎవరో కాకుండా మన విదేశాంగశాఖ మంత్రివర్యులే దానిని కాదన్నారు. కానీ తర్వాత ఆయన డిప్యూటీ మంత్రి దానిని పార్లమెంటులో అంగీకరించారు. అందిన సమాచారాన్ని బట్టి చూస్తే చైనా వారు చొచ్చుకు వచ్చింది 7 కిలో మీటర్లు కాదని, 33 కిలో మీటర్లు అంటే దాదాపు 20 మైళ్లని తెలుస్తున్నది. ఈ స్కూలు ఎల్లలక దాన్ని లెక్క వెయ్యటం కూడా సరిగారాదు ☐

# మనలో మాట

మా పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజంట్‌లు, ప్రకటన కర్తలందరికీ దీపావళి శుభాకాంక్షలు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఈ ఏడాది నిర్వహించిన దీపావళి కథల పోటీలో ఎంతో ఉత్సాహంతో పాల్గొని దానిని జయప్రదం చేసిన వారందరికీ మా కృతజ్ఞతలు.

ఈ సంవత్సరం సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చి, ఒక్కొక్కటీ రు. 700/–లు చొప్పున బహుమతి నందుకున్న ఆరు కథల పేర్లని అక్షర క్రమంలో ఈ దిగువ ఇస్తున్నాము:

- ★ ఆ తృప్తి చాలు స్వామి
- ★ నామకరణం
- ★ బరువు – బాధ్యత
- ★ బుద్ధుడు పుట్టిన భూమిలో
- ★ మాయ
- ★ శిఖరం మీద

ఈ ఆరు కథలలో మూడింటిని అదే క్రమంలో ఈ సంచికలో వేసాము. మిగిలిన మూడు కథలని పై వారం సంచికలో ప్రచురిస్తాము.

బహుమతి పొందిన ఈ ఆరుగురు కథా రచయితలకీ మా ప్రత్యేక అభినందనలు.

బహుమతి పొందిన ఈ ఆరు కథలలో పాఠకులు అత్యుత్తమంగా ఎన్నుకున్న కథకి మరో రు. 750/–లు అదనపు బహుమతిగా లభిస్తుంది.

పాఠకుల బాలట్‌లో రెండవ స్థానం పొందిన కథకి మరో రు. 650/–లు, మూడవ స్థానంలో వచ్చిన కథకి మరో రు. 550/–లు అదనపు బహుమతులుగా లభిస్తాయి. మిగిలిన మూడు కథలకీ ఒక్కొక్క దానికీ మరో రు. 350/–లు చొప్పున అదనంగా కన్సొలేషన్ బహుమతులు అందజేస్తాము.

పాఠకుల బాలట్, వ్యాస రచన పోటీ వివరాలని పై సంచికలో ప్రచురిస్తాము.

దీపావళి కథల పోటీకి వచ్చిన కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించాము. ఆ విషయాన్ని తెలియపరుస్తూ ఆయా కథా రచయిత(త్రు)లకి ఉత్తరాలు రాసాము.

పోటీ నిబంధనలని అనుసరించి ప్రచురణకి స్వీకరించని కథలని ఎటువంటి సందర్భంలో నూ తిప్పి పంపటం సాధ్యం కాదు. కాబట్టి వాటి విషయంలో ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదని మరో సారి మనవి చేస్తున్నాము.



# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం . 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

31 అక్టోబరు- 6 నవంబరు, 1986
శ్రీ అక్షయ నామ సం. ఆశ్వయుజ బహుళ త్రయోదశి
సంపుటము 79 : సంచిక 9

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 2.75
పోస్ట్‌లో 6నెలల చందా రు. 78.00
పోస్ట్‌లో 12నెలల చందా రు. 156.00

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధినగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**
నటి : భానుప్రియ
**(ఫోటో : వి. రవిచందర్)**

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :



# ఉత్తరాలు

## ముఖచిత్రం

మృదువైన చెక్కిలిపై
సుతిమెత్తని చేయినుంచి
కనుదోయి చూపులో
కొంటిదనము నింపి
ముచ్చటైన పెదవులపై
వదిగియున్న చిరునగవుతో
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
ముఖచిత్రమై
అందా లొలికించుచున్న
అభినయ నయన తార
సినీ గగన సితార
భానుప్రియ ముఖారవిందం
అత్యంత ఆకర్షణీయం.

-మంతెన విజయలక్ష్మి, విజయవాడ

★ ★ ★

అందాల అభినేత్రి భానుప్రియ ముఖచిత్రం కల ఈ వారం పత్రిక చాలా ఆకర్షణీయంగా వున్నది.

-ఏ. శివప్రసాద్, అపిలేపల్లి

## సీరియల్స్

నటి భానుప్రియ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని సీరియల్స్ అన్నీ చాలా పసందుగా, అందంగా, ముందుకు సాగుతూ, హృదయాన్ని దోచుకుంటున్నాయి.

-ఆకెళ్ళ సుబ్బారావు, కందికుప్ప

★ ★ ★

రావినూతల సువర్ణాకన్నన్‌గారి "కరిగిన శిల" సీరియల్ అత్యద్భుతంగా సాగుతూంది. రమణ, సరయుల ప్రణయ సన్నివేశాలు, పుత్తర ప్రత్యుత్తరాల సారాంశం హృదయాన్ని దోచే విధంగా వున్నాయి. ఇంత మంచి సీరియల్ అందించిన రచయిత్రికి మా ధన్యవాదాలు.

-గొర్లిల్ల రమణారావు,
లక్ష్మీబాయి, ఖర్గపూర్

★ ★ ★

డాక్టర్ కొత్త రవీంద్రబాబుగారి "సంకెళ్ళెవరికి?" సీరియల్ మమ్మల్ని ఆకట్టుకుంది.

-పి. రాము, గుంటూరు

## వ్యాసాలు

3-9 అక్టోబర్ '86 నటి "భానుప్రియ" ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా యున్నది. "శ్రీ అన్నవర దేవాలయం" గురించి చక్కని, తెలియని ఎన్నో విషయాలను తెలియజేసి, మాకు ఆనందాన్ని చేకూర్చారు. వ్యాసం చదివినంతసేపు "శ్రీ అన్నవర దేవాలయం"లో ఉన్నట్లనిపించింది.

-డాక్టర్ చో డాబత్తుల సత్యనారాయణ,
విశ్వనాధన్, కుప్పనపూడి

★ ★ ★

భానుప్రియ ముఖచిత్రంతో వెలువడిన 3-9 అక్టోబరు సంచిక ముగ్ధ మనోహరంగా ఉంది. "శ్రీ అన్నవర దేవాలయం" యొక్క పూర్వపు చరిత్ర చాలా తెలుసుకున్నాము. ఫోటోలు కూడా చాలా బావున్నాయి.

-కె. వెంకటసాయి రామారెడ్డి,
పిట్టల వేమవరం

## కథలు

3-9 అక్టోబరు '86 సంచికలో 'నీతి' కథ బాగుంది. ఇంకా ఈ రోజుల్లో 'నీతి'కి గుర్తింపు, 'నిజాయితీ'కి పెద్ద పీట ఉన్నాయంటే అవి కేవలం కథల్లో మాత్రమేనేమో అనిపిస్తుంది. నిజంగా అంతటి 'సుదినం' వచ్చిన రోజున అవినీతి అమడదూరం పారిపోతుంది.

-వక్కలంక రామారావు, మానేపల్లి

**( 69వ పేజీ చూడండి)**

# కృష్ణావతార వైశిష్ట్యం



విష్ణుమూర్తి అవతారాలలో రామునికీ, కృష్ణునికీ ఉన్న ప్రాముఖ్యత ఎక్కువ. రాముని అవతారంలో కష్టాలు పడిన భూజాత సీతకే ప్రాముఖ్యత వచ్చింది.

కృష్ణావతారం ఆకర్షణీయ మైనది. ప్రతీవారిని తమ అస్తిత్వం లోంచి బైటపడేసేది. కృష్ణ నామామృతంలోనే ఆ మాధుర్యం ఉంది. గీత బోధిస్తున్న కృష్ణుడు గంభీరమూర్తి. ప్రేపల్లిలో రాధాప్రణయాన్ని పొందే మాధవుడు విశ్వమంతటికీ పేరుగాంచాడు.

మీరాభక్తి గేయాలలో శ్రీకృష్ణునే ప్రేమించే నిర్మల మూర్తి సాక్షాత్కరిస్తుంది. భాష తెలియక పోయినా మీరా భజనలు ఈ నాటికీ గానం చేస్తున్నారు. ఇటీవల శ్రీయుతులు సి. నారాయణ రెడ్డి, పి. బి. శ్రీనివాస్, రాజాసాయి కృష్ణమాచేంద్ర మొదలగు వారు కృష్ణుని మీద చక్కని పాటలు వ్రాశారు.

ఈనాడు బహుశ ప్రజాదరణ పొందు తున్నవి కలియుగ దైవమైన వేంకటేశ్వరుని కీర్తనలు. శ్రీకృష్ణుడూ, వెంకటేశ్వరుడూ, విష్ణువు అవతారాలే నని చాలా కీర్తనలలో వ్రాశారు. "చేరి యశోదకు శిశువితడూ" అని మోహనరాగంలో గాయని ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి గానం చేశారు. నిజంగా కృష్ణుని కనులకు కట్టి చూపించేలా వ్రాశారు అన్నమయ్య. తరువాత తత్వాల నీతిని బోధించే శ్రీ సదాశివ బ్రహ్మేంద్రులు కూడా హిందోళ రాగంలో "భజరే గోపాలం మానస భజగోపాలం" అన్న కృష్ణ భక్తి-గీతాన్ని వ్రాశారు. అందులో "నతమందారం , నందకిశోరం, హితచాణూరం. హంసవిహారం", అని చివర నందకిశోరుని వర్ణించారు.

యమునాతీరం, బృందావనం, మురళీగానం, ఈ మూడింటికీ ప్రాణం పోసే పాటలు జనాదరణ పొందాయి. బృందావనంలో ఈనాడు తమాల వృక్షం లేక పోవచ్చు. యమున వాతావరణ కాలుష్యం వల్ల అందాన్ని కోల్పోవచ్చు. ఈ సృష్టి ఉన్నంత కాలం ఉండే కృష్ణప్రేమతత్వం మాత్రం సజీవంగా ఉంటుంది. ఉత్తరాది వారూ, దక్షిణాది వారూ అనే బేధం లేదు కృష్ణభజనకి. బాల్యం, యవ్వన దశలలో కృష్ణుని చేష్టలు వింత వింతగా వర్ణించు కుని ప్రతీ కవీ, వాగ్గేయ కారులూ తరించారు. నేను అనే అహాన్ని విస్మరించమని ప్రబోధించిన పురుషుడూ, పరమ పావనమూర్తి శ్రీకృష్ణుడు. భయానక. భీభత్స రసాలు మనిషిని దిగజారుస్తాయి. నవరసాలలో శ్రేష్టమైన శృంగార రసాన్ని ఎంత అందంగా సజీవంగా కృష్ణుడు తెలియ జెప్పాడో కృష్ణ భక్తులకే తెలుస్తుంది. యవ్వన దశ దాటిన తరువాత మనిషికి కావలసిన మమతాను రాగాలు ఎంత విలువైనవో కూడా కృష్ణ ప్రేమతత్వంలో తెలుస్తుంది. రాధ, సత్య భామ, రుక్మిణి మొదలైన స్త్రీ పాత్రలన్నీ భాగవతంలోని విశిష్టతను తెలియ జెప్పడానికే మలచబడ్డాయి. ప్రతీ పాత్ర సజీవమైనట్లుగా స్ఫురించే గీతా మకరందం జీవానికి జీవితానికీ అవసరమైన ప్రబంధం.

— కె. నాగేశ్వరి






# దీపావళి హాస్య కదంబం


వెధవది! ఏం టపాసులయ్యా ఇవి? అన్నీ సగం సగం పేలినయ్!!
మిగతా సగం మరసటి సంవత్సరం కాల్చుకునే విధంగా - కంపెనీ తయారీ - అంతే సార్!!
బాణాసంచా అమ్మబడును


ఏమిటి? ఈ బాణాసంచా నువ్వు కాల్చటానికేనా? అయితే నువ్వు ఈసారి కూడా నా బిల్లు బ్రహ్మాండంగా ఇచ్చుకుంటావన్నమాట!!


అబ్బే! మీరనుకున్నట్టు నేను చెయ్యితిరిగిన చిత్రకారుడ్ని కాదు - దీపావళి విష్ణుచక్రం వేశానంతే డాక్టర్!!


ఇప్పుడు చూసావా..... ఆ పిల్లి మనల్ని చూసి పరుగెత్తుతుంది -


మేము తయారు చేసిన తారాజువ్వలు అన్నిటికంటె పైకి వెలతాయన్నానే ఈ విధంగానే..!


జస్ట్ వన్ మినిట్ సార్! నాకు ఇలాంటి 'సాహసాలు' చేయడమంటే మహా సరదా!...


పాపం సుబ్బారావ్ గాడ్ని వాడి పెళ్ళాం ఇలాగయినా వదులడం లేదు చూసావా!


దీపావళికి మీ అల్లుడు రావేదా? ఏం??
వస్తే టపాకాయలు కాల్పిస్తానని భయపెట్టాను!

సీరియల్

# కరిగినశిల

రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

కాలం భారంగాగడుస్తోంది.

సరయుని మర్చిపోవడానికి పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్న రమణ ఎంతో మంది అమ్మాయిల్ని చూశాడు. కానీ ఎవరూ అతనికి నచ్చలేదు. సుగుణ కజిన్ బానే వుంది గానీ అతనికీ, ఆమెకీ మధ్య పన్నెండేళ్ళ తేడా వుండడంతో రమణ అంగీకరించలేదు.

అతను ఆశ్రమానికి వెళ్ళి కూడా చాలా రోజులైంది. అతని కేమాత్రం మనసు బావుండక పోయినా ఆశ్రమాని కెళ్ళి ఒకటి రెండు రోజులు గడిపి రావడం అతని కలవాటు. అయితే ఇటీవల పని వత్తిడి వల్ల వెళ్ళలేకపోయాడు.

అందుకే ఈ మధ్య ఆశ్రమం మీద బాగా గాలి మళ్ళిందతనికి. అక్కడున్న ప్రతి వారిలో నూ చిన్నా కనిపిస్తాడు రమణకి. వాళ్ళలో తానూ ఒకడై ఆడిపాడి నవ్విస్తాడు. అందుకేనేమో అక్కడున్న వాళ్ళందరికీ అతనంటే చాలా ఇష్టం!

పనుల ఒత్తిడి కాస్త తగ్గాక ఓ వారం రోజులు శలవు పెట్టి ఆశ్రమానికి బయల్దేరాడు రమణ.

అతను ఆశ్రమానికి చేరేసరికి సుమారు పదకొండు గంటలవుతుంది.

ఆ ఆశ్రమం వున్న విశాలమైన తోట పూర్వం ఓ జమిందారుగారిది. వూరికి కాస్త దూరంగా వున్న ఆ తోట రకరకాల పూల చెట్లతో, పెద్ద పెద్ద ఫలవృక్షాలతో కన్నులపండువుగా వుంటుంది.

చల్లని గాలులు వీస్తూ పట్టణ రణగొణ ధ్వనులకి దూరంగా వుండడం మూలంగా అతి ప్రశాంతంగా వుంటుంది.

జమీన్లు పోయిన జమిందారు తప్పనిసరిగా అమ్ముతుంటే అత్యంత ధనాన్ని వెచ్చించి కొన్నాడా తోటని రమణ. ఆ తోటలో నే ఆశ్రమం నిర్మించాడు.

రమణ కారుని అల్లంత దూరంలో చూడగానే వార్డెన్ పరిగెత్తుకెళ్ళింది గేటు దగ్గరికి.

వాచ్‌మన్ విష్ చేసి గేటు తీశాడు.

జరిగిన కథ– 18: మామగారు అన్న మాటలకు ఆవేశంగా జవాబిస్తాడు ప్రభాకర్. సరయు అడ్రసు డా. శ్యామల దగ్గర తీసుకుని డా. సుగుణ, రమణ, ప్రభాకర్ దగ్గరకు వెళతారు. సరయు డా. ప్రభాకర్ నర్సింగ్‌హోమ్ నుండి వెళ్ళి పోయిందని తెల్సుకుని నిరుత్సాహంగా తిరుగు ముఖం పట్టారు. ప్రభాకర్ వాళ్ళ వంటావిడ కాంతమ్మ శ్యామలకి అసలు జరిగిన విషయం వివరించింది. శ్యామల తన తప్పు తెలుసుకొని భర్త దగ్గరకు వచ్చేసింది. సరయు మేరీ వాళ్ళతో అమెరికా వెళ్ళి పోయిందని వనజ రమణతో చెప్పింది. సరయు మేరీ గారబ్బాయి జేమ్స్‌ని వివాహం చేసుకుంటుందని ఎవరో అనగా విన్న రమణ నిస్రాణగా మంచం మీద కూలబడి పోయాడు.

కారు లో పలికి రాగానే బిలబిల్లాడుతూ చాలా మంది చేరారక్కడికి.

"నమస్కారం!... ఏవిఁటి బాబూ!... ఎలాంటి కబురూ ఛెయ్యకుండానే వచ్చేశారు... ఇవ్వాల్టికి తీరిక చిక్కిందా మీకు?" ఆప్యాయతతో గూడిన నిష్ఠూరంతో అంది వార్డెన్ అతన్ని ఆహ్వానిస్తూనే.

"నమస్తే!... ఏవిఁటో హటాత్తుగా గాలి మళ్ళింది. వుద్యోగస్తుణ్ణి... అనుకున్నప్పుడల్లా రావడం కుదురుతుందా! ఇప్పుడు కుదిరింది... అందుకే కబురైనా చెయ్యకుండా వచ్చేశాను! వారం రోజులుంటాను!" చిన్నగా నవ్వుతూ అన్నాడు రమణ.

వార్డెన్ కూడా నవ్వి–

"రండి బాబూ! .. ఇక్కడ ప్రతిప్రాణీ మీ రాక కోసం ఎదురు చూస్తోంది!" అంది

"అందరూ బావున్నారుగా?" నడుస్తూనే అన్నాడతను.

"తమరి దయవల్ల అందరూ బానే వున్నారు. ఇది చెప్తే గానీ అనాథాశ్రమం అని తెలియనంత ఆనందంగా ఉన్నారు. నిజానికిది అనాథాశ్రమం కాదు బాబూ! పవిత్రాశ్రమం! ఆనందనిలయం! .. దేవాలయం!" ఆరాధనగా అంది వార్డెన్..

"మీరు నన్ను మరీ ఆకాశాని కెత్తేస్తున్నారు.... అక్కణ్ణించి పడితే కష్టం!" నవ్వాడతను.

"నిజం బాబూ! నేనన్నది నూటికి నూరుపాళ్ళూ నిజం!"

"లేదు... నేను కాస్త డబ్బు కర్చు చేశాను... కానీ మీరు జీవితంలో అన్ని సుఖాలూ ఒదులుకుని ఈ అనాథ బాలురే మీ పిల్లలనుకుని కన్నతల్లుల కన్నా ఎక్కువగా కాపాడుతున్నారు. వారి భవిష్యత్తు కోసం పునాదులు వేస్తున్నారు... వారికి అనాథలమన్న భావం లేకుండా హాయిగా ఆడుతూ పాడుతూ వుండేలా తీర్చిదిద్దారు!... ఈ క్రెడిట్ అంతా మీదే!" మనస్ఫూర్తిగా అన్నాడు రమణ.

"ఎంతనిగర్వి! మహానుభావు లెప్పుడూ చేసింది చెప్పుకోరు! నిజంగా మీరు తల పెట్టకపోతే ఈ ఆశ్రమం ఇక్కడ వెలిసేదా?

దిక్కు లేక, తిండిలేక ఈ పసివాళ్ళు దొంగలుగానో, దోపిడీ దారులుగానో, ముష్టివాళ్ళుగానో, లేక వ్యభిచారులుగానో మారకుండా వాళ్ళని దగ్గర చేర్చుకుని–

"మీకు అండగా నేనున్నాను" అంటూ అభయం ఇచ్చి వాళ్ళని ఓ క్రమబద్ధంలో పెంచుతూ, వారి గుండెల్లో ఓ దేవుడై కూర్చున్న తమకెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలీ దేశం!" వుద్వేగంగా అంది వార్డెన్.

"ప్లీజ్! అలా మాట్లాడద్దు! ఎంతో మంది శ్రమతో చేసే యజ్ఞంలో నేనో చిన్న సమిధని మాత్రమే! నన్ను పొగిడి మరీ కించపడేలా చెయ్యకండి!" మరో మాటకి అవకాశం ఇవ్వకుండా చకచక లోపలికొచ్చేశాడు రమణ.

వార్డెన్ ప్రతి గదికీ అతన్ని తీసికెళ్ళి చూపించింది. ఏఏ కొత్త పద్ధతుల్ని అవలంభించారో, ఏఏ మార్పులు చేశారో, కొత్తగా చేరిన ఇద్దరు పసివారి

చరిత్రలు చెప్పింది.

అన్నీ చూశాక మైన్ బిల్డింగ్‌లోని గెస్ట్ రూమ్‌లో కొచ్చాడు రమణ. దాన్ని రమణ తప్ప ఎవరూ వాడరు. అతనున్నా లేకపోయినా ప్రతిరోజూ గది శుభ్రం చేసి పక్క దులిపి, వాజ్‌లో పూలు అమర్చడం వారి కలవాటు.

"మీరు కాస్సేపు రెస్ట్ తీసుకోండి! ఈలోగా నే వెళ్ళి మీకు భోజనం పంపుతాను" అంటూ వెళ్ళిపోయింది వార్డెన్.

ఆ గదిలో సోఫాలో కూర్చుని కిటికీలోంచి బైటికి చూశాడు రమణ.

కనుచూపు మేరంతా పచ్చగా, పూలతో, కాయలతో కళకళలాడుతోంది తోటంతా.

విచ్చీ విచ్చని గులాబీలు, ఎండకి కాస్త వాడినట్టున్న రంగు రంగుల మందారాలు, సువాసనలు వెదజల్లే సుగంధ పుష్పాలు అతన్ని ప్రేమగా పలకరిస్తున్నట్టు తల లూపుతున్నాయి.

ఆ సుందర దృశ్యాన్ని తృప్తిగా, అదో రకమైన తన్మయత్వంతో చూస్తూ లోకాన్ని మరచిన రమణ—

"గుడ్ మార్నింగ్ సర్! ... మీకు భోజనం తెచ్చాను!" అన్న మాట విని తృళ్ళిపడి వెనక్కి తిరిగాడు.

అంతే! ఒక్కసారి నిటారుగా అయిపోయాడు. ఆశ్చర్యానందాలతో కళ్ళు పెద్దవయ్యాయి. మనసంతా మధురాతి మధురంగా అయిపోయింది.

"తనకి భోజనం తెచ్చిన వ్యక్తి సరయు. ఇన్నాళ్ళూ తను కళ్ళల్లో ఒత్తులు వేసుకుని ఆశతో వెతుకుతున్న ప్రియమైన సరయు!... ఏ దేవుడు కరుణించి ఈమె నిక్కడికి చేర్చాడు?" ఆనందంతో అతనికి నోట మాట రావడం లేదు.

ఒక చేత్తో కేరియర్, మరో చేత్తో అరిటాకు పట్టుకుని, పాలరాతి బొమ్మలా.... చలనం లేనట్టు ఆశ్చర్యం నిండిన కళ్ళతో అతన్నే చూస్తూ.... అలా నిల్చుండి పోయింది సరయు.

"సరయూ!" ప్రేమంతా ఆ మూడక్షరాల్లోనే గుప్పించినట్టు తన్మయత్వంగా అంటూ ఆమె కేసి నాలుగడుగులు వేశాడు రమణ.

తృళ్ళిపడి తేరుకున్న సరయు చేతిలోని కేరియర్, అరిటాకు తక్కున కింద పడేసి బైటికి బాణంలా దూసుకు పోయింది.

"సరయూ! ఒక్క మాట విను! ప్లీజ్!" రమణ పరుగున వచ్చాడు బైటకి.

ఎటు మాయమైందో గానీ సరయు మాత్రం అతనిక్కనిపించలేదు.

"ఏవిఁటి? ఏం జరిగింది" అంటూ కంగారుగా వచ్చింది వార్డెన్.

"ఆ. అమ్మాయి..." గొణిగినట్టు అన్నాడు రమణ.

"ఏ అమ్మాయి?"

"అదే.... నాకు భోజనం తెచ్చినమ్మాయి!"

"ఓ సరయా? ఆవిడ మన కొత్త క్లర్క్! చాలా మంచిపిల్ల. పేరుకి క్లర్క్‌గానీ.... ఇక్కడ అన్ని పన్లూ తనే చూస్తూంటుంది. నన్ను కన్నతల్లిలా






## కరిగిన శిల

చూసుకుంటుంది. ఆమె వచ్చాక నాకు చాలా హాయిగా వుంది. మీకు పరిచయం చేద్దామనే ఆమెని పంపి వెనక నేనూ వస్తున్నాను. ఏవిఁటంత కంగారుగా వచ్చారు"? అంది వార్డెన్.

"ఎన్నాళ్ళయిందీ ఈవిడ వచ్చి?" అన్నాడు రమణ వుద్వేగాన్ని అణిచిపెడుతూ.

"ఆ! ఎన్నాళ్ళో ఎక్కడ! రెండు నెలలయిందేమో? పాపం! ఆమెనెవరో మోసం చేశారట! ఎంత ప్రయత్నించినా వుద్యోగం దొరకలేదట! బి. ఏ. టైపు, షార్ట్‌హేండూ అన్నీ పాసయింది. తనూ ఒక అనాథే అనీ, తనకే వుద్యోగం ఇస్తే ఇక్కడే పడుంటాననీ బ్రతిమాలింది.

ఓ సారి క్లర్క్ కావాలని మీతో చెప్తే ఆ వుద్యోగిని సంగతేవిఁటో మీరే చూసుకోండి అంటూ ఆ బాధ్యత కూడా నా మీదే పెట్టారు గదా! అందుకే అన్ని అర్హతలూ వున్న ఈ సరయుకిచ్చాను!" అంది వార్డెన్.

"ప్లీజ్! నేను ఆమెతో ఓ సారి మాట్లాడాలి!" అన్నాడు రమణ గంభీరంగా.

ఆశ్చర్య పోయిన వార్డెన్ తేరుకుని–

"అయితే .... ఆమెనో సారి మీ దగ్గరికి పంపనా?" అంది మృదువుగా.

"ప్లీజ్!"

"రాజా! సరయు అక్కని నేనోసారి రమ్మంటున్నానని చెప్పు!" అక్కడే ఆడుకుంటున్న ఓ కుర్రాడితో చెప్పిందావిడ.

వాడు ఒక్క పరుగున వెళ్ళొచ్చి సరయు లేదన్న వార్త తెచ్చాడు. రమణ గుండె వేగంగా కొట్టుకుంది.

"ప్లీజ్! ఆమెని వెళ్ళనివ్వకండి! నేనోసారి ఆవిడతో మాట్లాడాలి!" దాదాపు అరిచినట్టు అన్న రమణ మాటలకి మరింత తెల్లబోయింది వార్డెన్.

"తప్పకుండా మాట్లాడుదురుగాని! ఏదో పని మీద మరో గదిలో కెళ్ళుంటుంది.... అంతే గానీ మన ఆశ్రమం దాటి వెళ్ళదు" భరోసా ఇచ్చింది వార్డెన్.

అయితే ఆమె భరోసా నిలవలేదు. సరయు ఎక్కడా కనిపించలేదు.

వార్డెన్ ఆలోచనలో పడిపోయింది.

"ఇంతలో ఏమైనట్టు!" అనుకుంది ఆశ్చర్యంగా.

"మళ్ళీ స్వయంగా తనే ప్రతిగదిలోనూ వెతికింది. ఫలితం లేదు. వాచ్‌మన్‌ని అడిగింది. అతను సరయు బైటికెళ్ళలేదని నమ్మకంగా చెప్పాడు.

"లోపలా లేక, బైటా లేక ఆమె ఏమైనట్టు? అసలు ఇతన్ని చూసి ఎందుకలా పారిపోయింది. ఇతను మాత్రం ఆ అమ్మాయికోసం ఎందుకంత ఆరాట పడుతున్నాడు" ఆమె కంతా అయోమయంగా వుంది. తన భావాల్ని మనసులోనే దాచుకుని–

"మీరెళ్ళి భోంచెయ్యండి బాబుగారూ! ఆ అమ్మాయి సంగతి నేను చూస్తాను" అంది వార్డెన్.

అతను మౌనంగా తలూపి వెళ్ళి పోయాడు.

గదిలో కొచ్చి అన్నంతిన్నాననిపించి మంచం మీద వాలిపోయాడు.

"అసలు సరయు తనని గురించి ఏవఁను కుంటోంది? తనో రావణాసురుళ్ళా కనిపిస్తున్నాడా ఆమె కంటికి? ఎందుకలా పారిపోతోంది?

అసలు తను కనిపించిన వెంటనే గట్టిగా పట్టుకుని నీ ఉద్దేశం ఏవిఁటి అని అడగాల్సింది! ప్చ్! ఎన్ని అవకాశాలొచ్చినా ఫూల్లా అన్నీ జారవిడుచు కుంటున్నాను!" అనుకున్నాడు బాధగా. అతని కంటి నించి కొన్ని నీటి చుక్కలు జారి ... దిండులోకి ఇంకి పోయాయి.

* * * * * * * * *

ఆశ్రమంలోని గడియారం పన్నెండు గంటలు కొట్టింది. అర్ధరాత్రి అవడాన ఆవరణంతా నిశ్శబ్దంగా వుంది.

విర బూసిన పూలతీగలు చల్లని పిల్లగాలులకి ఒయ్యారంగా తలలూపు తున్నాయి. దశమినాటి వెన్నెల ఒత్తుగా పెరిగిన చెట్ల ఆకుల్లోంచి పడి వింత వింత డిజైన్స్‌లా కనిపిస్తోంది.

గుబురుగా పెరిగిన సపోటా చెట్టు మీది పిట్ట ఒకటి టపటప కొట్టుకుంది. మైన్ బిల్డింగ్‌కి దూరంగా వున్న తటాకంలోని చిరుచేపలు సరాగాలాడు కుంటున్నట్టు ఎగిరెగిరి పడుతుంటే... ఆ సవ్వడులు వింటూ ప్రకృతికాంత పులకించి పోతోంది.

మావిఁడి తోపులోని గున్న మామిడి చెట్టు గుబురు కొమ్మల్లో, మావిఁడి చిగుళ్ళకోసం చేరిన కోయిలలా దాగిన సరయు ఆశ్రమంలోని లైట్లు ఆరిపోవడం కోసం ఆతృతగా ఎదురు చూస్తోంది. అన్ని లైట్స్ ఆరి పోయినా రమణ గదిలోని లైట్స్ మాత్రం ఆరలేదు.

తెగ చిరాకు పడి పోతోంది సరయు. "తను బైట పడాలంటే రమణ గది పక్కనించే వెళ్ళాలి! అతను అలవాటు ప్రకారం కిటికీ లోంచి చూస్తూ కూర్చుంటే తను ఖచ్చితంగా కనిపించి తీరుతుంది. ఏమైనా సరే అతనికంట ఇంక పడకూడదు! అందరిలా తనూ మోసపోకూడదు. ఏ పడగనీడకి భయపడి ఇంత దూరం వచ్చిందో తిరిగి తిరిగి మళ్ళీ అదే పడగనీడకి చేరుకోవడం ఎంత దురదృష్టం! అసలీ ఆశ్రమం అతనిదని తెలిస్తే తను ఈ ప్రాంతాలకూడా వచ్చేది కాదు." ఇలా ఆలోచిస్తున్న సరయు కళ్ళు తళుక్కుమన్నాయి.

రమణ గదిలోని లైట్ కూడా ఆరిపోయింది.

మరో అర గంట వరకు చూసి, అతను మంచి నిద్రలో వుంటాడని నిర్ణయించుకున్న తర్వాత మెల్లగా చెట్టు దిగింది సరయు.

ఎక్కడో చిరు శబ్దాలు తప్ప అంతా నిశ్శబ్దంగానే వుంది. తడబడుతున్న కాళ్ళతో మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ ఆశ్రమపు గదులన్నీ దాటింది. రమణ గది దగ్గరికొచ్చే సరికి ఒక విధమైన ఒణుకు, నిస్సత్తువ ఆవహించేసిం దామెని.

ఎలాగో గేటు సమీపించిన సరయు వాచ్‌మన్ కోసం చూసింది. అతనక్కడ లేడు. "బహుశా పక్కనే వున్న అతని గుడిశలోని కెళ్ళి వుండచ్చు!" అనుకున్న సరయు తేలిగ్గా వూపిరి తీసుకుని మెల్లగా గేటు మీద చెయ్యేసింది.

అంతే! ఒక్కసారి కళ్ళు మిరిమిట్లు గొలిపాయి. తృళ్ళి పడిన సరయు చివ్వున వెనక్కి తిరిగి కొయ్యబారిపోయింది.

వరండాలోని లైట్ల కాంతిలో ఆరడుగుల రమణ అలా నిల్చుని తన చర్యనే గమనిస్తున్నాడు.

క్షణం సరయు హృదయం స్తంభించి పోయింది. వెంటనే తేరుకుని రెట్టించిన వేగంతో గేటు తీసుకుని చీకట్లోకి దూసుకు పోయింది.

# ప్రతి దేహానికీ సరిపోయేది

# టాన్‌టెక్స్®

బ్రీఫ్‌లు

వెస్ట్‌లు

క్యాజువల్స్

పిల్లల దుస్తులు



tk తంపూరి

Imageads-2321

## కరిగిన శిల

అప్పటిదాకా అలా నిల్చుని ఆమెనే చూస్తున్న రమణ తేరుకుని పరుగులాంటి నడకతో ఆమె ననుసరించాడు రమణ తనని తరుముకొస్తున్నాడని గ్రహించిన సరయు తన వేగాన్ని పెంచింది.

"సరయూ! ఆగు!" అరిచాడతను. ఆమె ఆగలేదు. ఆయాసం, కోపం, దుఃఖం పోటీ పడి ఆమెలోని శక్తిని మింగేసున్నాయి. అయినా ఆమె ఆగలేదు.

దూరం! చాలా దూరం అలా పరిగెడుతూనే వుంది. కొంత దూరం తర్వాత క్షణం ఆగి మెల్లగా వెనుతిరిగి చూసింది.

రమణ కనిపించలేదు

"విసిగి వెళ్ళి పోయుంటాడు!" అనుకున్న సరయు తేలిగ్గా వూపిరి తీసుకుంది

"వెళ్ళి నట్టే వెళ్ళి ఏ చెట్టు చాట్నుంచో రాడుకదా!" అన్న భయంతో కాసేపు చూసింది. అతను రాలేదు. నీరసంగా ఓ చెట్టు మొదట్లో చతికిల బడింది.

అంతా నిర్మానుష్యంగా వుంది.

"ఇక్కణ్ణుంచి ఎలా వెళ్ళడం? తెల్లారితేగానీ ఏ బస్సూ రాదు! ఏ లారీ అయినా వస్తే బావుండు . బతిమాలి లిఫ్ట్ అడగచ్చు!" అనుకుంది సరయు కానీ, ఏలారీ రాలేదు. నిస్సహాయత్వంతో ఆమెకి ఏడుపు కూడా వచ్చేస్తోంది.

దూరంగా ఏవో లైట్స్ కనిపించింది సరయుకి. అయితే అది వూళ్ళోంచి వస్తోంది.

"ఎలాగైనా బ్రతిమాలి.... కాస్త వూళ్ళోకి దించమని అడగాలి" అనుకుంటూ, ఆశగా దారికడ్డంగా నిల్చుని చేతులు వూపింది సరయు.

కారు ఆగింది.

"ఏవిఁటీ?" అన్నట్టు చూశాడు డ్రైవింగ్ సీట్లోని వ్యక్తి.

"ప్లీజ్!.... నన్ను కాస్త వూళ్ళో దించిరారూ?" వెనక్కి తిరిగి భయం భయంగా చూస్తూ అంది సరయు.

"నేనటుకాదుగా వెళ్ళేది!" బొంగురుగా వుందతని గొంతు.

"నిజమేఁ . కానీ, నేను చాలా ఆపదలో వున్నాను సర్.... కాస్త నన్ను వూళ్ళో దించండి! కనీసం వూరిక్కాస్త దూరంలో వున్న సెంటర్లో నైనాసరే!" వేడికోలుగా అంది సరయు.

అతనో క్షణం ఆలోచించి కారు రివర్స్ చేసి ఫ్రెంట్‌డోర్ తీసి "ఎక్కండి!" అన్నాడు

ఎందుకో క్షణం సందేహించింది సరయు. "తను పులినోట్నుంచి సింహం నోటి దగ్గర కెళ్ళడం లేదుకదా! కానీ తప్పదు!" అనుకుని–

"ప్లీజ్.... ఓసారి లైట్ వెయ్యరూ? చీకటంటే నాకు భయం!" అంది.

అతను చిన్నగా నవ్వాడు.

"ఎందుకు నవ్వారు?" వింతగా చూసింది సరయు.




"అహఁ! అర్థరాత్రి! కటిక చీకటిలో, వూరికి దూరంగా వున్న ఈ నిర్మానుష్య ప్రదేశంలో ఒంటరిగా నిల్చుని నా కార్నాపినప్పుడు లేని భయం ఇప్పుడు కార్లోని చీకటిని చూడగానేవచ్చిందంటే నవ్వొచ్చింది." అంటూ లైట్ వేశాడతను.

లైట్ వెలుగులో స్పష్టంగా అతన్ని చూసిన సరయు కెవ్వుమంది. అంతే! మళ్ళీ పరుగు ప్రారంభించింది.

అతను రమణ!

ఆమెకి అనుమానం రాకుండా పక్క దార్నించి ఇలా వచ్చాడు.

"ఏయ్! సరయూ! ఆగు!" అన్నాడు.

సరయు ఆగలేదు.

"సరయూ! డోంట్ బీ ఎ ఫూల్! ఎక్కడికి పోగలవ్? ఇంత జరిగాక ఇంకా నిన్నొదుల్తాననే అనుకుంటున్నావా?" కారు దిగిన రమణ ఆమెని వెంటాడి రెండు నిమిషాల్లో పట్టుకున్నాడు,

ఆమె స్పర్శ అతనిలో చెప్పలేని వుత్సాహాన్ని తెచ్చింది

"ఒదులు! నన్నొదులు! ఛీ! నువ్వు రాక్షసుడివి! కిరాతకుడివి!" అతని చేతుల్లోంచి తప్పించుకోవాలని విశ్వ ప్రయత్నం చేసింది సరయు. పిడికిళ్ళతో అతని గుండెల మీద కొట్టింది

ఆమె విదిలించిన కొద్దీ తన పట్టు బిగించాడతను. బలవంతంగా ఆమెని ఫ్రెంట్ సీట్లో కూలేసి, ఎడంచేత్తో ఆమెని పెనవేసి పట్టుకుని కుడిచేతిలోకి స్టీరింగ్ తీసుకున్నాడు.

"ఒదులు! ఒదలకపోతే అరుస్తాను!" గట్టిగా అరిచింది సరయు, వుక్కులా వున్న అతని చేతుల్నించి తప్పించుకునే ప్రయత్నం చేస్తూనే.

"అరు! గట్టిగా అరు!" అన్నాడతను

అతనికిప్పుడు బికారికి ఒక్కసారి సర్వసంపదలు లభించినంత ఆనందంగా వుంది.

"రమణా! ప్లీజ్! నన్నొదిలెయ్! ఇంక జీవితంలో నీ కన్నిపించను!" కాళ్ళ బేరాని కొచ్చింది సరయు.

"అదిగో! అందుకే నిన్నింక చచ్చినా వదలను!" రోడ్డుమీంచి దృష్టి మరల్చకుండానే అన్నాడు రమణ

కారు ఆశ్రమానికేసి పరుగు తీసింది

"రమణా! మా అమ్మ నిన్ను అభిమానించినందుకైనా నన్నొదిలెయ్ రమణా! ప్లీజ్!"

తనని కాదన్నట్టు మౌనంగా డ్రైవ్ చేస్తున్నాడు రమణ.

"ఇదిగో! మర్యాదగా చెప్తున్నాను కారాపు!"

అప్పుడూ అతను మాట్లాడలేదు.

"ఆపకపోతే దూకేస్తాను!" ఆఖరి అస్త్రంలా బెదిరించింది సరయు

"దూకెయ్!"

"ఇదిగో! నిజంగా దూకేస్తాను!"

"ఏదీ దూకు చూద్దాం!" కవ్వించాడతను

రోషంగా పెనుగులాడింది సరయు. రమణ చెయ్యి మరింత బిగుసుకుంది.

"యూ బ్రూట్! ఒదులు! . . అయ్ హేట్ యు!" అరిచింది సరయు.

"బట్.... బట్యయ్ లవ్ యు సోమచ్ డియర్!" సరయుని మరింత దగ్గరగా లాక్కుని, ఆమె చెంపకి తన చెంప ఆర్తిగా రాస్తూ అన్నాడు రమణ.

ఆమె వూపిరి వేడిగా తగుల్తోందతనికి రమణ పెదవులు ఆమె పెదవుల్ని సున్నితంగా తాకాయి

అంతే! ఆమె మరి పెనుగులాడ లేదు తన్మయత్వం చెందినట్టు అతని భుజం మీద వాలిపోయింది. అతని మెడలో ముఖాన్ని దాచుకుంది, సిగ్గుల మొగ్గయినట్టు.

ఆమెలోని మార్పుకి లోకాన్ని జయించినంత వుప్పొంగి పోయిందతని హృదయం

అలా తన్మయావస్థలోనే ఆశ్రమం చేరుకున్నారు

ఆశ్రమంలోని లైట్లన్నీ వెలిగి పట్టపగల్లా వుంది. అతని కారు చూడగానే బిలబిల్లాడుతూ కారు దగ్గరికి పరిగెత్తుకొచ్చారు. కార్లో రమణతో పాటు సరయు కూడా వుండడంతో తేలిగ్గా వూపిరి తీసుకున్నారు.

"సరయు! ఆశ్రమాని కొచ్చేశాం దిగు!" గుసగుసగా అన్నాడు రమణ.

ఆమె దిగలేదు

"దిగు డియర్!"

ఈసారి దిగలేదామె.

ఆమె సిగ్గుకి మనసులోనే నవ్వుకుంటూ తనే ఆమెని పొదివి పట్టుకుని దించబోయాడు

సరయు తల అతని బుజం మీద వాలిపోయింది చేతులు వ్రేలాడి పోతున్నాయి.

సరయు కేసి పరిశీలనగా చూసిన అతనికి ఆమెకి స్పృహలేదని తెలిసి పోయింది.

"మైగాడ్! ఈమెకి స్పృహలేదు!" కంగారుగా అరిచి ఆమెని రెండు చేతులతో టే పసిపిల్లలా ఎత్తుకుని లోపలికి తీసుకొచ్చాడు రమణ.

వార్డెన్ హడావిడిగా వచ్చి అతని గదిలోని బెడ్ సవరించింది. సరయుని మెల్లగా మంచంమీద పడుకో బెట్టాడు రమణ. అపరాధిలా తలదించుకున్న, అతనికేసి అయోమయంగా చూస్తూ సరయు చెవిలో....

"సరయూ!" అంది వార్డెన్. సరయు పలకలేదు. రమణకేసి కంగారుగా చూసింది వార్డెన్.

"నన్ను చూసి అప్‌సెట్ అయింది!" అన్నాడతను మెల్లగా.

"డాక్టర్ని పిలవనా?" తడిగుడ్డతో సరయు మొహం తుడుస్తూ అంది వార్డెన్.

"అవసరం లేదు. కాస్సేపట్లో తనే లేస్తుంది. మీరంతా వెళ్ళి పడుకోండి!" పాలిపోయిన మొహంతో అన్నాడు రమణ.

అందరూ మౌనంగా నిష్క్రమించారు.

రమణ మనసంతా శూన్యంగా అయిపోయింది. "సరయుకి తనంటే అంత భయం వుందా? అంత అసహ్యం వుందా? తన వునికి అంటేనే గిట్టని సరయు అంటే తన కెందుకింత ఇష్టం? తన స్పర్శకే స్పృహ కోల్పోయే ఆమె కోసం ఎందుకీ పరుగులు? అసలు సరయుకి తనంటే ఎందుకంత కోపం?

అక్కున చేర్చుకుని పెంచే అమ్మపోతే నాన్నలో ఆ అమ్మని చూసుకుని వూరట చెందాడు. నాన్నపోతే.... చిన్నాలో సుఖాన్ని వెతుక్కుంటూ తమ్ముడినే ప్రాణంగా బతికాడు. ప్రాణంలో ప్రాణంగా చూసుకున్న చిన్నాపోతే చిన్నాలాంటి అనేక మంది తమ్ముళ్ళలో చిన్నాని చూసుకుంటూ తేరుకున్నాడు.

కానీ ఏమీకాని..... సరయు దూరమైతే సరయుని మరో యువతిలో చూసుకోలేకపోతున్నాడు. ఆమెని మరవడం తనకి సాధ్యం కావడంలేదు. పిచ్చిగా ఆమెనే ఆరాధిస్తున్నాడు.

కానీ.... శిలలాంటి సరయుకి ప్రేమకి అర్థమే తెలియదే! తనెలా చెప్పగలడు!.... ఎలా దగ్గరికి చేరగలడు!" బాధగా గొణుక్కున్నాడు రమణ.

ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయాని కొచ్చిన రమణ మెల్లగా లేచి సరయు గదిలోకి నడిచాడు. తప్పనిసరిగా ఆమె గదంతా గాలించాడు.

అతని వూహ నిజమైంది.

అతను వెతుకుతున్న డైరీ కనిపించింది.

పది నిమిషాల్లో అందులో అతనిక్కావల్సింది దొరికింది. అతని కనుబొమలు ముడి వడ్డాయి.

మెల్లిగా లేచి ఎక్కడి వక్కడ సర్దేసి తలుపులు వేసి తన గదిలో కొచ్చాడు రమణ.

సరయు అంతకుముందెలా పడుకుందో అలాగే పడుకుని వుంది.

టేబిల్ ముందు కూర్చుని పెన్ను, పేపర్ అందుకుని ఓ లేఖ తయారు చేశాడు. పూర్తి చేసిన ఆ వుత్తరాన్ని సరయు మంచం పక్కగా వున్న స్టూల్ మీదుంచి, రాసిన పెన్నునే వెయిట్‌గా పెట్టి ఓసారి పరిశీలనగా సరయుకేసి చూశాడు రమణ.

స్పృహ లేనట్టుకాక, సరయు ప్రశాంతంగా నిద్ర పోతున్నట్టుంది. ఫేన్ గాలికి ముంగురులు చెక్కిళ్ళ మీదపడి అల్లల్లాడుతున్నాయి. జడ మంచం మీది నుంచి కిందికి జారి నల్ల తాచుని గుర్తుకు తెస్తోంది.

మెల్లిగా ఆమెని సమీపించి మూసివున్న ఆమె కనురెప్పల్ని అంటీ అంటనట్టు ఓసారి పెదవులతో తాకి రెండడుగులు వెనక్కి వేసి-

"బై డియర్! గుడ్ బై!" అంటూ నీళ్ళు నిండిన కళ్ళతో మెల్లిగా గొణుక్కుంటూ మరో గదిలోకి వెళ్ళిపోయాడు రమణ. (ఇంకా ఉంది)

# తీవ్రవాదులకి అనుకూలంగా ఉన్న భద్రతా వ్యవస్థ

# ప్రధాన మంత్రిపై హత్యా ప్రయత్నం !

గాంధీ జయంతి సందర్భంగా అక్టోబర్ 2న మహాత్ముని దివ్యస్మృతికి శ్రద్ధాంజలి ఘటించడానికి రాజ్‌ఘాట్‌కి వెళ్ళిన ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీపై హత్యా ప్రయత్నం జరిగింది. పంజాబ్‌కి చెందిన సిక్కు తీవ్రవాది కరమ్‌జిత్‌సింగ్ ఆయనపై మూడుసార్లు నాటు తుపాకితో కాల్పులు జరిపాడు. అదృష్టవశాత్తు ప్రధానమంత్రికి ఏ ప్రమాదమూ సంభవించలేదు. అంతకుముందు రాత్రి నుంచే తాను అక్కడి పొదలలో దాగి ఉన్నట్లు ఆ తీవ్రవాది పోలీసులకి చెప్పాడు. ప్రధానమంత్రి రక్షణ బాధ్యతని వహించే వందలాది భద్రతా సిబ్బంది కళ్ళుగప్పి ఆ తీవ్రవాద యువకుడు పొదలలో దాగి, మూడుసార్లు ప్రధానమంత్రిపై కాల్పులు జరపటం అన్నది సామాన్య విషయంకాదు. అత్యున్నత పదవులలో ఉన్న వారి రక్షణ విషయంలో కూడా భద్రతా ఏర్పాట్లు లోపభూయిష్ఠంగా ఉన్నాయని ఈ సంఘటన మరోసారి ఋజువు చేసింది.

దేశంలో తీవ్రవాద కార్యకలాపాలు నానాటికీ పెచ్చరిల్లిపోతున్నాయి. స్త్రీలు, పసిపిల్లలు అన్న విచక్షణ లేకుండా ఎందరో అమాయకులు తీవ్రవాదుల రక్తదాహానికి బలైపోయారు. తీవ్రవాదుల చర్యలని ఖండిస్తూ రాసినందుకు హింద్ సమాచార్ పత్రిక సంపాదకుడు లాలా జగత్‌నారాయణ్‌ని తీవ్రవాదులు దారుణంగా హత్యచేశారు. ఆ సంఘటనతో జర్నయిల్‌సింగ్ భింద్రన్‌వాలే అసలు స్వరూపం బయటపడింది. అనంతరం కీ. శే. లాలా జగత్ నారాయణ్ కుమారుడు రమేష్‌చందర్ తమ తండ్రి అడుగుజాడలలో ఆ పత్రిక చేపట్టినందుకు ఆయన కూడా తీవ్రవాదుల ఘాతుకానికి బలైపోయారు.

తీవ్రవాదుల బృందాన్నొకదానిని చిన్నాభిన్నం చేసారన్న పగతో 25.4.83న జలంధర్ పోలీసు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ అవతార్‌సింగ్



రాజీవ్ గాంధీ

అత్వాల్‌ని స్వర్ణ దేవాలయంలో ప్రార్థనలు చేసి తిరిగివస్తుండగా ఆ గుడి ఆవరణలోనే కాల్చిచంపారు.

ఢిల్లీలో గురుద్వారా యాజమాన్య సంఘం అధ్యక్షుడు, ప్రముఖ వ్యక్తి అయిన హర్బన్స్‌సింగ్ మాన్‌చందాని కారులో వెళుతూ ఉండగా 'దశ్‌మేష్ రెజిమెంట్'కి చెందిన తీవ్రవాదులు ఆయనని చంపివేశారు. ఈ తీవ్రవాదులే అమృతసర్ భారతీయ జనతాపార్టీ అధ్యక్షుడు హర్‌బన్స్‌లాల్ ఖన్నాని 2.4.84న హత్య చేసారు. ఆ మర్నాడే రాజ్యసభ సభ్యుడు విశ్వనాథ్‌తివారిని కాల్చి చంపారు. తీవ్రవాదుల తూటాలకి బలైన మొట్టమొదటి పార్లమెంటు సభ్యుడు ఈయనే.

బంగారుగుడిలోకి సైన్యాన్ని పంపారన్న కక్షతో 1984 అక్టోబర్ 31న భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీని ఆమె ఇంటి ఆవరణలోనే తీవ్రవాదులతో చేతులు కలిపిన సిక్కు అంగరక్షకులు అమానుషంగా హత్య చేశారు. భారతదేశ చరిత్రలో అత్యంత దారుణమైన దుర్ఘటన అది. ప్రజాస్వామ్య వ్యవస్థకే ముప్పుతెచ్చినదారుణ హింసకి అది తార్కాణం. తీవ్రవాదుల పైశాచిక ప్రవృత్తి విలయతాండవానికి పరాకాష్ఠ శ్రీమతి గాంధీ దారుణ హత్య. భద్రతా ఏర్పాట్లలోని అవకతవకలే ఆమె హత్యకి వీలు కల్పించాయి. అయినా ఇప్పటికీ అవి కట్టుదిట్టంగా లేవని మొన్న జరిగిన హత్యా ప్రయత్నం నిరూపిస్తున్నది.

కాంగ్రెసు (ఐ) పార్లమెంటు సభ్యుడు లలిత్ మాకెన్, ఆయన సతీమణి గీతాంజలి 1985 జూలై 31న తీవ్రవాదుల తుపాకి కాల్పులకి బలైపోయారు. పాకిస్తాన్‌లో శిక్షణ పొందిన తీవ్రవాదులిద్దరు ఆయనని హత్య చేయటానికి పథకం వేసారని, జాగ్రత్తగా ఉండమని రాసిన ఒక ఆకాశరామన్న ఉత్తరం పోలీసులకి వారి హత్యానంతరం అందింది.

1985 సెప్టెంబర్ 4న ఢిల్లీ మెట్రో పాలిటన్ కౌన్సిల్ సభ్యుడు అర్జున్‌దాస్‌ని తీవ్రవాదులు కాల్చిచంపారు. అంతర్జాతీయ తీవ్రవాదిగా పేరుపొందిన లాల్‌సింగ్ హస్తం ఇందులో ఉన్నదని పోలీసులకి ఆధారాలు లభించాయి.

పంజాబ్ ఒప్పందం అనంతరం అకాలీమితవాదుల నాయకుడు, అకాలీదళ్ అధ్యక్షుడు అయిన సంత్ హర్చంద్‌సింగ్ లోంగోవాల్ షేర్‌పూర్ గురుద్వారాలో ప్రార్థన చేస్తూ 1985 ఆగస్టు 20న తీవ్రవాదుల తూటాలకి బలైపోయారు.

బంగారు గుడిలో సైనిక చర్యకి నాయకత్వం వహించారన్న కారణంగా సైనిక దళాల మాజీ ప్రధానాధికారి జనరల్ ఎ.ఎస్. వైద్య 10-8-86న తమ సతీమణితో కారులో వెళ్తూ ఉండగా తీవ్రవాదులు మోటార్‌సైకిల్‌పై వచ్చి వారిపై కాల్పులు జరిపారు. జనరల్ వైద్య ప్రాణాలు కోల్పోయారు. ఆయన సతీమణి తీవ్రంగా గాయపడ్డారు. ఆయనని హత్య చేసామని



లాలా జగత్ నారాయణ్



ఎ. ఎస్. అత్వాల్



లలిత్ మాకెన్



లోంగోవాల్



అర్జున్‌దాస్



జనరల్ వైద్య

తీవ్రవాదులు ముందుగానే ఉత్తరాలు రాసినా ఆయన రక్షణ సిబ్బంది ఆయన ప్రాణాలని కాపాడలేకపోయింది. వారి నిర్లక్ష్యమే తీవ్రవాదులకి అవకాశాన్ని కల్పించిందని శ్రీమతి భానూవైద్య అన్నారు.

ప్రధాన మంత్రి రాజీవ్‌గాంధిపై హత్యా ప్రయత్నం జరిగిన మర్నాడు ఉదయమే పంజాబ్ పోలీసు ప్రధానాధికారి రిబెయిరోపై తీవ్రవాదులు దాడిచేసారు. పంజాబ్ సాయుధ దళ సముదాయం ఆవరణలో తమ భార్యతో రిబెయిరో ఉదయం



రిబెయిరో

నడకకి వెళుతున్న సమయంలో తీవ్రవాదులు పోలీసు దుస్తులతో, జీపులో వచ్చి అక్కడి కాపలా సిబ్బందిపై కాల్పులు జరిపారు. తర్వాత రిబెయిరోపై కూడా తుపాకిగుళ్ల వర్షాన్ని కురిపించారు. ఆయన ప్రమాదాన్ని పసికట్టి నేలపై పడిపోయాడు. ఆయన సతీమణికి కాలిమీద తుపాకిదెబ్బ తగిలింది. రిబెయిరో చేతిమీద స్వల్ప గాయంతో తప్పించుకోగలిగారు. లోపలివారి సహాయ సహకారాలు లేకుండా తీవ్రవాదులు ఆ ఆవరణలోనికి రావటం సాధ్యంకాదని ఆయన అన్నారు.

ఈ సిక్కు తీవ్రవాదుల పైశాచిక చర్యలు నానాటికీ పెరిగిపోతున్నాయి. వారికి విదేశాల నుంచి తుపాకులు,



ప్రధాన మంత్రిపై హత్యా ప్రయత్నం చేసిన కరమ్‌జిత్ సింగ్

ఆయుధాలు అందుతున్నాయి. దేశంలోని బాంకులని దోచుకోవటం ద్వారా మరింత ధనాన్ని సమకూర్చుకుంటున్నారు. పాకిస్తాన్‌లో వీరికి శిక్షణ, ఆయుధాలు అందజేయబడుతున్నాయి. హిందూ-సిక్కు ఐక్యతని భగ్నం చేయటమే ఈ తీవ్రవాదుల ప్రధాన లక్ష్యం. తద్వారా ఖలిస్తాన్ ఆవిర్భావాన్ని సాధించాలన్నదే వారిధ్యేయం. కొందరు అకాలీ నాయకుల అండదండలు కూడా వారికి ఉన్నాయి. దేశంలో హింస ద్వారా అల్లకల్లోలాన్ని సృష్టించడానికి వారు ప్రయత్నిస్తున్నారు. అంతర్జాతీయంగా కూడా తీవ్రవాదం వెర్రితలలు వేస్తున్నది. తీవ్రవాదుల విషయంలో కట్టుదిట్టమైన చర్యలు తీసుకుని కఠినమైన రీతిలో దానిని అణచివేసేందుకు ప్రయత్నించకపోతే పరిస్థితులు మరింత దారుణంగా పరిణమించే సూచనలు కనిపిస్తున్నాయి. మత సామరస్యాన్ని, దేశ సమైక్యతని సమగ్రతని, పరిరక్షించవలసిన బాధ్యత అందరి మీదా ఉన్నది. (జి. వి)

# దీప్త జ్వాల




మృత్యు కౌగిలిలోన గ్రుంగుదువడి తల్లి
    ఎదనున్న ఇందిర ఎంత బేల
బద్ధ శృంఖలలోన పడియున్న తండ్రిని
    గాంచునప్పుడు సాశ్రుగళ కపోల
స్వాతంత్ర్య సమరంబు బాటు గాంధి ప్రక్క
    నివురు గప్పుకయున్న నిప్పుజ్వాల
బంధనాల్ తెగి కలపండి వచ్చిన వేళ
    విశ్వయ్యె చుట్టిన విహగ బాల

ఆమె ఇందిర నకనకలాడు దేశ
ముప్పరంబెత్తు ఎత్తిన యోద్ధురాలు
అడ్డుకొన జూచు మేటి ప్రత్యర్థి ఆట
భగ్నమొనరింప వచ్చిన భద్రకాళి

దేశము ఎక్కడో మురికిద్రెళ్ళిన వాడల నుండునంచు సం
దేశము ఇచ్చి గాంధి లఘు దేహము వీడిచనన్ స్వశాసనా
దేశపు దివ్వెబట్టుకొని తీరని భూముల ద్రెచ్చి త్రచ్చి జీ
ర్ణాశయ జీవులన్ వెదక నట్టడు గెంతటి లోతు కౌగితో

ఉదరము నుండి వెల్వడు నవోదయ రక్తపు పచ్చి కందువున్
బొదవి గ్రసింప జూచు పులి పొల్పున నున్న కిరాత విశ్వపున్
బెదవికి నంటనీక, అతి ప్రేమతో దెచ్చిన స్వస్వతంత్రతన్
గుదురుగ దాచుకున్న పితకున్ దగు కూతురువమ్మా ఇందిరా!

హద్దులు గీచి దేశ సరిహద్దులు ఎల్లలు చేసి యుద్ధముల్
వద్దను ఆట నీవు అలవాటుగ ఆడినగాని శాత్రవుల్
నిద్దురబోరు, పోరుకగు నిత్యపు ఖర్చుతో దైన్య భారతిన్
దిద్దుదమన్న నీ తలపు తీరదు, ఆరదు రక్తమూర్విలో

నీ నవ్వు చల్లగా నిల్చి పూచెనో యన
    దేశ వనరులు చిందించె సిరులు
నీ ఊహ ఎత్తుగా నింగికెగిరెనో యన
    హరికోట రాకెట్టు అభ్రమంటి
నీ చెల్మి చిక్కగా నిఖిల భూములగప్ప
    వచ్చేనేమొ అలీన భావమొప్ప
నీ ఐక్యతావాణి నిత్య శాశ్వతమేమొ
    ఎగరవేదరి జెండా ఎఱ్ఱకోట

సేవయు నటనగా చేయ క్షేమముండు
కక్షగట్టిన యట్టుల కదిపి మురికి
కడుగబో కాదె దానికి కడుపు మంట
చింది నీ మీద బడి చేసె చిత్రహింస

అమ్మగ దేశమంతటకు అందరు బిడ్డలుగాగ సాకు ఎ
న్నమ్మవు పేరుకుందగుదు వారసులకిత్తువు కూడుగుడ్డ, ప
ద్దమ్మలు మంత్రులై ప్రజల దైన్యపు కష్టము కమ్మ నేతిలో
జిమ్మ పసందుగా మెసవ చింతిల యెంత కృశించితో యెదన్

అమలము నీదు జీవితము అమ్మరో! నీవు అజేయురాలివై
కమల లతాంత భాసుర సుగంధము చిల్కిన యట్లు భారతో
ద్యమ గగనమ్ములో తుది పథమ్మున నెప్పుడు జారిపోని పో
డిమి యది దానికిం దగిన తీవియు జూపితి వమ్మ ఇందిరా!

అమ్మా! నీవొక ఇందిర
వమ్మా! మా జాతి బీల్చు అధముల ద్రుంచె
వమ్మా! నీ రక్తము మ
గుమ్మానికినంటి మేము క్రుంగితిమమ్మా!

పద్యాలను, హృద్యంబౌ
గద్యాలను, నవ్య కావ్య కవితా ధ్వనులన్
సద్యస్ఫూర్తిగ గొన అన
వద్యము నీ చరిత అన్యపస్తువు గలదె!

జాతికి గర్వము నీవీ
జాతికి ఒకకాంతి బాట, జ్వాజ్వల్యము, ప్రా
భాతిక కిరణ లతాంత
వ్రాతమువలె వెల్గు నీదు భావనలమ్మా!

(శ్రీమతి ఇందిరా గాంధీ ద్వితీయ వర్ధంతి సందర్భంగా)

\- ముత్యాల

దీపావళి కథలపోటీలో రు.700/- బహుమతి పొందిన కథ

# ఆత్మీయులు సామీ!

"ఓబుళేసూ! ఒరే ఓబుళేసూ!!"

"వత్తున్నా సామీ!"

"ఆ కాఫీ కప్పులు తీయవేంరా? ఆ బల్ల మీద సూడు.... ఈగలు ఎలా – ముసురు తున్నాయో!.... ఇంత బద్ధకమైతే ఎలారా ఓబులూ...." అంటూ సున్నితంగా మందలించాడు ఎర్రమనాయుడు.....

ఓబులు కాఫీ కప్పులు తీసి నాపరాయి బల్లను శుభ్రం చేశాడు.... మౌనంగా తడికెల గది లోనికి వెళ్ళి పోయాడు.....

"ఓబుళేసూ!....."

ఓబులు వచ్చాడు జారి పోతున్న ఖాకీ నిక్కర్ని పైకి లాక్కుంటూ!.....

"ఎంకటేసుకు ఎగస్టరా పాలు చెప్పావా?"

తలూపాడు ఓబులు.....

"ఇడ్లీ పిండి నాలుగో వాయికి......"

"అమ్మయ్యకు సెప్పి నాసామీ!....."

ఎర్రమ నాయుడుకి యింకేం అడగాలో తెలియలేదు..... ఓ సారి ఓబులు ముఖం లోనికి చూశాడు.... వాడి ముఖంలో ఏదో నిర్లిప్తత..... మరీ దిగాలుగా వున్నాడు.

ఓబుల్ని గమనిస్తూనే వున్నాడు నాయుడు. ఓబులు హుషారుగా లేడు ఎంతో చలాకీగా చక చకమని పనులు చేస్తూ, హోటల్ కొచ్చే జనాన్ని తన చిలిపి మాటలతో ఆకట్టు కునే ఓబులు యీ రోజు ఎందుకనో అన్యమనస్కంగా ప్రవర్తిస్తున్నాడు. ...? ఓబులు మనసుకు ఏదో బాధ కలిగుండాలి!ఓబుల్ని ఎవరేమైనా అన్నారా? అనేందుకు ఎవరున్నారని? తనూ.... సరస్వతి! తప్ప!!

ఓబులు ఎదురుగ్గా నిలబడే వున్నాడు.. వాడి పై నుంచి చూపులు మరల్చుకున్నాడు ఎర్రమ నాయుడు.. .

"ఇక హోటల్ కట్టేద్దాం! గాడి పొయ్యి ఆర్పేసేయి ...!!"

"అట్లనే సామీ!...." అంటూ లోనికి పరుగు లాంటి నడకతో వెళ్ళి పోయాడు ఓబులు....

అప్పుడే హోటల్ మూస్తామంటా రేమిసామీ! ఇంకొంచెం సేపు సూద్దాము" అంటూ బాగా చీకటి పడ్డాక గాని హోటల్ కట్టేయడానికి అంగీకరించని ఓబులు యీ రోజు వెంటనే ఒప్పుకున్నాడంటే ఏదో జరిగుండాలి? ఓబులు మానసికంగా ఎందుకనో బాధ పడుతున్నాడు ... అదేంటో కనుక్కోవాలి అని నాయుడు నిశ్చయించు కున్నాడు

హోటల్.. సరస్వతీ విలాస్ చిన్న పాకలో వుంది. సోంపేట బస్టాండులో వుంది. ఆ 'రూట్లో' రోజూ ఓ ముప్పై బస్సులు దాకా నడుస్తాయి.... పది బస్సులు మాత్రమే ఆగుతాయి.. ఆ దిగే జనం. ఎక్కే జనం మాత్రమే ఆ హోటలుకు వచ్చే వాళ్ళు... సాయంకాలం ఆరు కంతా లాస్టు బస్సు... ఆ బస్సు వెళ్ళిపోతే యిక జనమే వుండరు... కాని లారీలు మాత్రం వచ్చి ఆగుతాయి.. . వాళ్ళు తాగేది మాత్రం 'చాయ్'.

ఓబులు పొయ్యి ఆర్పాడు. మిగిలిన పాలను చిన్న 'కెటిల్'లో పోసుకున్నాడు వెనక తలుపు గట్టిగా గుంజి.... లాగి తాళం పెట్టాడు .

"ఎల్దాం పదసామీ!" అంటూ పాల కెటిల్ చేతిలో పట్టుకుని బయటకు వచ్చాడు ఓబులు

కౌంటర్లోంచి నాయుడు లేచాడు . ఆ రోజు డబ్బు చూసుకున్నాడు ..

రేకు తలుపును వేసి రోడ్డు మీదకు వచ్చాడు.

అప్పుడు ఏడు గంటలు అయ్యిందొచ్చు వేసవి మూలాన యింకా చీకటి పడలేదు. ..

ఓబులు మౌనంగా నడుస్తున్నాడు.. ఏదో ఆలోచిస్తూ నిర్వికారంగా!





ఓబులు మనస్సు బాగా గాయపడి వుండాలి? లేక పోతే యిలా స్తబ్ధుగా వుండడు సరస్వతి ఏమైనా అందా? కన్నతల్లిలా ఆప్యాయత చూపించే సరస్వతికి ఓబులు మనస్సు నొప్పించే ప్రసక్తే లేదు .. పోనీ తనే- మైనా? ఊహు! 'ఓబుల్ని పల్లెత్తు మాట యింత వరకు అనలేదు . అల్లాటి అవకాశాన్ని ఓబులు కల్గనీయలేదు మరి వంటల సుబ్బయ్య భార్యకు పురిటి నొప్పులని మూడు రోజుల నుండి పనికి నాగాపెట్టేశాడు .

"ఓబుళేసూ! ఏం జరిగిందిరా అలావున్నావ్ ' అంటూ నాయుడు వాత్సల్యంతో, ఓబులు భుజమ్మీద చేయేశాడు

"ఏమీ లేద్సామీ! బాగానే వున్నా' ' మాటల్లో కొంత తడబాటు కలిగింది ఓబులుకు

అమ్మ ఏమైనా అందా?'

"ఊహూ!... అమ్మ నన్నెందు కంటుంది సామీ' . "

"మరి అదోలా వున్నావ్? "

"మధ్యాహ్నం నుండి ఒకటే తలనొప్పి సామీ! బిళ్ళ యిందాక మింగాను సామీ! కొద్ది సేపట్లో తగ్గి పోతుంది . "

ఓబులు మాటల్లో ఏదో నిజాన్ని దాస్తున్నట్లు భావించాడు నాయుడు . తనకు చెప్పక పోయినా, ఓబులు , సరస్వతికి తప్పకుండా చెప్తాడు

అనుకుని యిక ఆ ప్రసక్తి రాకుండా యిల్లు చేరుకున్నాడు నాయుడు.... అప్పుడు వీధుల్లో దీపాలు వెలిగాయి.

"అదేంటి! యిచిత్రంగా వుందే! ఇవ్వాల్టికి యింత జల్దీగా హోటల్ కట్టేశారు..." అంటూ సరస్వతి, నాయుణ్ని పలకరిస్తూనే, ఓబులు చేతులో నుండి పాల కెటిల్ అందుకుంది.

మరో పావు గంటలో అన్నం వడ్డిస్తానని బేగి స్నానాలు చేసి రమ్మంది సరస్వతి....

ఓబులు స్నానానికి వెళ్ళి నప్పుడు, ఓబులు ప్రవర్తన గురించి చెప్పాడు నాయుడు. ఆ ప్రవర్తనకు కారణ మేమిటో తను కనుక్కుంటానంది సరస్వతి... తల్లికి మాత్రం చేతనవునుమరి.

భోజనాలు వడ్డించింది.....

ఓబులు ఆకలిలేదని కెలికి కెలికి పెట్టాడు.. సరస్వతి బలవంతం మీద రెండు ముద్దలు తిని లేచాడు....

రాత్రి పది గంటలయ్యుంటుంది.. నాయుడు మంచమెక్కి గుర్రు కొడుతున్నాడు.. వంటిల్లు సర్ది సరస్వతి ఓబులు దగ్గర కెళ్ళింది.. వాడు నిద్ర పోవటం లేదు. అటు యిటు కదులుతున్నాడు... తల దగ్గర కూర్చుని ఓబులు జుత్తును, చెక్కిళ్ళను గోముగా తడిమింది సరస్వతి....

"ఓబులూ!.." ఆవిడ పలుకులో ప్రేమ, కరుణ ధ్వనించాయి..

"అమ్మయ్యా!" వాడి జవాబులో ఆర్ధ్రత వుంది... ఒక్క స్త్రీకి మాత్రం అర్ధమయ్యే భాష్యం వుంది...

"నీకేమైంది బాబూ! "

ఓబులు గట్టిగా ఏడ్చేశాడు . వాడి లేత గుండెల్లోంచి పువ్వెత్తున లావాలా దుఃఖం పెల్లుబికింది ...

ఓబుల్ని దగ్గరకు తీసుకుని వీపును సన్నితంగా నిమిరింది... కాల్వలై కారుతున్న కన్నీటిని తుడిచింది....

"అమ్మయ్యా! మా అమ్మను సూడాలని వుంది.. రోజూ కల్లోకొచ్చి నన్ను వూరికి రమ్మంటోంది నన్ను సూడాలని కలవరిస్తోందట ..." అంటూ బెక్కుతూ. ఏడుస్తూ చెప్పాడు ఓబులు.

"ఏ అమ్మరా? ఓబులూ!" యాదాలాపంగా అడిగింది సరస్వతి...

"మా అమ్మ మా వూళ్ళో వుందండి అమ్మయ్యా!!" అమాయకంగా జవాబు చెప్పాడు

"నీకు అమ్ముందా?" అని సరస్వతి నిశ్చేష్టురాలయింది... మౌనంగా వుండిపోయింది ఇన్నాళ్ళూ అనాథనని చెప్పుకుంటూ వున్నట్టుండి అమ్ముందంటున్నాడు ఓబులు .. తల్లిలేని పిల్లాడని దగ్గరకు తీసి మమత, మమకారం రంగరించిపెంచి పోషించింది సరస్వతి..

"అవునమ్మయ్యా! నాక్కూడా అమ్ముంది ఎంతో ఆర్ధ్రతగా అన్నాడు ఓబులు...

"ఇందుకోసం ఏడవాలా! రేపు అయ్యతో సెప్పి డబ్బులిప్పిస్తా!" అమ్మను చూసి వద్దువు గాని . ఇక

# దివ్య దీపావళి

శ్రీరాముడీనాడె సీతమ్మతో కూడ
పీఠమెక్కెననుచు పెద్దలంద్రు
బలిని శ్రీవిష్ణువు పాతాళమునకును
అణచిన దినమని యార్యులంద్రు
దుష్టుడౌ నరకుని దునుమాడి కృష్ణుడు
బ్రోచె లోకములని బుధులుయంద్రు
వీర విక్రముడైన విక్రమార్కుడును
గద్దె యెక్కెననుచు పెద్దలంద్రు
యిట్టి చక్కని గాథలు యెన్నియున్న
అంతరించె నరకుడని సంతసించి
సకల జనులును ముదమార జరుపుకొన్న
దినమె నిలచె దీపావళి దినముగాను
ఇరులను తొలగించ యింటింట దీపాలు
వెలిగించు నింతుల వేడుకొకచొ
తారలపైకెగయు తారజువ్వలు భూన
భమ్ములు ధ్వనించు బాంబులొకచొ
పూలను వెదజల్లి భువినంత పున్నమి
పోలి చేసెడి చిచ్చు బుడ్లు యొకచొ
సురసురమని లేచి పరుగు పెట్టించు సి
సింద్రీలు చేసెడి చేష్టలొకచొ

చిరు టపాసులు కాకర్లు చిటపటలును
విష్ణు భూచక్ర రాకెట్లు వెన్నముద్ద
గోడకాయ టపాసుల గోలతోను
దివ్యకాంతుల దీపాల దినము యొప్పె

- రాయప్రోలు వామనమూర్తి

## "ఆ తృప్తి చాలు సామి!"

పడుకో!" అంటూంటే సరస్వతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.. కన్న మమకారం కన్నా పెంచిన మమకారం గొప్పది కాదూ!

తను మనిషైతే గొడ్రాలయింది కాని మనసు మాత్రం ఆడదాని మనసే! కన్నబిడ్డను సూడాలని ఆ తల్లికి మాత్రం మనసుండదూ!

రెండేళ్ళ క్రితం...

తమ గడప ముందు . వెన్నుకు అంటుకుపోయిన కడుపు, తిండి లేక పీక్కు పోయిన మొహం.. ఎండు గడ్డిలా దుబ్బుజుత్తు .. చిరిగి వెలిసి పోయిన చొక్కా, గుండీల్లేని నిక్కరు తో ఓ పదేళ్ళ కుర్రాడు అమ్మా! ఆకలవుతోంది. ఓ ముద్దెట్టరూ" అని అంటూ శోష తప్పి పడిపోతే! ఎక్కడి వాడో? ఎవ్వరి వాడో?? అని ఏమీ తెలియక చేరదీసి, ఆదరణ చూపింది సరస్వతి... కన్నతల్లిని మరిపించింది .. మళ్ళీ యీనాటికి ఓబులుకు తన కన్నతల్లి గుర్తుకు రావటం గొప్ప విషయం కాకపోయినా, తన ఆలనాపాలనలో ఏదైనా లోపముందేమోననే ఆలోచన సరస్వతిని మరింత బాధ పెట్టింది .

అయినా ఏ గూటిపిల్ల ఆ గూటికి చేరాల్సిందే! ప్రకృతి ధర్మం కూడాను.. ఆ కన్నతల్లి మనసు ఎలా వుందో? చిన్నారి వయసులోని కొడుకు వున్నట్టుండి మరుగైతే ఆ తల్లి ఎంత క్షోభిస్తోందో? యిన్నాళ్ళూ ఓబులు తనకో అమ్ముందని, వూరు అంటూ వుందని ఏనాడు చెప్పలేదు... తన గురించి ఏలాంటి వివరణ కూడ యివ్వలేదు . అనాథనని, తన కెవ్వరూ లేరని, తనకింత నీడ కల్పించమని వేడుకున్నాడు.. ఎర్రమనాయుడు వెంటనే అంగీకరించకపోయినా, సరస్వతి మనస్సు బాధ పెట్టడం యిష్టంలేక, ఎర్రగా, బుర్రగా, అందంగా అమాయకంగా వున్న ఓబులుకు యింట్లో స్థానం కలిగించాడు.. సరస్వతి ఎంతో సంతోషించింది .. ఆదరణలో అమ్మను మరిపించింది మళ్ళీ రెండేళ్ళకు ఓబులుకు తన కన్నతల్లి గుర్తుకు రావటం . తల్లి మీద బెంగెట్టు కోవటం . అంతా విధిరాత .! ఉదయాన్నే తన భర్తకు విషయము చెప్పి ఓబుల్ని వాళ్ళ వూరికి పంపించే ఏర్పాటు చేయాలనుకుని ఓ నిర్ధారణ కొచ్చింది సరస్వతి... తుఫాను విశ్రమించాక ప్రశాంతంగా తేలియాడే ప్రకృతిలా నిద్దరోతున్నాడు ఓబులు.. సరస్వతి స్వాంత వచనాలు వాడి లేత గుండెల్లోంచి బాధను మాయం చేశాయి, ఆమె అక్కణ్ణుంచి లేచి వచ్చి నాయుడి దగ్గర పడుకుంది..

అయినా! .

ఓబులులో తుఫాను విశ్రమించలేదు." కళ్ళు మూసుకున్నాడే [illegible] తన తల్లిదండ్రులు, తోడబుట్టిన వాళ్ళు.. తను పుట్టి పెరిగిన వూరు వాడి మనసును కలిచి వేస్తున్నాయి.

ఇక్కడికి ఎన్నో వందల మైళ్ళ దూరంలో . రాయల సీమలో ఓ మూల . చిన్న కుగ్రామం. తండ్రి . తల్లి వ్యవసాయ కూలీలు. ఏడు మంది సంతానంలో తను రెండోవాడు . అన్నవో కమ్మరి కార్ఖానాలో పని నేర్చుకుంటూంటే తను స్కూలుకు వెళ్ళి చదువుకొనేవాడు .. మూడో సంతానం చిన్నమ్మి! ఇంటి పాటే వుండి మిగతా పిల్లల్ని చూసుకొనేది... తండ్రికి ఎలా అలవడిందో గాని పెద్ద వ్యసనం తాగుడు అలవాటయింది... ఇల్లు, ఒళ్ళు గుల్ల కావడమే కాకుండా, తల్లిని రాచి రంపాన పెట్టేవాడు . ప్రతి దానికి అమ్మను కొట్టేవాడు. అంతలో పెద్ద కరువు వొచ్చింది . తినేందుకు తిండి లేదు తాగేందుకు నీళ్ళు లేవు.. కూలీజనం వలస పోయారు అమ్మ రెడ్డోరి యింట్లో పాచి పనులు చేసి, వాళ్ళిచ్చి పడేసిన మిగిలిన అన్నంతో పిల్లల్ని సాకుతోంది తండ్రికి పనీపాటా లేదు . రాములోరి గుడికాడ పేకాట ఆడే పెద్దోళ్ళకు చాయిలు, చుట్టలు అందించడం వాళ్ళిచ్చిన పైసలతో ఏకల్లాకా తాగి యింటికొచ్చి అమ్మను కేకలేయడం వీపు బద్దలు చేయడం . అమ్మ తెచ్చిన అన్నాన్ని, పిల్లలున్నారని కూడ ఆలోచించక బుక్కడం ... మరీ దారిద్రపు బతుకు

ఆరోజు తనకు బాగా జ్ఞాపకం తండ్రి బాగా తాగొచ్చాడు . పాచిపని చేసి అమ్మ తెచ్చి, పెట్టిన అన్నంలోకి నీసుముక్క కావాలన్నాడు . ఎండు సేప ముక్క వేయాలన్నాడు ఎక్కణ్ణుంచి తెస్తుంది

అమ్మ? అమ్మ వీపు మీద గుద్దుల వర్షం ఆ దెబ్బల్ని భరించలేక ఓ మూల కూలబడింది అమ్మ... అయినా నాన్న వదల్లేదు.. . అమ్మ జుత్తును లాగి, తలను గోడకేసి కొట్టి, అమ్మకు స్పృహ తప్పింది.

తండ్రి తింటే మిగిలిన అన్నంకోసం కాచుకున్న ఓబులేసు ఆకలి కలిగించిన ఆవేశం, తల్లి మీది మమకారం కల్గించిన ఉద్రేకంతో మూల నున్న పచ్చడి బండ అందుకుని , తండ్రి తలపై ఒక్కటేశాడు. . "అమ్మో" అంటూ తండ్రి కూలబడితే . చిట్లిన తలలోంచి కారుతున్న రక్తాన్ని చూసి భయపడి యింటి నుంచి పారిపోయి

అలా అలా అందిన రైళ్ళు ఎక్కి బస్సులు దిగి యిలా యిలా సోంపేటలో ఎర్రమనాయుడి గడపముందు ఆకలికి తట్టుకోలేక నీరసంగా కుదేలమని, శోష వచ్చి పడినప్పుడు ఓ తల్లి కరుణించింది . . కాపాడింది.... ఆ తల్లి! సరస్వతమ్మ!.... తను యిక్కడకు ఎందుకు దేశంకాని దేశానికి రావాల్సి వచ్చిందో ఆ తల్లి, ఆదరణ ముందు చెప్పలేక అనాధననే చెప్పుకున్నాడు యిన్నాళ్ళు. రెండు రోజుల నుండి అదేపనిగా కన్న తల్లి తన కళ్ళ ముందే ప్రత్యక్షమయి. .. తన్ను చూడాలని కలవరిస్తున్నట్లు భావన కలగడం ఓబులు మనస్సులో 'తల్లి మాట ఎత్తక తప్పింది కాదు.. . కన్న తల్లిలా ఆదరిస్తున్న ఓ తల్లి ముందు నిజమైన కన్న తల్లి మాట ఎత్తి ఆ తల్లి మనస్సు నొప్పించ లేదుకదా! తను వూరికెళ్ళి అమ్మనో సారి చూసి మళ్ళీ తిరిగొచ్చేయాలి.. సరస్వతమ్మను బాధ పెట్ట కూడదని నిర్ణయానికొచ్చాక కొంత మనస్సు స్థిమిత పడింది. కళ్ళు నిద్రకు అంటుకుపోయాయి..

రోజూ లాగే తెల్లారింది

సరస్వతి 'విషయం' చెప్పాక ఎర్రమనాయుడు ఓ రెండు నిమిషాలు కళ్ళు మూసుకున్నాడు

"అలాగే పంపిద్దాం! ఎలాగు పది రోజుల్లో సోమేశ్వర స్వామి తిరుణాల వుంది మన హోటల్ బాగా జరిగేది అప్పుడే కదా! తిరుణాలయ్యాక పంపుదాం . .

ఈ సంగతి నువ్వే ఓబులుతో చెప్పడం మంచిది. .." అని నాయుడు విశదీకరించాడు సరస్వతికి . ఓబులుకు చెప్పాక నిజమేకదా అని అనుకున్నాడు.. . తిరుణాలయ్యాక అమ్మను చూసి రావాలను కొని స్థిమిత పడ్డాడు ఓబులు . తల్లికి తనకు వచ్చిన భాషలో వుత్తరం కూడా రాశాడు తన స్థితి గతుల గురించి, బదులు కూడా రాయమన్నాడు. .

రోజులు గడుస్తున్నాయి

సోమేశ్వర స్వామి తిరుణాల బాగా జరిగింది. . బస్సుల్లో వేలకొద్దీ జనం. . . హోటల్ క్రిక్కిరిసి పోయింది.... ఇద్దరు వంట వాళ్ళను . మరో యిద్దరు కుర్రాళ్ళను పనిలో వుంచుకున్నాడు నాయుడు ఆ రద్దీ తగ్గే వరకు.. . ఈ సారి బాగా ఆదాయం వచ్చింది .. రెండు జతల కొత్త బట్టలు, కొత్త చెప్పులు తెచ్చాడు నాయుడు ప్రేమగా ఓబులుకు

ఓబులుకు అమ్మ నుండి బదులు రాలేదు ఎలా వుందో? అన్నయ్య, చెన్నమ్మ వాళ్ళు ఎలా వున్నారో" ఏలాగు రెండు రోజుల్లో వెళ్తున్నాడుగా' కాని తండ్రంటే భయమేసింది ఓబులుకు భయంతో గుండె గుబగుబలాడింది

సరస్వతికి మనసులో మనసు లేదు. ఓబులు వెళ్తున్నాడంటే ఆమె ఎంతో దుఃఖిస్తోంది. ఓబులుకు వూరికెళ్తున్నానని సంతోషిస్తున్నా, వాడి తండ్రి గుర్తుకొచ్చే సరికి బెదిరిపోతున్నాడు

నిజం చెప్పాలంటే యిక్కడో విశేషం వుంది . ఆ విశేషం ఎర్రమనాయుడి దగ్గరవుంది .. తిరుణాలయ్యాక ఓబుల్ని వూరికి పంపుదామన్నాడే కాని అస్సలు పంపడం యిష్టం లేదు నాయుడికి ఓబులు వూరికి వెళ్తే మళ్ళీ తిరిగి రావటానికి ఎన్ని రోజులు పడుతుందో? అస్సలు తిరిగి వస్తాడనే నమ్మకమేముంది? ఓబులు లేక పోతే తను యీ హోటల్ వ్యాపారంలో నెగ్గుకు రాగలడా?

ఎన్నో వ్యాపారాలు చేసినా, ఏదాంట్లోను కలిసి రాక, అన్నింట్లోను నష్టపడి, నెత్తిన చేతు లెట్టుకు కూర్చున్న సమయంలో ఓబులు తనింట్లో ఏ ముహూర్తంలో కాలెట్టాడో ఆ రోజు నుండీ తన దశ మారింది బస్టాండులో చిన్న టీ కొట్టు పెట్టడం, అది సరస్వతీ విలాస్‌గా మారడం జరిగింది డబ్బు వెనకేసుకోక పోయినా తిండికి ఢోకా లేకుండా బతుకు సాగుతుంది .. ఆ మధ్య ఓబులుకు ఖర్చు లకు గాను నెల జీతం కూడ ఏర్పాటు చేశాడు ఓబులు వద్దన్నా వినకుండా, ఓబులు ఆ హోటల్లో క్లీనరే కాదు సర్వరు కూడాను సర్వర్ దగ్గర్నుండి ఒకోసారి కౌంటర్ మీద కూర్చొనే స్టేజికి ఎదిగి పోయాడు. నిస్వార్థం.... నిజాయితీ చాలవూ ఓ మనిషిని వున్నతుణ్ణి చేయడానికి! అలాంటి ఓబుల్ని వూరికి పంపాలంటే యిష్ట పడటం లేదు ఎర్రమనాయుడు . ఇన్ని రోజులూ 'తిరుణాల' అని అన్నాడు.... మరేదో సాకు వెతకాలి అని ఆలోచించే లోపుగా ఒక దుర్వార్త తెలిసింది ..

ప్రస్తుత మున్న 'బస్టాండు' ను ఎత్తి వేస్తున్నారని. . గ్రామ పంచాయితీ వాళ్ళు వేరే బస్టాండుకు కావాల్సిన స్థలాన్ని మంజూరు చేశారని, వారం లోగా బస్సులు అక్కడే ఆగుతాయని ప్రకటన చేశారు.. .

నిశ్చలంగా వున్న కోనేటిలోనికి రాళ్ళు విసిరినట్లయింది ..

ఎర్రమ నాయుడు బెదిరి పోయాడు. కొత్త బస్టాండులో హోటల్ పెట్టుకోవటానికి టెండర్లు పిలుస్తారని తెలిశాక మరింత హతాశుడయ్యాడు నాయుడు. లోపాయకారిగా ప్రయత్నించాడే కాని ఫలించలేదు.. .

మరో రెండు రోజుల్లో 'సరస్వతీ విలాస్' మూత పడింది. . టెండర్లో ఓడిపోయాడు నాయుడు .

ఈ పరిస్థితుల్లో అమ్మను చూడడానికని వూరికి బయల్దేర లేక పోయాడు ఓబులు... . వెళ్ళటానికి

ఓబులు మనస్సు అంగికరించక పోయింది... అందుకని తన ప్రయాణాన్ని వాయిదా వేసుకున్నాడు.... అలా మరో నెల గడిచింది.

ఎర్రమనాయుడు మంచి సెంటర్ కోసం వెతుకుతున్నాడు. కొత్తగా పెట్టిన మండలం ఆఫీసు దగ్గర రెండు గదులున్న డాబాయిల్లు దొరికింది ... ఆ మధ్య సరస్వతికి చేయించిన గాజులు అమ్మి హోటల్‌కు కావలసిన 'ఫర్నిచరు' కొన్నాడు ... డాబుగా కనపడాలని ఓ రేడియో కొన్నాడు ... వంటమనిషి సుబ్బయ్యకు అసిస్టెంటుగా యింకొకణ్ణి వుంచాడు ... వాడే క్లీనరు కూడాను ... ఓబులు మాత్రం సర్వరే కాదు ... ఒకొక్కప్పుడు ఆ హోటల్ యజమాని కూడాను ... ఎర్రమనాయుడుకు యిదొక అవకాశం ... అవకాశాన్ని వదులుకోలేదు. సరిగా వినియోగించుకొన్నాడు ... హోటల్‌కు పెట్టుబడి మాత్రం అప్పు వేలల్లో తేలింది ...

'మండలం' ఆఫీసుకొచ్చే జనం "సరస్వతి విలాస్"కు కాఫీకైనా రావాల్సిందే! ఆఫీసులో పనిచేసే వుద్యోగుల సంగతి చెప్పనవసరమే లేదు ... ఖాతా బుక్కులు రెండు తెరవాల్సి వచ్చింది ... వ్యాపారం బాగా రంజాగా సాగుతోంది ... వ్యాపారంలో పడి ఓబులు అన్నీ మరిచిపోయాడు. వీలున్నప్పుడు మాత్రం అమ్మను చూసి రావాలనుకొనేవాడు ... అప్పుడప్పుడు కలలో అమ్మ కనిపిస్తూనే వుంది. తన దగ్గర కావాల్సినంత డబ్బు వుంది. జీతంలా



"దీపావళి-వేడుక!"

చిత్రకారుడు : వెల్లటూరి పూర్ణానందశర్మ

## ఆ తృప్తి చాలు సామీ!

యిచ్చిందంతా; పోనీ అమ్మకు పంపితే! అమ్మకు అందితే ఫర్వాలేదు. అదే తన తండ్రికి / అందితే ఏమైనా వుందా? అంతా తాగుడికే సరిపోదూ? ఈసారి తప్పకుండా వెళ్ళి అమ్మకు డబ్బు యివ్వాలి అమ్మ సంతోషిస్తే తనకంతకన్నా ఏం కావాలి? ఆ వూహతోనే రోజులు గడుపుతున్నాడు ఓబులు ...

సరస్వతిలో ఏ మార్పు రాలేదు... జరిగేదంతా మన మంచికే అనుకొనే స్వభావం ఆమెది. ఓబుల్ని మరింత ప్రేమగా చూడసాగింది. ఇంతలో సంతోషమైన వార్త ఒకటి తెల్సింది. సరస్వతిని డాక్టర్ పరీక్షచేసి మూణెళ్ల గర్భవతి అని తేల్చి చెప్పినప్పుడు రామినాయుడు ఎగిరి గంతేశాడు. అతడి ఆనందానికి పట్టుపగ్గాలేకుండా పోయాయి. సరస్వతిని మంచం దిగకుండా చేసి, ఆమె ఆరోగ్యాన్ని ఓబులుకు అప్పగించాడు నాయుడు. సరస్వతికి కావాల్సిన పుష్టికరమైన ఆహారం; టానిక్కులు ... మందులు సరియైన వేళకు యిస్తూ ఆమె సేవలో తన కన్నతల్లిని మరిచిపోయాడు ఓబులు ... ఒకోసారి హోటల్‌కు కూడ వెళ్లకుండా యింట్లోనే సరస్వతికి కావాల్సిన సదుపాయాల్ని చేకూరుస్తూ, ఆమె అనురాగానికి మరింత దగ్గరయ్యాడు ఓబులు ... అప్పుడప్పుడు తల్లికి వుత్తరం రాస్తున్నాడేగాని ఏ ఒక్కటికి తల్లి నుండి జవాబు రాకపోయేసరికి ఎంతో బాధపడేవాడు ఓబులు ... తను రాసిన వుత్తరాలు చేరుతున్నాయో! లేదో?

వెళ్ళి వద్దామంటే దగ్గరి దూరం [illegible]దాయె! ఎక్కడో ఆంధ్రదేశానికి తనో [illegible]ల ఉంటున్నాడు ... మరో మూలలో అమ్మ [illegible]ంది ... రెండు మూలల మధ్య







దూరం కొన్ని వందల మైళ్ళ దూరం .. అందుకోలేక ... చేరలేక మానసికంగా సతమతమవుతున్నాడు ...

మరో రెణ్ణెళ్ళు ...సునాయాసంగా గడిచాయి ...

కష్టాలు ఎప్పుడూ ఒంటరిగా రావు అలాగే సుఖాల ...తం ఒంటరిగానే వస్తాయి . .

ఎవడో ఏదో సంపాదిస్తున్నాడని, ప్రక్కనోడు, ఎదురోడు వూరికే వుండ... .. తము కూడ ఓ చేతులేసి సంపాదించుకోవాలనుకొన్నారు. ఇది మానవ నైజం. అలాకాకపోతే మండలం ఆఫీసు దగ్గర సరస్వతీ విలాస్ ఎదురుగా 'నళిని' విలాస్' వెలిసేదికాదు ... ఎన్నో హంగులు ఏర్పాటుచేసి, హోటల్ని తెర్చిచారు. 'టేప్ రికార్డర్'తో కొత్త పాటలు వినిపించారు ... మండలం ఆఫీసుకొచ్చే జనమంతా నళిని విలాస్‌కు ఎగబడ్డారు ... కొత్త కొత్తే కాదు. వింత కూడాను ... పాత పాతేకాదు రోత కూడాను; అలాగే జరిగింది ... సరస్వతి విలాస్ వ్యాపారంబాగా తగ్గింది. ప్రస్తుతం వచ్చే వాళ్ళంతా ఆఫీసు వుద్యోగస్తులే! ఖాతా తీర్చలేక యిక మూకు తప్పదు అనేవాళ్ళే వస్తున్నారు ...ఎర్రమనాయుడు దిగాలుపడ్డాడు. వ్యాపారంలో కుదుటబడి అప్పులు తీరుద్దామనే లోపుగా యిది జరిగింది. ఇంకొంచెం అప్పుచేసి సరస్వతి విలాస్‌ను నళిని విలాస్‌కన్నా మరింత హంగు చేద్దామనే లోపుగా... నళిని విలాస్ ప్రక్కనే గణేష్ కేఫ్ వెలిసింది. ఈ గణేష్ కేఫ్‌లో బ్రూ కాఫీలు, కూల్ డ్రింక్స్‌లు దొరుకుతాయి. రేడియో, టేప్ రికార్డర్ కాకుండా ఒకేసారి వీడియో నే తెస్తానన్నాడట గణేష్ కేఫ్ యజమాని సలావుద్దీన్-ఖాన్ ...

సుబ్బయ్యను వుంచేసి, మిగతా వాళ్ళకు తిలోదకాలు యిచ్చేశాడు నాయుడు. మళ్ళీ ఓబులు హోటల్ డ్యూటీయే గాకుండా, సరస్వతికి యింట్లో సాయానికి వుపయోగపడ్డాడు ...

అప్పులవాళ్ళు వెంటబడి బాధిస్తే, హోటల్లో 'ఫర్నిచర్' అమ్మేసి, కొంత వరకు బయటపడ్డా 'సరస్వతి విలాస్' మాత్రం మరోసారి మూతబడింది. ఎర్రమనాయుడు మానసికంగా కృంగిపోయాడు ... ఇంకో ఏ వ్యాపారం చేయాలన్నా పెట్టుబడి కావాలి ... అది తన దగ్గరలేదు ... తనెంత మానసికంగా బాధపడుతున్నా సరస్వతి ముందు బయటపడేవాడు కాదు ... ఏవేవో కబుర్లు చెప్పి ఆమెను మానసికంగా పుత్తేజపరిచేవాడు. అన్నీ తెలిసికూడ మౌనంగా బాధపడుతూ వాళ్ళ చెంతనే వుండిపోయాడు ఓబులు ...

పరిస్థితిలో ఎలాంటి మార్పులేదు. ఎర్రమనాయుడు ఏదేదో చేయాలని ప్రయత్నిస్తూనే వున్నాడు. బ్రతుకు తెరువుకోసం ...ప్రతి అడుగూ పాచి రాయి మీదనే ... పాకుడు రాళ్ళ మీదే నడక ...

అలాగే మరో కొద్ది నెలలు గడిచాయి. మరింత జటిలమయింది ఎర్రమనాయుడి ఆర్థిక స్థితి. సరస్వతి నిండు గర్భిణి ... ఆమెకు శారీరకంగా, మానసికంగా వుల్లాసాన్ని కల్గిస్తూ వాతావరణాన్ని సంతోషంతో నింపడానికే ప్రయత్నిస్తున్నారు నాయుడు... ఓబులునూ!

ఆ వుదయం ... బాగా నొప్పులొచ్చాయి సరస్వతికి ... ఆఘమేఘాల మీద 'కరుణా నర్సింగ్ హోమ్' లో చేర్చారు ... అన్ని పరీక్షలయ్యాక పెద్ద ఆపరేషన్ జరగాలన్నారు ... ఆపరేషన్ జరగకపోతే బిడ్డకే గాకుండా తల్లికి కూడ ప్రమాదమని హెచ్చరించారు...

ఎర్రమనాయుడుకు ఏం చేయాలో తెలియడంలేదు... చేతిలో డబ్బు వున్నా అది కొద్దిపాటే! .. ఆపరేషన్‌కు కావాల్సిన వెయ్యికోసం ఎక్కడైనా అప్పు చేద్దామన్నా యిచ్చే దాతలేడు... ఆ సమయం కూడ లేదు. పోనీ ఏ వస్తువయినా అమ్ముదామంటే అవెప్పుడో షావుకారు యింట్లో కొలువుకు కుదిరాయి. ఇంకెక్కడయినా, ఎలాగయినా అప్పుకోసం ప్రయత్నిద్దామని ఎర్రమనాయుడు ఓ అరగంటలో వస్తానని వూళ్ళోకి బయల్దేరి వెళ్లాడు. డబ్బు లేందే ఆపరేషన్ జరగదుమరి ...

సరస్వతికి నొప్పులు మరింత అధికమయ్యాయి ... భరించలేక మూలుగుతోంది ... ఓబులు డాక్టర్ని కలిసి, అమ్మయ్య ప్రాణాలు కాపాడమని ప్రార్థించాడు ... ఆపరేషన్ మొదలయింది ... గదిముందు ఎర్రటి బల్బు వెలుగుతోంది. సరస్వతమ్మకు సుఖ ప్రసవం జరగాలని, తల్లీ బిడ్డ క్షేమంగావుండాలని ఖాదీ, లక్ష్మీ నరసింహస్వామిని మొక్కుకున్నాడు. ముక్కోటి దేవతలను ప్రార్థించాడు ఓబులు ... ఇంకో అరగంట గడిచింది ... ఎరటి బల్బు వెలుగుతూనే వుంది.

ఓబులు గుండెల్లో ... మరుక్షణంలో ఆనందం ... ఇంకో క్షణంలో గుబులు ... ఇంకో పావు గంట ... ఎర్రటి బల్బు ఆరిపోయింది.

సరస్వతమ్మకు ఆపరేషన్ జరిగింది ... మహాలక్ష్మిలాంటి ఆడపిల్ల ... తల్లీబిడ్డ క్షేమం .. తన ప్రార్థన ఫలించిందానికి భగవంతుణ్ణి మరోసారి మొక్కుకున్నాడు ఓబులు ...

అప్పుడు పరుగులాంటి నడకతో ... ఆయాసంతో ... రొప్పుతూ వచ్చాడు ఎర్రమనాయుడు... సరాసరి డాక్టర్ దగ్గరకు వెళ్లాడు. డబ్బు తెచ్చానని , ఆపరేషన్ చేయమని, ఆలస్యమయిందానికి క్షమించమని వేడుకున్నాడు ... ఆపరేషన్ ఫీజు ఎప్పుడో చెల్లించారని, ఆపరేషన్ కూడ జయ

# దీపావళి జిగి

నీలాకాశంలో తళుకు తారకలు
ఆవాసాలలో వెలిగే ప్రమిదలు
అతివల కన్నులు కాంతిని చిందే దీపికలు
పుడమిని గిరగిర తిరిగే భూచక్రాల రవ్వల జిలుగులు
నింగికి రివ్వున ఎగిరే తారాజువ్వల కాంతుల గుత్తులు
చివ్వున బుస్సున పొంగే మతాబాల మెరుపులు
ఎటు చూసినా ఆశల తళుకులు వెలుగులు
జిలుగులు కాంతులు మెరుపులు
కాదే ఇది అమావాస్య నిశి
కాబోలు ఇది దీపావళి జిగి!

\- ఇసుకపల్లి సుజాత

# వేమన పద్యాలు







ప్రదంగా జరిగిందని, తదితర వివరాలన్నీ డాక్టర్ గారు చెప్పేసరికి ఎర్రమనాయుడు ఆశ్చర్యపోయాడు. .. 'హాస్పిటల్'కి పరుగెత్తాడు ...

కళ్ళు తెరిచిన ఆ పసికందును మృదువుగా స్పృశించాడు ... ఆనందభావ తరంగం ... సరస్వతి నొసట్ని ఆప్యాయతగా నిమిరాడు!...

'బెడ్'కు ఓ మూలగా నిలుచున్న ఒబులు చేతుల్ని పట్టుకున్నాడు ఎర్రమనాయుడు ... ఇంకో ఐదు నిమిషాలు అక్కడే గడిపి యిద్దరూ బయటకు వచ్చారు నాయుడూ ...ఒబులూను; నర్సింగ్‌హోమ్ కెదురుగా చిన్నటి పార్కు వుంది. పార్కు బెంచీపై కూర్చున్నారు. ఎర్రమనాయుడు జేబుల్లోంచి డబ్బు

## "ఆ తృప్తి చాలు స్వామీ!"

తీసి ఓబుళేసు చేతిలో పెట్టాడు ...

"నాకెందుకు సామీ! డబ్బు!!"

ఎర్రమనాయుడు కళ్లల్లోంచి నీళ్ళు కదిలి చెంపలు దాటుతున్నాయి... పెదవులు కదులుతున్నాయే గాని పలుకులు వూడిపడడంలేదు ... భాషకందని భావాలు... భావాలకందని కృతజ్ఞతలు ...

ఓబుళేసు కదిలిపోయాడు .. వాడి కళ్ళల్లోనూ నీళ్ళుసుడులు కట్టూ జారిపోతున్నాయి. ఎర్రమనాయుడిని వాటేసుకుని గట్టిగా ఏడ్చేశాడు ...

"ఓబుళేసూ! ఇక నీవు ...మీ వూరెళ్ళిపో! మీ అమ్మ దగ్గరికెళ్ళిపో? నీకెంత డబ్బు కావాలన్నా తీసుకో? ... నీకు తిరిగి రావాలంటే రా! ..." అంటూ ఎర్రమనాయుడు అదో రకమైన ఉద్వేగంతో మాటల పొందికలేక ఏదో ఆజ్ఞాపిస్తున్నాడు ఓబుళేసును ...

"అమ్మ ...! అయ్య!!" గుండెల్లోంచి కదిలివచ్చిన దుఃఖంతో కలిసిపోయింది మాట ... ఏదో పూనకం వచ్చిన వాడిలా కళ్ళు మూసుకుని "అమ్మ! అమ్మ!!" అంటూ కలవరిస్తున్నాడు ఓబులు...

"ఓబుళేసూ! ఏమయిందిరా!" అన్నాడు కంగారుగా నాయుడు. ఓబుళేసును పట్టుకుని కుదిపాడు.

"అమ్మ ఎక్కడుంది సామీ! మా అమ్మ చచ్చిపోయింది ...నన్ను సూడాలని కలవరిస్తూ సచ్చిపోయింది సామీ!!"

"చచ్చిపోయిందా? ... " నిశ్చేష్టుడయాడు నాయుడు.

"అవున్సామీ! ఆర్నెల్లుగా అమ్మకి 'లక్వా' తగిలిందట సామీ! ఎన్నో వుత్తరాలు రాసినా నేను వెళ్ళలేకపోయానట సామీ!... అమ్మ చచ్చి-పోయిందని యివ్వాళే వుత్తరం వచ్చింది సామీ! ..."

"వెంటనే వెళ్ళు ... వెళ్ళటాకి కావాల్సిన ఏర్పాట్లన్నీ నేను చూస్తాను .. ఎంత డబ్బు కావాలన్నా! ..."

"అక్కడికెళ్ళి చేసేదేముంది సామీ! నా కడసారి చూపుకోసమని అమ్మని ఎలాగూ వుంచరు సామీ!! ఇంత దూరం వెళ్ళినా మా అమ్మను ఏలాగూ చూడలేను..." అంటూ కళ్లను తుడుచుకున్నాడు ఓబులు ...

"వుత్తరం వస్తే ... చెప్పలేదేమిరా? ..."

"చెప్పి చేసేదేముంది సామీ! తల్లిలాంటి మరో తల్లి ఏ నిముషంలో ప్రసవిస్తుందో? ఏమవుతుందో? చచ్చిన తల్లిని ఏలగూ చూడలేను ... ఎదురుగ్గా వున్న అమ్మను కళ్లారా చూద్దామని; మీరు డబ్బుకోసం వెళ్ళినప్పుడు, నా దగ్గరున్న డబ్బు ... మీరు నాకు ప్రతి నెలా యిచ్చిన జీతంతో నా తల్లిని బ్రతికించుకున్నాను సామీ! లేని తల్లిని ఎలాగూ రక్షించుకోలేను ... కనీసం వున్న తల్లిని రక్షించుకున్నాను ... సామీ!! నాకు ఆ తృప్తి చాలు సామీ! సామీ! ఇంకో మాట ... నా కన్నతల్లిని పుట్టిన బిడ్డలో చూసుకుంటూ బతుకుతాను సామీ! మీరు తప్ప నాకెవ్వరు లేరూ సామీ! ..."అంటూ ఓబులు భోరున విలపిస్తుంటే ...నోటి మాట రాక మౌనంగా వుండిపోయాడు నాయుడు.

అమ్మకు బాగోలేదని, చూడాలని కలవరిస్తోందని వస్తున్న ప్రతి వుత్తరాన్ని తానే అందుకుని, చింపేస్తూ స్వార్థంతో ప్రవర్తించిన నాయుడు ...ఓబుళేసు మేరుపర్వతంలాంటి వ్యక్తిత్వం ముందు పిపీలికంగా వూహించుకున్నాడు ... తనకు తెలియకుండానే అసంకల్పిత ప్రతీకార చర్యలా రెండు చేతులెత్తి ... ఓబుళేసుకు నమస్కరించాడు నాయుడు ... □

సీరియల్

# పావని

సి. విమలాగణేశ్



(గత సంచిక తరువాయి)

రైల్లు యాక్సిడెంటని వుదయం రేడియోలో విన్న పావని ఒక్కసారిగా కళ్ళు తిరిగి పడిపోయింది మళ్ళీ ఆమెకు స్పృహ వచ్చేసరికి రెండు గంటలు పట్టింది తన చుట్టూ జనం, పిల్లలిద్దరూ ఏడుస్తూ కన్పించారు కాసేపటికి గాని యేం జరిగిందో ఆకళింపు చేసుకోలేక పోయింది 'భగవాన్ ఏమిటీ అన్యాయం? ఎందుకీ శిక్ష? ఆయనెలా వున్నారో' తల బాదుకుంటూ భోరున ఏడ్చింది

'అనవసరంగా కంగారు పడకమ్మా ఆయన క్షేమంగానే వుంటారు కాసేపట్లో మీకు టెలిగ్రాం వస్తుంది ప్రక్కింటావిడ ఓదార్పుగా అంది

చల్లని మాటన్నావు పిన్నీ మీ నోటి వాక్యాన అలాగే జరిగితే అంతే చాలు!

అలా అని యెదురు చూస్తూ కొంత కాలం గడిపింది కాని యే కబురూ తెలియక పోయేటప్పటికి ఆక్సిడెంటయిన ప్రక్క స్టేషనుకు ఫోన్ చేసింది చాలా మంది చనిపోయినట్లూ, కొందరు గాయపడినట్లూ వివరాలు తెలియడాన్కి కొంత టైమ్ అవుతుందని తెలిసింది గాయపడిన వారు దగ్గరలోని ఆసుపత్రిలో వున్నారని వినగానే పావని మనస్సు కీడును శంకించింది భగవాన్ నన్నన్యాయం చేయకు అంటూ ముక్కోటి దేవత లందరికీ మనసులో నే మ్రొక్కు కుంది యెంత దేవుని మీద భారం వేసినా మానవ ప్రయత్నం కూడా వుండాలి గదా? యిద్దరి పసివాళ్ళని ప్రక్క యింటి వాళ్ళ కప్పగించి హాస్పిటల్‌కు బయలు దేరింది

నెల్లూరులో దిగిన పావని ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని హాస్పిటల్లో అడుగు పెట్టింది హాస్పిటల్ అంతా హడావిడిగా వుంది యెవరిని పలుకరించడానికీ భయంగా వుంది బిక్కు బిక్కు మంటూ ఒక్కొక్క వార్డులోని ప్రతి గదినీ పరిశీలిస్తూ తిరిగింది విజయ్ కనిపించలేదు. క్షణ క్షణానికీ ఆవేదన గుండెల్లో నిండి భరించలేక ముందుకు తూలిపోయింది అదే సమయానికి



జరిగిన కథ– 7: పావనికి కవల పిల్లలు పుట్టారు బాబు పేరు వినోద్ పాప పేరు సునంద విజయ్ తనకు లెక్చరర్ పోస్ట్ రాలేదని కృంగి పోతుంటే భర్తకి ధైర్యం చెపుతుంది పావని కానీ తను మనసులో కుళ్ళి కుళ్ళి ఏడ్చింది రోజీ రికమెండేషన్‌తో విజయ్‌కి రిజర్వ్ బాంకులో జాబ్ వచ్చింది రోజీ అమెరికా వెళ్ళేముందు వచ్చి పావని కుటుంబాన్ని చూచి వెళ్ళింది. ఆనందరావు ఆత్మహత్య చేసుకున్నాడు విజయ్ మద్రాసుకి వెళుతున్న రైల్లో భయంకరమైన శబ్దం అయ్యి విజయ్ మెదడు మొద్దుబారి స్తంబించి పోయింది



యెదురుగా వస్తున్న డాక్టరు కాస్త చేయూత నిచ్చి నిలబెడుతూ .

యెవరు కావాలమ్మా?'

"డాక్టర్" భోరున ఏడ్చింది

'పేరు?"

'విజయ్!

"వయసు?"

"ముప్పై"

ఫోటో యేదైనా"

'వుంది డాక్టరు" చూపించింది

"దోంట్ వర్రీ యీయన బ్రతికే వున్నారు " అన్నాడు తేలిగ్గా వూపిరి పీల్చి

'యెక్కడ డాక్టర్ "

"సిస్టర్! మేడమీద కంటి వార్డుకు తీసుకెళ్ళు "

"డాక్టరు ఆయన కేదయినా"

"గాయాలు యేమీ కాలేదు కాని"

"కాని!"

"ట్రైన్‌లోని బల్బు పగిలి రెండు కళ్ళల్లోను గుచ్చుకు పోయాయి."

"డా ...క్ట. ..ర్' పెద్దగా అరచింది

' భయపడకండి. శక్తిమేర ప్రయత్నిస్తాం."

". . . . . "

'సిస్టర్ తీసుకెళ్ళు"

మంచం మీద కళ్ళకు పూర్తిగా గుడ్డ కట్టివున్న విజయ్‌ను చూడగానే గొల్లుమని ఏడ్చింది పావని. రెండు రోజులు స్పృహలో లేని విజయ్ మూడవ రోజు స్పృహలో కొచ్చాడు "పావని పావని" అంటూ పెదాలు కదలు తున్నాయి.

'నేనండీ మీ పావన్ని మీ దగ్గరే వున్నాను " అతని చేతులు తన ముఖాని కద్దుకుంటూ కన్నీళ్ళు కార్చింది.

"పావనీ వచ్చావా?"

"వచ్చానండీ"

"చూశావా? విధి మనల్ని ఎంత మోసం చేసిందో ?"

"విధి.. దేవుడూ!" పేలవంగా అంది.

"పిల్లలేరి?"

"పక్కింట్లో వదలి వచ్చానండి."

"పావనీ నాకు చూపు మళ్ళీ వస్తుందా?"

"మీరేం దిగులు పడకండి. తప్పకుండా వస్తుంది."

"నాకు నమ్మకం లేదు."

"అలా అనకండి."

"నీ దేవుడు నీకు అన్యాయం చేసాడా పావని?"

"దేవుడు... అన్యాయం?"

"ఏడుస్తున్నావా?"

"అబ్బే లేదు."

"నన్ను.... నన్ను"

"మరేం మాట్లాడకండి."

నెల రోజులు గడిచి పోయాయి. విజయ్‌కి నాలుగుసార్లు కట్లు మార్చినారు.

"డాక్టరు చూపు?"

"పావనీ నీవు చదువుకున్న దానివి. ధైర్యంగా వుండాలి."

"చెప్పండి డాక్టరు."

"విధి క్రూరంగా చూసిందమ్మా"

"అంటే?"

"మీ వారి చూపు రాలేదమ్మా"

"డాక్టర్" పెద్దగా అరిచి వెర్రి చూపు చూసింది.

"భయపడకమ్మా"

"ఆయనకు చూపేరాదా డాక్టర్?"

"ఓ ఆరునెల్లు ఆగాలి. తర్వాత ఆపరేషన్ చేద్దాం"

"అప్పుడయినా వస్తుందా డాక్టర్"

"అది నీ అదృష్టం." విన్న పావని కుమిలి కుమిలి ఏడ్చింది.

డిస్‌చార్జి చేశారు.

"ఏమన్నారు పావని?" విజయ్ ప్రశ్నలో జీవం లేదు.

"కంగారు పడకండి ఏం జరిగినా మన మేం చేయగలం చెప్పండి".

"అసలేమన్నారు? చూపురాదన్నారా?"

"భలేవారే! తప్పక వస్తుందట!"

"ఎప్పుడూ?"

"ఇప్పుడే ఆపరేషన్ చెయ్యకూడదట. ఓ ఆరు నెల్లు.. ."

"పావనీ..." గట్టిగా మంచంపై గుద్దాడు.

"చూడండి. మీరిలా బాధపడి నన్ను బాధ పెట్టడం" అతని చేతులు బలంగా పట్టుకొంది.

"పావనీ! నాలాంటి నష్ట జాతకుడూ, అసమర్థుడూ యీ ప్రపంచంలో మరెవ్వరూ లేరు. నేనింక బ్రతకటం అనవసరం."

"ప్లీజ్! అలా అనకండి మీరు బ్రతకాలి. మా కోసం బ్రతకాలి."

"బ్రతికి సాధించే దేమిటి?"

"అలా అందరూ అనుకుంటే ప్రపంచంలో చాలా మంది బ్రతకడం అనవసర మవుతుంది."

"పావనీ!"

"మీరా విషయం మరచి పొండి. యేం జరుగుతుందో నిబ్బరంగా భరిద్దాం."

కళ్ళు లేని భర్తతో రాని కన్నీటితో హాస్పిటల్ నుండి బయలుదేరింది పావని.

* * * *

ఆనందరావు చనిపోయిన తరువాత ఆ కుటుంబ భారం ఓ విధంగా దినేష్ మీద పడిందనే చెప్పాలి. దినేష్ మనసులో ఆనందరావు ఆత్మహత్య చేసుకున్నందుకు తానే ననే బాధ పీడిస్తున్నది. యెలాగయినా ఆ సంసారాన్ని ఓ తీరం చేర్చాలి. మంచి స్నేహితుడుగా తన బాధ్యత నెరవేర్చుకోవాలి. దినేష్ ఆవేళ వుదయం బయలు దేరేడు. అతను వచ్చేసరికి ఆనందరావు తల్లి ఏడుస్తూ కూర్చొని వుంది.

"అమ్మా! మళ్ళీ యేడుస్తున్నారా?"



# పావని

"చెట్టంత కొడుకును పొట్టను బెట్టుకున్న నాకు యేడుపుగాక యింకేం మిగిలింది బాబూ! యే తల్లికి నా వంటి దురదృష్టం రాకూడదు. తల్లి పోతే బిడ్డ లేడుస్తారు. కాని నా జాతకం చూడు బాబూ! బిడ్డ పోయి నే నేడుస్తున్నాను. వీళ్ళు మాత్రం గుండెలపై కుంపట్లలాగా బ్రతికే వున్నారు." అంటూ కూతుళ్ల వైపు చూసింది. ఆడ పిల్లలిద్దరూ కంట తడి పెట్టారు.

"అవేం మాటలమ్మా!" దినేష్ నెమ్మదిగా అన్నాడు.

"నేనిక బ్రతకలేను బాబూ! యీ ప్రపంచంలో మా కెవ్వరున్నారు. యింకా దేనికి బ్రతకాలి? వద్దు బాబూ వద్దు. నేనీ బాధ భరించలేను." హృదయ విదారకంగా విలపించ సాగింది. చూస్తున్న దినేష్ గుండెలవిసి పోయాయి.

"నే నున్నానమ్మా మీకు! నా కోసం బ్రతకాలి" దినేష్ ఆవేశంగా అనడం విని విస్మయంగా అతని కళ్లల్లోకి చూసింది ఆనందరావు తల్లి.

"చూడు బాబూ! ఏనాడూ కాలు బైట పెట్టలేదు. సిరిలో పుట్టి సిరిలో నే కాలు పెట్టాను. తీరా బిడ్డలవరకూ వచ్చేసరికి అంతా హరించుకు పోయింది. వాళ్ల జాతకాలంతే కాబోలు! బంగారం లాంటి బిడ్డ పోయాడు. యిక ఈ ఇద్దరాడ పిల్లల్ని యెలా పెంచను? వీళ్లకి పెళ్లి పెటాకులూ ఎలా చేయను? యిలా మోడుల్లా వాళ్లను చూస్తూ యెలా గడపను? తలచుకుంటేనే గుండె తరుక్కుపోతున్నది. నేనిక బ్రతకలేను బాబూ."

"అమ్మా! బాధపడకు. అందరం కలిసే పోదాం" ఇద్దరు కూతుళ్ళూ ఒకేసారి అన్నారు.

"అలాంటి నిర్ణయానికి మాత్రం రాకండి" భయంగా అన్నాడు దినేష్.

"మీరున్నారు. కొండంత ధైర్యాన్నిస్తారు. ఆదుకుంటారు. కాని యెంత కాలం? ఒకరికి భారంగా యీ జీవితం గడపటం, పొద్దాకా మీ సాయం కోరటం అదంత మంచి పద్ధతి కాదు. మాబోటి నష్ట జాతకులు భూమికి భారం. పోవటమే చాలా మంచిది" పెద్దమ్మాయి జానకి అంటున్న మాటలు సూటిగా దినేష్ గుండెల్లోకి శూలాల్లా దిగాయి.

"అమ్మా! నాకు ఒక రోజు అవకాశం యివ్వండి. రేపు మీ నిర్ణయం యెలాగయినా చేసుకుందురు గాని. రేపటివరకూ ఎలాంటి అఘాయిత్యమూ చెయ్యబోమని మాటివ్వండి" అంటూ దీనంగా చూసాడు దినేష్.

ఆ రాత్రంతా దినేష్‌కు నిద్ర పట్టలేదు. ఆలోచించి ఆలోచించి ఓ నిర్ణయాని కొచ్చాడు. వుదయం తన ముద్దు బిడ్డ రాజాను తీసికొని బయలు దేరాడు.

"రా బాబు! ఎవరీ బాబు?"

"నా కొడుకమ్మా" ఆప్యాయంగా బాబు నందుకుంది జానకి.

"అమ్మా! కూర్చోండి. మీతో చాలా మాట్లాడాలి!"




"ఏమిటి బాబు!" ఆనంద్ తల్లి లలితాంబ.

"నాకు పెళ్లయి నాలుగేళ్లయింది. రెండు సంవత్సరాల క్రితం యీ బాబును నాకు వదలి నా భార్య పరలోకం చేరింది."

"బాబూ! ఏమిటి నువ్వనేది?"

"ఔనమ్మా! ఈ కష్టాలూ కన్నీరూ అన్ని కుటుంబాలలో నూ వున్న కథలే."

"మళ్లీ పెళ్లి చేసుకోలేదా బాబు?"

"చేసుకొమ్మని ఎంతగానో ప్రాణం తీశారు. కాని నేను నా నిర్ణయం మార్చుకోలేదు."

"అలా అనకు బాబు. యీ పసిబిడ్డ కోసమయినా చేసుకోవాలి."

"భలేదానివమ్మా! తల్లి లేని వాడికి మరో తల్లి ఆ ప్రేమ పంచి యివ్వగలదా?"

"ఏం యెందు కివ్వదండి?" జానకి బాబు నెత్తుకొనే అంది.

"ఏమో! నాకు నమ్మకం లేదు."

"అలా అనకండి. బంగారం లాంటి మీ వంటి భర్త, మురిపించే యిలాంటి బిడ్డా దొరకటానికి ఆవిడ ఎంతో పుణ్యం చేసుకుని పుట్టాలి." జానకి బాబును ముద్దాడుతూ అంది.

"ఔను బాబూ! నీ జీవితం యిలా మోడుగాకూడదు" లలితాంబగారి నిర్ణయం.

"ఎవరెన్ని చెప్పినా నా నిర్ణయం మార్చుకోలేదు. బాగా ఆలోచించుకొని ఓ అభిప్రాయానికి రండి. యిది త్యాగం, దయ, సానుభూతి అనుకోకండి. మీ కుటుంబం చూశాక నా మనసు మారింది. మీ కభ్యంతరం లేకపోతే జానకిని నా భార్యగా, నా బిడ్డకు తల్లిగా...." అని జానకి ముఖంలో కీ, లలితాంబ ముఖంలోకి మార్చి మార్చి చూశాడు.

"బాబూ నవ్వనేది?" కన్నీటితో నే అంది లలితాంబ.

"అన్ని విధాలా మీ కిష్టమయితేనే. నా కిది రెండో పెళ్లి. ఒక విధంగా యిలా అడగడం తప్పే, అయినా...." అంటున్న దినేష్ నోటిని గట్టిగా తన చేత్తో మూసింది జానకి.

ఏనాడూ గడపదాటని జానకికి అంత ధైర్యం ఎలా వచ్చిందో తెలియదు.

"మరేం మాట్లాడకండి. నాలాంటి నష్ట జాతకులు ప్రపంచంలో మరొక రుండరని అనుకొంటూ నన్నెందుకు పుట్టించావని భగవంతుణ్ని యెన్నో తిట్టాను. కాని నాలాంటి అదృష్టవంతురాలు యీ లోకంలో నే వుండబోదని యిప్పుడను కుంటున్నాను. మీ హృదయంలో స్థానానికి అర్హురాలిని కాకపోయినా మీ పాదాల దగ్గర కాస్త చోటిచ్చి యీ బాబుకు తల్లిగా వుండనిస్తే చాలు" అంటూ దినేష్ పాదాల మీద వాలింది.

దినేష్ వివాహం అతి సామాన్యంగా జానకితో జరిగి పోయింది. ఆనందరావు కుటుంబానికి ఒక అండ ఏర్పడింది. దినేష్ కావాలనే విజయవాడ ట్రాన్స్ఫరుకు పెట్టుకున్నాడు. లలితాంబా, చిన్న కూతురూ అందరూ ఒకటిగానే వుండి పోయారు.

* * * *

గంపెడు బాధతో, కళ్ళులేని భర్తతో, యిద్దరు బిడ్డలతో, అంధకార బంధురమయిన భవిష్యత్తుతో మిగిలింది ఒకప్పటి కాలేజీ బ్యూటీ పావని. యేదో ఒక బ్రతుకుతెరవు కోసం వుద్యోగాన్వేషణకు అనేక ప్రయత్నాలు చేయసాగింది. తాత్కాలిక వుపయోగం కొరకు పది మంది పిల్లలకు ట్యూషన్ చెప్పడం ప్రారంభించింది. యిరుగు పొరుగుల సహకార సానుభూతుల ఆసరాగా కొద్ది రోజులలోనే ఒక కాన్వెంట్ స్కూల్లో టీచరుగా కుదిరింది. బ్రతుకే అమావాస్యగా వుంది. విధి పూర్తిగా విషం కక్కి పావని నికృష్ట జీవితాన్ని చూసి సంతోషంగా వేడుక చేసుకొంది.

"ఏవండీ! లేవండి. ముఖం కడుక్కుందురు గాని" భర్త చేయి పట్టుకొని లేప ప్రయత్నించింది పావని. కాని విజయ్ లేవలేదు.

"లేవండి!"

"పావనీ! నేను బ్రతకడం అవసరమా?"

"ఏమిటండీ ఆ మాటలు? మళ్లీ మొదటికే వచ్చారా?"

"అనేక కష్టాల పాలు చేశాను. మళ్లీ నీకు భారంగా...." నోరు మూసేసింది.

# మీ ఆశల సాఫల్యానికి...

# మార్గదర్శి

జీవితంలో గొప్ప గొప్ప కోరికలెన్నో ఈడేరాలని అందరం ఆశిస్తాం. ఆ ఆశల సాఫల్యానికి సదా మీ బాసటగా మార్గదర్శి మీకు ఆర్థిక సేవలందిస్తుంది. ఈ రోజే మార్గదర్శి చిట్‌ఫండ్ పథకంలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్
- లకిడికాపూల్, హైదరాబాద్
- చిక్కడపల్లి, హైదరాబాద్
- అమీర్‌పేట్, హైదరాబాద్
- ఎమ్ జి రోడ్, సికింద్రాబాద్
- ఎ ఎమ్ సి.కాంప్లెక్స్, విజయవాడ
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం
- స్టేషన్‌రోడ్, గుంటూరు
- జె పియన్‌రోడ్, వరంగల్
- టి నగర్ రాజమండ్రి
- సుబాష్‌రోడ్, కాకినాడ
- నెహ్రూ రోడ్, కర్నూలు
- వైరారోడ్, ఖమ్మం
- నరసింహారావ్‌పేట, ఏలూరు

డబ్బుకోసమేనా మీ చింత ! మార్గదర్శి ఉన్నది మీ చెంత !!



**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్.**

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు

అబిడ్ సెంటర్ హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-1

## పావని

"ఎందుకిలా మాట్లాడు తున్నారు? కష్టాలపాలు చేసింది మీరుగాదు నేను. నష్ట జాతకం మీది కాదు నాది. బంగారం లాంటి భవిష్యత్తు నా మూలంగా నాశనం చేసుకున్నారు. లక్షల కొలది ఆస్థిని నా కోసం వదులు కున్నారు. యింత త్యాగం చేసిన మీరు నాకు భారమా? ఎంత మాటన్నారండి? నేను బ్రతికినంత కాలం మీకు సుఖం సౌఖ్యం రావు కాబోలు. నాబోటిది బ్రతుక కూడదు" అంటూ తలను బలంగా మంచం కోటికి కొట్టుకుంటూ విలపించింది.

"పావనీ!" గట్టిగా తలపట్టు కొన్నాడు విజయ్.

"లేదండీ! నే బ్రతక కూడదు."

"పావనీ యింకెప్పుడు యిలా మాట్లాడను. ప్లీజ్!" ఎవర్ని ఎవరు ఓదార్చాలో తెలియని సంఘటన. ముఖం కడిగించి స్నానం చేయించింది. పిల్లలిద్దరినీ స్కూలుకు పంపించి భర్తకు భోజనం కలిపి–

"అన్నం తినండి" అందుకోబోయాడు.

"నోరు తెరవండి". లాలనగా ముద్ద లందించింది. అతని ముఖంలోకి చూస్తున్న పావనికి దుఃఖం కట్టలు తెంచుకుంది. పైకి వినిపించకుండా లోలోపలే అణచుకుంది. భోజనం ముగించి కాన్వెంటుకు బయలు దేరింది.

"ఏమండీ! వెళ్ళి వస్తాను."

"భోం చేశావా?"

"ఆఁ! చేశాను."

"నిజంగా!"

"నిజంగా నండీ!"

"సరే! వెళ్ళిరా" పావని బయటపడి కాన్వెంట్ చేరుకుంది.

"అమ్మా! మిమ్మల్ని ప్రిన్సిపాలమ్మ రమ్మన్నారు" లోనికి అడుగుపెట్టగానే చెప్పారు అటెండరు. పావని వెళ్ళింది.

"గుడ్‌మార్నింగ్ మేడమ్."

"గుడ్ మార్నింగ్. రా పావనీ. కూర్చో."

"చెప్పండి."

"నేను చెప్పాను చూశారా? యీవిడే పావని."

"అలాగా!" అంటూ అవతలి వ్యక్తి చూచింది. పావని నమస్కరించింది.

"పావని! వీరు రాజేశ్వరిగారు. లేడీస్ కాలేజీ ప్రిన్సిపాల్. నీ గురించి అంతా వివరంగా చెప్పాను. నీకు త్వరలో వుద్యోగం యేర్పాటు చేస్తానన్నారు."

"చాలా సంతోషం మేడమ్. మీ మేలు జన్మలో మరువలేను."

"చూడమ్మా పావనీ! రేపు అప్లికేషన్ పంపించు. జువాలజీ డిపార్టుమెంటులో ఓ పోస్టుంది. దానికి చాలా ఆఫర్లున్నాయి. అయినా తప్పకుండా కమిటీతో చెప్పి ఏర్పాటు చేస్తాను". రాజేశ్వరిగారంది.

"చాలా థాంక్సు అండీ" కృతజ్ఞతగా చూసింది.

"వస్తా మీనా. మరి నే చెప్పిన విషయం మరచిపోకు" అంటూ లేచిన రాజేశ్వరి వెళ్ళి కారులో కూర్చొంది.

"క్లాసుందా పావనీ?"

"ఔను మేడమ్."

"నీకు మంచి రోజులు వస్తాయి పావనీ! అధైర్యపడకు. రాజేశ్వరి నీకు తప్పకుండా పోస్టు యిప్పిస్తుంది."

"అంతా మీ దయ."

"పూర్ గరల్. నాదేముంది. సరే. టైమయినట్లుంది. వెళ్ళు."

"వస్తా మేడమ్."

క్లాస్ గదిలోకి వెళ్ళింది పావని. ఆ రోజు కాస్త వుత్సాహంగా అయిదు గంటలకల్లా బయలుదేరింది యింటికి

"పావనీ ఓ క్షణం."

"ఏమిటి మేడమ్!"

"రేపు ఆగస్టు పదిహేను. ఫంక్షన్ గురించి జరుగవలసిన కార్యక్రమాల

విషయం మాట్లాడాలి. మీరూ వుండండి." కమల రిక్వెస్టు.

"నా పరిస్థితి మీకు తెలుసు. అయినా మీబోటి పెద్ద లుండగా నేనెందుకు చెప్పండి." ప్రార్థనాపూర్వకంగా వారి వంక చూసింది పావని.

"సరే మీ యిష్టం."

"ప్లీజ్! తప్పుగా అర్థం చేసుకోకండి. వుండే తీరాలంటే వుంటాను."

"నో .... ఫర్వాలేదు. వెళ్లండి."

"థాంక్స్". యిల్లు చేరింది. విజయ్ మంచంపై పడుకొని వున్నాడు. పిల్లలు ఆడుకుంటున్నారు. వారిని దగ్గరలో వున్న స్కూల్లో చేర్పించింది పావని, కాన్వెంట్ ఫీజులకు తట్టుకోలేక.

"ఏమండీ!" ఆప్యాయంగా పిలిచింది.

"వచ్చావా పావనీ" లేచి కూర్చుంటూ అన్నాడు.

"వుండండి. కాఫీ తెస్తాను." లోనికెళ్లి కాఫీ కలిపి తెచ్చింది.

"తాగండి" అందించింది.

"నువు తాగావా?"

"తాగుతున్నానండి."

"నిజంగానా?"

"భలేవారే. నిజం."

కాసేపు మాట్లాడి యింటి పనుల్లో మునిగి పోయింది పావని.

* * * *

"గుడ్ మార్నింగ్ మేడమ్" పావని లోపలి కడుగు పెడుతూ అంది.

"పావనీ రా కూర్చో నీ కోసమే నాలుగుసార్లు కబురంపాను" ప్రిన్స్‌పాల్.

"రావటం కొంచెం ఆలస్యమయింది!"

"ఫర్వాలేదు యింటర్వ్యూ బాగా జరిగిందా?"

"ఆ జరిగిందండీ"

"ఎందరొచ్చారు?"

"దాదాపు నలభైమంది"

"అంతమందే!" మీనా ఆశ్చర్యంగా అంది.

"ఔను చదువుకున్నవాళ్ల సంఖ్య పెరిగింది మరి" పావని నవ్వింది.

"యిప్పుడే రాజేశ్వరికి ఫోను చేశాను. తప్పకుండా నీకే వచ్చేలా చూస్తానంది. యీ విషయమై యీ రోజే కమిటీ వారితో మాట్లాడతానంది.

"మీరూ, వారూ, నాకోసం చాలా శ్రమ తీసుకుంటున్నారు."

"నో నో యిందులో శ్రమేముంది, నీకా వుద్యోగంవచ్చి నీ జీవితం కొంత స్థిమితపడితే అంతే చాలు".

"మీబోటి సహృదయులుండగా నాకేం కొరత చెప్పండి?"

## గడుసులోకం

—బాబు






"అబ్బా! పావనీ నా కెంత బోర్ కొడుతూందో తెలుసా?" పావనికి బాధనిపించింది.

"మాట్లాడవేం పావనీ!"

"ఏం మాట్లాడను?"

"ఏదయినా...."

"అన్నట్టు చెప్పడం మరిచానండి."

"ఏమిటి పావని?"

"అదే నేను పని చేస్తున్న కాన్వెంట్ ప్రిన్సిపాల్ మీనాగారు మన కెంతో సాయం చేస్తున్నారు. ఉమెన్సు కాలేజీ ప్రిన్సిపాల్ రాజేశ్వరి గారితో మాట్లాడారట. వుదయం ఆవిడ వచ్చింది. నన్ను చూసింది. నా కెలాగయినా వుద్యోగం వచ్చే ఏర్పాటు చేస్తానని గట్టిగా చెప్పింది."

"అలాగా! ఆఖరికి నిన్ను వుద్యోగానికి కూడా పంపాను."

"అవేం మాటలండీ! భార్యభర్తల్లో అలాంటి వ్యత్యాసం యేముంది?"

"ఇంటిపనీ, వుద్యోగమూ రెండూ నువే చేసుకోవాల్సి వచ్చింది. కష్టంగా లేదా పావనీ!"

"భలే వారే! ఏం కష్టం చెప్పండి. మీరూ, పిల్లలూ, సంతోషంగా వుండడానికి యింతకు రెట్టింపు కష్టమయినా నేను సంతోషంగా చేయగలనండీ" తరువాత

"యిందులో నేను పెద్దగా చేసిందేముంది?"

"అలా అనకండి వచ్చి అడిగినవెంటనే వుద్యోగం యిచ్చారు. దాని మూలంగానే వేళకింత తినగలుగుతున్నాం"

"నో, నో అలా అనకు యిందులో నాదేముంది? పోస్టు గ్రాడ్యేట్ చదివిన నీకు యీ వుద్యోగం యివ్వటంలో నా గొప్పతన మేమీలేదు"

"అలా అనుకున్నా మీకు నా మనస్సులో వున్న ప్రత్యేక స్థానం మరువరానిది.

"ఒ. కె. వెళ్ళు" పావని బైటికొచ్చింది.

ఆ రోజు పని ముగించుకొని యింటి బయట భర్త మంచంపై కూర్చుంది.

"పావని"

"ఏవండీ"

"ఇంటర్వ్యూకి ఎందరొచ్చారు?"

"నలభైమంది దాకా వచ్చారండి అందులో స్ట్రాంగ్ రెకమెండేషన్‌తో కొందరున్నారు."

"అయితే కష్టమే"

"ప్రిన్సిపాల్ మాత్రం నాకే ఫేవర్‌గా వున్నారు. యీ విషయంలో మీనాగారు కూడా నాకెంతో తోడ్పడుతున్నారు."

"ఎప్పటికి తేలుతుందో?"

# అమావాస్య చీకటిలో

అమావాస్య చీకటిలో ఆరుకోట్ల ఆంధ్రావళి
దీపావళి కాంతులకై దిశలను పరికిస్తోంది

పెల్లుబికిన కోపంతో పల్లెలు పట్నాలు ముంచి
తల్లి గోదారి ఎంత తల్లడిల్ల జేసిందో!
మళ్ళీ ఎన్నాళ్ళకు ఆ మాగాణికి పచ్చదనం
ఇళ్ళు వాకిళ్ళలోన ఇదివరకటి సౌభాగ్యం!

విక్రమ సింహపురీ సీమ విపరీతపు నీటి కరువు
రాయలసీమకు తొలగని రావణ కాష్టపు కరువు
తెలంగాణ జిల్లాలలో అలముకొన్న మేత కరువు
తెలుగు రాజధాని దాహం తీర్చే తెరువుకు కరువు

ఋతువులారు కాదు నేడు ప్రకృతిని గల ఋతువొకటే
భిన్న భిన్న రూపములతో వేధించే వేసవి అది
సత్య ధర్మ దాన శీల సద్గుణాళి కరువవగా
వెలసె వేయి రూపాలతో స్వార్థమొకటి మానవహృది.

అతివృష్టికి మునిగిపోయి అనావృష్టికెండిపోయి
అస్తుబిస్తయిన పైర్లు అవసరాలు తీర్చేనా
అంగడిలో సరుకుల ధర లాకాశానికి తాకగ
రేపుకు నిర్దిష్ట రూప రేఖలూహనైన లేక
అమావాస్య చీకటిలో ఆరుకోట్ల ఆంధ్రావళి
దీపావళి కాంతులకై దిశలను పరికిస్తోంది.

—సూర్యదేవర రవికుమార్

## పావని

"నాలుగు రోజుల్లో తెలిసిపోవచ్చు. యీ రోజే కమిటీ వారితో చర్చిస్తానని రాజేశ్వరిగారు ఫోన్లో మీనాగారితో చెప్పారట"

"అలాగా?"

"ఔను."

"సరే పడుకో మళ్ళీ చీకటితో లేవాలి. పిల్లలు పడుకున్నారా?"

"ఆ చాలా సేపయింది. లేవండి మంచం లో పలేస్తాను"

"వద్దు పావని యిక్కడే పడుకుంటాను"

"భలేవారు యిక్కడ మంచు కురుస్తుంది లేవండి" లేవక తప్పలేదు.

పావని మంచం లో పల వేసింది. విజయ్ పడుకున్నాడు. కళ్ళు మూసుకున్నా నిద్రరాని పావని శూన్యంలోకి చూస్తూ వుండిపోయింది.

★ ★ ★ ★ ★ ★

రిక్రియేషన్ హాలులో సమావేశమయారు కమిటీ మెంబర్లు. సెక్రటరీ, ప్రిన్సిపాల్ మరో యిద్దరు హెడ్ఆఫ్‌ది డిపార్ట్‌మెంట్స్. కమిటీ సెక్రటరీ రాఘవమ్మగారు పెద్దగా చదువుకోలేదుగాని దండిగా డబ్బుంది. అయినా యింకా అధికంగా సంపాదించాలనే ఆశ జాస్తి. ప్రిన్సిపాల్ రాజేశ్వరి ఫయిల్ తెప్పించింది. యింటర్వ్యూకి వచ్చినవారు నలభైమంది.

"రాజేశ్వరిగారూ యింటర్వ్యూలో మీరు నామినల్‌గా సెలక్టు చేసింది ఎందర్ని?" సెక్రటరీ.

"నలుగుర్ని" అప్లికేషన్స్ బయటికి తీసింది.

"అన్నట్టు కమిషనర్‌గారి అమ్మాయి సుందరి, ఎం. ఎల్. సి గారి మరదలు భాగ్యలక్ష్మి, ఫిలిం డిస్ట్రిబ్యూటర్ నరసయ్యగారి చెల్లెలు కస్తూరి. వీళ్ళు ముగ్గురూ చాలా కావాల్సినవాళ్ళు. మీ నలుగురిలో వాళ్ళున్నారు కదూ?" వింటున్న రాజేశ్వరి ముఖంలో నీడలు తేలాయి.

"వీళ్ల ముగ్గురిలో ఒక్కరూ నా లిస్టులో లేరు"

"లేరా?"

"ఔను లేరు"

"ఎందుకని?"

"బాగుంది మీ ప్రశ్న. ఎందుకంటే యింటర్వ్యూలో వాళ్ల సమాధానాలు సంతృప్తికరంగా లేవు గనకనే."

"అయితే మీ లిస్టులో వుండెవరు?"

"పావని, స్వర్ణ, రాధిక, భావన. వీళ్ళు."

"మీకు దగ్గరవాళ్లా?" రాఘవమ్మ వింతగా ప్రిన్సిపాల్ ముఖంలోకి చూస్తూ అంది.

"సెక్రటరీగారూ మీరు చాలా తేలికగా మాట్లాడుతున్నారు. యింటర్వ్యూలో నేనులేను. వారిని సెలక్టు చేసింది హెడ్ లెక్చరర్లు" కాస్త కోపం.

"అలాగా" ఆలోచించి "యెవరో తెలియనివాళ్ల కివ్వటం నాకేం నచ్చలేదు. వాళ్ల కిచ్చినంత మాత్రాన మనకు ఒరిగేదేమిటి? యం.ఎల్.సి.గారి మరదలుకో డిస్ట్రిబ్యూటర్‌గారి చెల్లెలికో యిద్దాం."

"బాగుంది. మరి మన కాలేజీ స్టాండర్డు గురించి కూడా ఆలోచించాలిగదా?"

"మన కాలేజీకేం బాగానే వుంది కదా?"

"బాగా చెప్పగల వారిని తీసుకుంటే బాగుంటుంది. మంచి ఫలితాలు నిలుస్తాయి" అదోలా అంది రాజేశ్వరి.

"అంటే వీళ్ళు బాగా చెప్పలేరనా?"

"అనే అర్థం. యింటర్వ్యూలో వీరి సమాధానాలు బాగాలేవు.

"చూడండి ప్రిన్సిపాల్‌గారూ మీ సమాధానాలు నాకేం నచ్చలేదు.. వీళ్ళు పరీక్ష పాస్ అయ్యే కదా వచ్చారు?" కొంచెం విసుగు కన్పించింది.

"కావచ్చు పరీక్ష పాసయిన ప్రతిఒక్కరూ తెలివిగలవారుకాదు"

"అంటే మీ వుద్దేశం ఎవరికివ్వాలని?"

"నాదేంలేదు ఆ డిపార్ట్‌మెంట్ హెడ్‌గారిని అడగండి"

"ఏమండీ శారదగారూ మాట్లాడరేం?" సెక్రటరీ అటు తిరిగింది.

"పావనికిస్తే బాగుంటుంది."

"పావనా! ఎవరి కాండిడేటు?"

"ఎవరి కాండేటూకాదు."

"యిదో ప్రిన్సిపాల్‌గారూ సర్దుకుపోవాలి. పైగా మా అమ్మాయిని ఎం. ఎల్. సి. గారి తమ్ముడి కిద్దామని ఆలోచన. యీ స్థితిలో యిలా చేస్తే యింకా ఏం మర్యాద వుంటుంది? యేమయినా ఈ పోస్టు ఆయన మరదలికే ఖాయం."

"అంటే?"

"అంటేలేదు గింటేలేదు. అదంతే" తన మాటకు తిరుగు లేదనే ధీమా కొట్టవచ్చినట్లు కనిపించింది.

"అంతేనంటారా" రాజేశ్వరి చివరిసారిగా అడిగింది.

"అంతే! రేపే ఆర్డర్సు పంపండి ఆవిడకిస్తే మనకు కాస్త డొనేషన్‌లు మిగులుతాయి. ఏమీలేని సన్నాసులకిస్తే మిగిలేదేంటి? బూడిద" అంటూ తన భారీ శరీరాన్ని లేపి నెమ్మదిగా వెళ్లి కారెక్కింది.

"ఈవిడగారెప్పుడూ యింతే. యిలాగే పోతే ఆఖరికి ఈ కాలేజీకి నిజంగా మిగిలేది ఆ బూడిదే" శారద కాస్త కోపంగా అంది.

"బంధుత్వాలూ, డబ్బూ, యివి కావాలి. చదువూ, తెలివీ, పదిమంది పిల్లలు బాగు పడడం ఈవిడగారికొద్దు కాబోలు?" చంద్ర చీదరించుకుంది.

"ఆవిడ సెక్రటరీ. యిష్టం ఆవిడదే! కాదనే ధైర్యం మనకెక్కడుంది? యిలా ధర్మం న్యాయం అనుకుంటూ మనం చిత్రహింసలతో పడివుండాలిసిందే" రాజేశ్వరి బాధగా గొణిగింది.

"ఏంటోనండి మొన్న ఏదో రోగం వచ్చింది పోతుందన్నారు. పోవాలని యెందరి దేవుళ్లకు మొక్కానో కాని నా ప్రార్థన యే దేవుడూ ఆలకించలేదు" అందరూ నవ్వారు.

"ఆవిడంత త్వరగా పోతే మంచి రాజ్యం చెయ్యదూ?" చంద్ర చిరునవ్వు.

"సరే పదండి" అందరూ లేచారు.

(ఇంకా ఉంది)

## అలీబాబా గుహలో క్రొత్త కథ

అబ్రకదబ్ర!
ఓపెన్ సీసేం!




సింహంమార్కు టపాసులు,
మతాబులు ప్రసిద్ధిచెందినవి.
లక్షలాది ప్రజలు కోరి, కొని,
కాల్చేవి. నిరపాయకరమైనవి.
విదేశీ పనితనపు నాణ్యతతో
తయారైనవి.

**ది నేషనల్ ఫైర్ వర్క్స్ ఫ్యాక్టరీ**

శివకాశి-626 123,
తపాలా పెట్టె: 13
ఫోన్: 60 & 1205,
తంతి: SPARKLERS




ADWAVE/NFW/3211/TEL

దీపావళి కథలపోటీలో రు 700/- బహుమతి పొందినకథ

# నామకరణం

"జాగ్రత్తమ్మా! నేనుంటా మరి. స్టేషన్‌కి బావగారొస్తారు.

లేదా ఎవర్నయినా పంపుతారు- తొందర బడి ఏ రిక్షాయో ఎక్కేయకు- కాస్సేపు ప్లాట్‌ఫాం మీదే వుండు. ట్రైన్ దిగుతున్నపుడు జాగ్రత్త!

అందరూ దిగేకే దిగు- అరగంట ఆగుతుందక్కడ" చక్రధరం చెప్పిన జాగ్రత్తలకు నవ్వుకుంది శివకామేశ్వరమ్మ.

"అలాగే లేరా - నాకిదేం కొత్త ఏమన్నానా. వయసు పైనబడి దృష్టి మందగించిందనే గాని స్టేషన్‌కి ఒకరు రావాలా? నాకు తెలియని ఊళ్ళా? తెలియని ఇళ్ళా - నువ్వుండు" అంది-

"ఆసజ్జలో మీ కోసం సున్నుండలూ, మామిడి తాండ్ర, పళ్ళూ పెట్టేను- మర్చిపోకండత్తయ్యా" అంది సుమిత్ర.

"అలాగేలే - అయినా నా ఒక్కదానికీ ఎందుకివన్నీ"

"స్వరాజ్యం తోనూ పావనితోనూ ఉన్న విషయం చెప్పమ్మా- మరోలా అనుకోవద్దను - ఏమాత్రం వీలున్నా గోపాలం మెద్రాసు నుంచి వస్తాడు" అన్నాడు చక్రధరం.

"సరే- నే చెబుతాలే" అంది శివకామేశ్వరమ్మ.

గార్డు విజిల్ వేసేడు- రైలు కూత వేసి కదిలింది-

కొడుకు వంక, కోడలి వంక ఒక్కమారు చూసింది- శివకామేశ్వరమ్మ.

"ఆ బాలసారె అయ్యేక మీరూ మామయ్య గారూ యిక్కడికే వచ్చెయ్యండి." అంది సుమిత్ర ఏదో గుర్తొచ్చిన దానిలా. ఆ మాటలంటున్నపుడు ఆమె మనసులో వువ్వెత్తున లేచిన ఆప్యాయతను అర్థం చేసుకుంది కామేశ్వరమ్మ.

'అలాగేలే' అన్నట్టు తలూపింది సమాధానంగా.

చక్రధరం చెయ్యి వూపేడు. అతని ముఖంలో దిగులు!

"పిచ్చితండ్రి. వీడెప్పుడూ పసివాడే" అనుకుంది.

శివకామేశ్వరమ్మ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ముందుగా అనుకున్నదే అయినా ఈ ప్రయాణం ఎంతో హడావుడిగా అన్పించింది కామేశ్వరమ్మకు - మనమరాలు పావనికి ఆడపిల్ల పుట్టిందని పది రోజుల క్రితం స్వరాజ్యం నుండి శుభవార్త వచ్చింది-

'బారసాల మాయింట్లోనే. నువ్వు తప్పకుండా రావాలమ్మా" అంటూ రాసింది-

ఇప్పటి రోజులు వేరు- పద్ధతులు వేరు. ఇంకా యీ వేడుకలకి యీ ముసలమ్మ ఎందుకూ అనుకుందే గాని వెళ్ళాలని గట్టిగా అనుకోలేదు. కానీ రెండు రోజుల క్రితం పావని రాసిన ఉత్తరం చదివిన దగ్గర్నుండే వెళ్ళి తీరాలనే కాంక్ష మొదలయ్యింది- "నా కూతురి బారసాల మీ యిద్దరి సమక్షంలోనూ జరగాలని అనుకుంటున్నా నమ్మమ్మా. తాతయ్య ఎటూ వచ్చేరు. నువ్వు కూడ రావాలి. ఇది కోరిక అనుకుంటే మరో బాధ్యతను కూడ నీ కప్పగిస్తున్నాను- నీ మనమరాలికి ఏం పేరు పెట్టాలో నువ్వే చెప్పాలి". అంటూ రాసింది- వీళ్ళందరికీ ఎందుకింత అభిమానం తనంటే? ఏ దెలా





వున్నా తను వెళ్ళడానికే నిశ్చయించుకుంది - పావని అభిమానంతో రాసింది. అది చాలు తనకు. రెండోది... ఆయనను వదిలి నాలుగు నెలలే అయినా నాలుగేళ్ళయినట్టు వుంది- పెళ్ళయిన యిన్నేళ్ళలో ఆయన నొదిలి వున్నది యీ నాలుగు నెలలే! వెధవది... కరువు రోజులొచ్చేసి తల్లి దండ్రులే బరువని పించే రోజుల్లో ఒకరికే భారమవడ మెందుకని వేరపవలసి వచ్చింది గానీ లేకుంటే చివరి రోజుల్లో వేరు వేరుగా వుండే వారా?

"రెండు రోజులు ముందుగా వెళ్తే అది సంతోషిస్తుందిరా" అంది ఉత్తర మొచ్చిన మర్నాడు చక్రధరంతో.

"నిజమేనమ్మా. కానీ నాకు సెలవు దొరకాలిగదా" అన్నాడు.

మనసు, అభిమానాలూ వున్నా ఒక్కొక్కప్పుడు పరిస్థితులు అనుకూలించవు- స్వరాజ్య మంటే చక్రధరానికెంతో అభిమానం. పావని అక్షరాలా చక్రధరం గుండెల మీదే ఆడుకునేది. అటువంటిది ఏమాత్రం అవకాశమున్నా రాకుండా వుంటాడా?

మొత్తానికి చక్రధరానికి సెలవు దొరక్క తనొక్కతే బయల్దేరక తప్పలేదు- లేకుంటే యింత - వయసొచ్చి యింత బలగం ఏర్పడ్డాక ఒంటరిగా ప్రయాణం చేసే పరిస్థితి ఏర్పడుతుందా?

రైలు ముందుకు పోతుంటే శివకామేశ్వరమ్మ ఆలోచనలు గతంలోకి పరుగెత్తాయి.

తనంటే అందరికీ అభిమానమే - తన చేతుల మీదుగా ఎన్నో పెళ్ళిళ్ళూ శుభకార్యాలూ జరిగాయి - మరెన్నో బారసాలల్లో పాలు పంచుకుంది- ఆ మాటకొస్తే బారసాల అంటే తననే పేరు సూచించ మనే వారంతా. తనకు కలిగిన సంతానంలో మగపిల్లలిద్దరికీ పేర్లు ఆయనే పెట్టేరు.

ఆడపిల్లకు మాత్రం పేరు పెట్టే బాధ్యతను తొలిసారిగా తన కప్పగించారు. అప్పట్లో తన తండ్రి రాజకీయాల్లో దేశ స్వరాజ్య సాధనకోసం తిరిగేవాడు- ఆ ఉద్యమానికెందరో ఎన్నోరకాలైన త్యాగాలు చేశారు. అప్పట్లో పుట్టడం వల్లనే దానికి స్వరాజ్యం అని పేరు పెట్టింది. స్వరాజ్యం ఎంతో అపురూపంగా స్వేచ్ఛగా పెరిగింది. చివరికి చదువు, పెళ్ళి విషయాలలో కూడ దాని యిష్టాని కెవరూ అడ్డురాలేదు.

రైలు ముందుకు పోతూనే వుంది. ఆలోచనల్లో మునిగి తేలిన శివకామేశ్వరమ్మకు ప్రయాణం అట్టే విసుగనిపించలేదు.

. * * * * *

స్టేషన్‌కి అల్లుడు రాజేంద్ర ప్రసాద్ వచ్చాడు. 'బావున్నారా అత్తయ్యా. ప్రయాణం బాగా జరిగిందా' అంటూ కుశలాన్ని ప్రశ్నించేడు- అన్నిటికీ సమాధానాలు చెప్పింది కామేశ్వరమ్మ.

జట్కా యింటి ముందాగే సరికి గేటుదగ్గరకి ఎదురొచ్చింది స్వరాజ్యం. 'బావున్నావా అమ్మా' అంటూ ఆమె చేతిలోని సామానందుకుంది.

మెట్లెక్కి అరుగు మీదికి వచ్చేసరికి పావని వచ్చి ఆనందంతో కౌగలించుకుని, "అంత ముందుగా రాస్తే యిప్పుడా రావడం. నీతో మాట్లాడకూడ దనుకున్నాను" అంది బుంగమూతితో -

"ఏం చేయనే. మీ మామయ్య కూడా వస్తానంటే ఆగేను- తీరా వాడికి సెలవివ్వలేదు వాడి ఆఫీసరు." అంటూ జవాబు చెప్పి,

"ఇంతకీ మీ తాతయ్యేరే" అనడిగింది.

"మొత్తానికి ఆడబుద్ధి పోనిచ్చు కున్నావ్ కాదమ్మమ్మా" అంది పావని మూతి ముడుస్తూ.

"ఏవిఁటే.... ?"

"ఏవిఁటేవిఁటీ. ముందు నాకూతుర్ని చూసి ఎత్తుకుంటావనుకుంటే నువ్వేమో తాతయ్య



నడుగుతున్నావ్" అంటూ నవ్వేసి,

"అదిగో..... ఆ మూల.... పట్టె మంచం మీద మూల పురుషుడిలా– మీ మాటలు అయినాకే రా". అంది–

"పోవే గడుగ్గాయీ. ఇంతకీ మీ ఆయనేడే? ఇలాగే వేపుకు తింటున్నావా?"

"ఆహా! ఇంతకంటే ఎర్రగా. బజార్లో కెళ్ళేరు. కావలిస్తే వచ్చేక చూడు– ఎంతెర్ర బడ్డారో" నవ్వేసింది పావని.

"ఎలావున్నారూ?" ఏ సంబోధనా లేని కామేశ్వరమ్మ ప్రశ్నకు మంచం మీది మూలపురుషుడు పండు మీసాలు మెలేసి,

"మహారాజులా వున్నాను–" అన్నారు.

"మరి కిరీటమేది తాతయ్యా?" ఠక్కున అందుకుంది పావని.

"పెళ్ళికాక ముందు వరకూ వుండేదే – ఆ తర్వాత దాని స్థానాన్ని మీ అమ్మమ్మ ఆక్రమించింది. అంచేతే యీ నాలుగు నెలలూ మకుటం లేని మహారాజులా వెలిగాను. మళ్ళీ వచ్చేసిందిగా"

నవ్వులతో ఇల్లు గొల్లుమంది.

"బావున్నారా అమ్మగారూ" పరిచయమున్న గొంతులా అన్పించి అటు తిరిగి చూసింది కామేశ్వరమ్మ.

"ఎవరూ.... సీతాలా.... బాగున్నావటే?" అడిగింది–

"మీ దయవల్ల బాగానే వున్నా నండమ్మగారూ"

# నామకరణం

"ఎక్కడుంటున్నారూ.... మీ ఆయనెలా వున్నాడూ"

"బాగానే వున్నాడమ్మగారూ. బేంకీలో అప్పు దీసుకుని చిన్న కిళ్ళీ కొట్టెట్టేడు – మారాణీ పేటలో వుంటున్నాం. అంతా మీ చలవ" అంది.

"మాదేముందే.... ఆశివుడి లీల. ఇంతకీ పిల్లలా"

"ఒకాడపిల్ల – మీ పేరే ఎట్టుకున్నాం"

కామేశ్వరమ్మ కళ్ళు ఆనందంతో తడిశాయి.

"లెగండమ్మగారూ. బాత్రూంలో ఏన్నీళ్ళెట్టేను. తానం చెయ్యండి. ఆ తర్వాత తీరిగ్గా మాటాడుకోవచ్చు" సీతాలు మాటలకు లేచింది కామేశ్వరమ్మ. స్నానం చేసి వచ్చే సరికి ఫలహారమూ కాఫీ సిద్ధం చేసింది స్వరాజ్యం. కాసింతతిని, కాఫీ తాగి మేడ మీద సన్న జాజి పందిర క్రింద కేను కుర్చీలో కూలబడింది.

అప్పటికి సాయంకాలపు వెలుగు పూర్తిగా తగ్గిపోయింది. చల్లని గాలి, దూరంగా కంటికందంగా కన్పించే దీపాల తోరణాలు కామేశ్వరమ్మ మనసులో ఎన్నెన్నో తీపి జ్ఞాపకాలను రేపేయి!

జీవితం క్షణభంగురమని తెలిసినా బాంధవ్యాల వుచ్చుల్లో పడి, సంసార తాపత్రయంలో నలిగి, వంశాన్ని, కుటుంబాన్ని పెంచి మమతాను రాగాల్ని వారి చుట్టూ అల్లుకుని, సమస్యల సాలెగూళ్ళలోంచి బయటపడుతూ తొలి సందెలోని వెలుగుకూ మలిసందెలోని మలయమారుతానికీ పులకించి పోతూ రేపటి కోసం ఆశగా ఎదురు చూస్తూ మనిషి ఏం సాధిస్తున్నాడు? చివరికి ఏం మిగుల్చుకుంటున్నాడు?

ఇదిగో... యిటు వంటి కాసింత సంతృప్తే, బాంధవ్యం లోంచి జనించిన ఒకింత అనురాగం, ఆప్యాయత – అంతే! అంతకు మించి ఏం కావాలి?

డాబా పిట్టగోడ మించి క్రిందికి చూసింది కామేశ్వరమ్మ. పావని భర్త రాజశేఖరం వచ్చినట్టున్నాడు.

"మా అమ్మమ్మ వచ్చిందండోయ్. మీ గురించి అడిగింది కూడ" అంటోంది పావని.

"సర్లే" అని గొంతు తగ్గించి, "ఇంతకి నీ కూతురికి ఏం పేరు పెట్టమంది? సరిగ్గా రేపాసమయానికి ఏ సావిత్రో అనసూయో అని పెట్టమంటే .... గోవిందా"

అతని మాటలకు కామేశ్వరమ్మ మనసు చివుక్కుమంది.

"అవునుమరి! పావని కున్న అభిమానం అతనికెందుకుంటుంది? అయినా తను పాత తరం మనిషే. తన అభిరుచులు యీ కాలం వారికి నచ్చక పోడంలో ఆశ్చర్యం లేదు" అనుకుని సరిపెట్టుకుంది–

అమాటకొస్తే గోపాలంకి తను పెట్టిన పేరు కోడలికి నచ్చిందా? ఇప్పుడిప్పుడు వాడు ప్రయోజకు డయ్యాక ఆమెకు తనపై గురి కుదిరింది.

నిట్టూర్చింది కామేశ్వరమ్మ.

"ఏమే బామ్మా. ఈ చీకట్లో కూర్చుని ఏం చేస్తున్నావే. బాగున్నావా" అంటూ డాబా మీది కొచ్చాడు గోపాలం.

"నీ గురించే అనుకుంటున్నానురా బాబూ. ఎప్పుడొచ్చావ్?"

"ఇప్పుడే వచ్చేనే. నువ్విచ్చేవని తెల్సి ఇల్లంతా వెతికి యిక్కడికొచ్చాను". అంటూ ఆమె కాళ్ల దగ్గర చతికిలబడ్డాడు.

"నిక్షేపంలా వున్నాన్రా. మీరంతా వుండగా నాకేం లోటూ. ఇంతకీ నీకెలా వుందక్కడ? మంచి భోజనం దొరుకుతోందా లేక ఆ సాంబారు నీళ్లేనా" అడిగింది మనవడి తల నిమురుతూ.

"ఫర్వాలేదే. ఎటొచ్చీ ఏ చింతకాయ పచ్చడో, గోంగూర పచ్చడో గుర్తుకొచ్చినప్పుడు మాత్రం నాలిక లాగేస్తుంది. ఆ వెంటనే నీ దగ్గరకు పరుగెత్తుకొచ్చేసి నీ చేతి వంట తినాలనిపిస్తుంది".

"నా పిచ్చి నాయనే" అంటూ కళ్ల నీళ్లు పెట్టుకుంది కామేశ్వరమ్మ.

"ఈమారు నిన్ను నాతో మెడ్రాస్ తీసుకెళ్లి పోడానికే నిశ్చయించుకున్నాన్లే. అలా అని వంట కోసంకాదు సుమా. ఎంచక్కా ఓ వంటమనిషిని పెడతాను".

"పెళ్లిచేసుకుంటే అన్ని సమస్యలూ తీరిపోతాయిరా పిచ్చి సన్నాసీ. మీ నాన్నతో చెప్పి మంచి సంబంధం చూడమంటాను- ఎంచక్కా మీరిద్దరూ చిలకా గోరింకల్లా వుంటే అప్పుడొచ్చినేనూ మీ తాతయ్యా నీ దగ్గరే వుంటాం నువ్వు పొమ్మనే వరకూ".

* * * * *

భోజనమయ్యాక భర్తతో నాలుగు ముక్కలు మాట్లాడి ముందు వాకిట్లో మల్లెమొక్క ప్రక్కన వాల్చివున్న మంచంమీద చతికిలబడింది కామేశ్వరమ్మ. వెన్నెల పల్చగా వుంది. ఆ లేత వెన్నెల్లో రంగు రంగుల క్రోటన్ మొక్కలు వింత అందంతో మెరుస్తున్నాయి.

ఆ సమయంలో పావని భర్త రాజశేఖరం బయటకొచ్చాడు.

"నాయనా రాజశేఖరం" పిలిచింది- "ఏవిటి మామ్మగారూ' అంటూ వచ్చి ఆమెకెదురుగా కూర్చున్నాడు.

"చూడునాయనా. పావని నామీదో పెద్ద భారాన్ని వేసింది. దానికి నేనంటే పిచ్చి అభిమానం. పాత తరానికి చెందిన మా అభిరుచులు వేరు. ఈ తరంవార్లైన మీ అభిరుచులు వేరు- పెద్దవాళ్ళున్నా ఎవరి పెళ్లిళ్ళు వాళ్లే పెద్దలై చేసుకుంటున్న యీ రోజుల్లో మీ అమ్మాయికి పేరు నేను పెట్టడం ఏం బాగు చెప్పు? ఇప్పటి ఫేషన్ రోజులకు అనువైన పేరేదో మీ యిద్దరే ఆలోచించి పెట్టుకుంటే బావుంటుందని నా అభిప్రాయం- అది నా మాట వినటంలేదు. నువ్వు నచ్చజెప్పాలి" అంది కామేశ్వరమ్మ - ఆ మాటలకు రాజశేఖరం ఆశ్చర్యపోయేడు.

"అదేంటి మామ్మగారూ యీ కుటుంబంలో చాలమందికి మీరే నామకరణం చేశారటగా. పావనికి మీమీద గురి. మీరే ఏదో వూహించి చెప్పండి. అంతగా నచ్చకపోతే అప్పుడే ఆలోచిద్దాం. మీరు సూచించిన పేరు మాకు నచ్చుతుందనే నమ్మకం నాకుంది" అన్నాడు-

"ఎందుకైనా మంచిది మీరు కూడ ఆలోచించండి నాయనా" అంది.

"అలాగేలెండి" అంటూ లేచాడతను.

"ఆ తర్వాత గోపాలం వచ్చి మద్రాసు కబుర్లు చెప్పడం మొదలుపెట్టేడు- 'అమ్మమ్మని ఈ రాత్రి పడుకోనివ్వవా ఏంటి' అని పావని అనేవరకూ గోపాలం ఆపలేదు!

గదిలో పక్క లేసింది స్వరాజ్యం. మంచం మీద పడుక్కున్నదన్న మాటేగాని కామేశ్వరమ్మకి నిద్రపట్టలేదు- ఆమె ఆలోచనలు ఎక్కడెక్కడో పరుగులు తీస్తున్నాయి.

వీధి గుమ్మం సీతాలు చేత కడిగించి తనే



గిరగిర తిరిగే చక్రం! వెలుగు జిలుగులు వెదజల్లే విష్ణుచక్రం!!
ఫోటో : కె. పి. ఎ. స్వామి, విశాఖపట్నం

స్వయంగా ముగ్గులేస్తోంది స్వరాజ్యం- గోపాలం అప్పుడే నిద్రపోయాడు.

తెల్లారితే బాలసాలే!

కామేశ్వరమ్మ ఆలోచనలు ఇరవై రెండేళ్ల వెనక్కు పోయాయి.

ఆ రోజింకా జ్ఞాపకమే. తెల్లారితే చక్రధరం కొడుకు బాలసారే. చుట్టాలతో యిల్లు కలకల్లాడిపోతోంది. ఆ రోజంతా తను వంటింటికే అంకితమైపోయింది. తనకు సాయంగా పెంటమ్మ.

పెంటమ్మకప్పుడు తొమ్మిదేళ్ళు. డబ్బు కోసం పనిచేసే పనిపిల్లే అయినా అది అలా వుండేది కాదు- శుభ్రంగా తల దువ్వుకుని ఉతికిన గౌను వేసుకుని మరీ పన్లోకొచ్చేది. రెండు రోజులై అది తమ యింట్లోనే వుండిపోయింది. ఎవరికే అవసర మొచ్చినా దానినే పిలిచేవారు.

ఆ రాత్రి...భోజనాలయ్యేక దేవుడి గదిలోకొచ్చి కూర్చుంది తను - మనవడికి పెట్టబోయే పేరుకోసం ఆలోచిస్తోంది. చివరికి రెండు పేర్లు స్ఫురించాయి. ఒకటి శివుడి పేరు. రెండోది కృష్ణుడి పేరు. శివుడంటే తనకిష్టమే. అటు శివుడినీ యిటు రాముడినీ కలిపి 'శివరామ్'గా మార్చి ఆయన రెండోవాడికి పెట్టారు. పోతే కృష్ణుడన్నా తనకిష్టమే. చిన్నప్పుడు కృష్ణుడి పాటలు రాసుకుని పాడేది తను. ప్రతి కృష్ణాష్టమికీ తమ యింట్లో వుండే పెద్ద కృష్ణుడి బొమ్మకు రంగువేసి అలంకరించేది. అంచేత ఆకృష్ణుడి పేరే మనవడికి పెట్టాలనే నిర్ణయానికొచ్చింది.

సరిగ్గా అదే సమయంలో ఆ గదిలోకి వచ్చి తలుపు దగ్గర నించుంది పెంటమ్మ.

పనులన్నీ అయిపోయాయిగా. పోయి పడుకో అంది దాని వంక చూసి. పెంటమ్మ కదలలేదు. తలొంచుకుని అలాగే నిలబడి పోయింది-

"ఏవిఁటే? ఏం కావాలీ" అడిగింది తనే-

అది వెంటనే ఏమీ మాట్లాడలేదు- కానీ దాని మనసులో ఏదో అడగాలనే ఆరాటమున్నట్టు అర్థమైంది. మళ్లీ రెట్టించి అడిగేసరికి నెమ్మదిగా గొంతు విప్పింది-

"రేపుబాబుకి పేరెడతన్నారు గదమ్మా"

"అవునే - తెలియనట్టు కొత్తగా అడుగుతున్నావేం?"

ఈమారు కాస్త నసిగి, మరి నాక్కూడ ఓ పేరెట్టండమ్మగారూ" అంది- దాని మాటలకు ఆశ్చర్యపోయింది తను.

"అదేంటే ... నీకో పేరుందిగా ... మీ అమ్మా నాన్నా పెట్టింది"

"అది నాకొద్దమ్మగారూ. మీరే మరో మంచి పేరెట్టండి" అంది.

పెంటమ్మకి తల్లీ తండ్రీ యిద్దరూ లేరు. పెంటమ్మ తల్లికి వరుసగా యిద్దరు పిల్లలు పుట్టి పురిట్లోనే పోతే మూడో పిల్లని పుట్టిన వెంటనే పెంటమీద వేసి దానికి 'పెంటమ్మ' అని పేరు పెట్టారట. పెంటమ్మ బతికింది. దాని తల్లీతండ్రీ యిద్దరూ రెండేళ్ల తేడాతో పోతే తాత దగ్గర పెరుగుతోంది.

అందరూ దాన్ని 'పెంటా'అంటారు- కోపమొస్తే

పెంటచ్చీ' అనీ పిలుస్తారు. తను మాత్రం ...టుంది. కానీ ఎవరెలా పిలిచినా పలుకుతు... పాపం! ఆ పేరు దానికెంత యిష్టంలేదో - సమయమొచ్చింది కాబట్టి తన అభిప్రాయాన్ని బయటపెట్టింది.

చిన్న కోరికే అయినా ఎంత విచిత్రమైన కోరిక అది! నచ్చని పేరును మార్చుకోవాలనే కోర్కె చాలమందికి వుంటుంది. తక్కువ కులంలో పుట్టి పెద్ద పెద్ద సినీతారలయినవాళ్ళు చాలామంది తమ తమ పేర్లను అందంగా మార్చుకున్నారట- ఆ సంగతీ అదే చెప్పిందో సారి.

ఏమైనాసరే దాని కోరిక తీర్చాలనే అన్పించింది. ఆ రాత్రే ఒక నిర్ణయానికొచ్చి సంతృప్తిగా నిద్రపోయింది తను-

మర్నాడు ఉదయం భర్తతో చెప్పి దానికో కొత్త గౌను తెప్పించింది. అందరితో పాటు దాన్నీ తలంటు పోసుకోమంది. కొత్త గౌను వేసుకోమంది. తర్వాత పిల్చి చెవిలో తన అభిప్రాయం చెప్పింది. అంతే! దాని ముఖం ఆనందంతో విప్పారింది- తలూపి అంగీకారాన్ని తెలియజేసింది.

నామకరణ సుముహూర్తానికి బంధువులూ స్నేహితులూ అంతా వచ్చారు- మనవడికి తను సూచించిన రెండు పేర్లలోనూ బాలగోపాలం అనే పేరే చక్రధరానికీ నచ్చింది. ఆ పేరే ఖాయం చేసేరు. అటు మనవడికి నామకరణం జరిగిన మరుక్షణంలో నే తను పెంటమ్మను దగ్గరకు పిల్చి "ఈ రోజు నుండీ దీని పేరు సీతాలు. పెంటమ్మకాదు- మీరంతాకూడ అలాగే పిలవాలి" అంటూ అందరి సమక్షంలో దానికి నామకరణం చేసింది. అలా ఆనాటి నుండీ పెంటమ్మ సీతాలు అయింది. ఆ పేరు దానికి బాగా నచ్చిందని తెల్సి ఎంతో సంతోషించింది-

అయితే ఆ సంతోషం ఎంతో కాలం నిలవలేదు. దానికి తనా పేరు ఎందుకు పెట్టానా అని పశ్చాత్తాపపడవలసిన రోజు కూడ వచ్చింది-

అనుకోకుండా పావని పెళ్ళిలోనే దాని పెళ్ళి కుదిరింది- రాజశేఖరం దగ్గర పనిచేసే రామయ్య సీతాల్ని చూసి మనసుపడ్డాడు. మనువాడాలను కున్నాడు. ఏ కట్నకానుకలూ తీసుకోకుండానే పెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళి తామే దగ్గరుండి జరిపించారు.

ఆ కృతజ్ఞత దానికిప్పటికీ వుంది. దానికి తను దేవతతో సమానం.

అయితే సీతాలు కాపురం అనుకున్నంత సజావుగా ...ము. ఎందుకు కలిగిందో నిప్పులాంటి సీతాలుమీద దాని మొగుడికి అనుమానం కలిగింది. క్రమంగా తాగుడికి లోనై సీతాల్ని ఏలుకోనని పంపించేశాడు.

అలా సీతాలు మళ్ళీ వచ్చేసింది. జరిగిం దానికి తనూ ఎంతో బాధపడింది.

"మీరేం చేత్తారమ్మాగోరూ. నాకాడితో కాపరంజేసే గీత లేదేటో- అయినా నాకేటి? ఇలా మీ యింట పన్జేసుకుంటే నా కడుపు నిండిపోద్ది. నా జీవితం

## బ్రతుకు దివ్వెలు

దీపావళి పర్వ
దినము తిలకించగా
రకరకాలుగా జనుల
బ్రతుకు దివ్వెలు వెలిగె

మేడలో వెలిగేటి
మేలి దివ్వెలు కొన్ని
వీధిలో వెలిగేటి
పేద దివ్వెలు కొన్ని

స్నేహమే ప్రాణముగా
జీవించు దివ్వియలు
వెలుతురే వూపిరిగా
విలసిల్లు దివ్వియలు

రవ్వ మువ్వలతోడ
రవళించునవి కొన్ని
నవ్వు పువ్వులతోడ
కవ్వించునవి కొన్ని

కలిమితో వెలిగేటి
కలికి దివ్వెలు కొన్ని
లేమితో మిడికేటి
లేకి దివ్వెలు కొన్ని

చెలిమికై చేసాచి
చెలగు దివ్వెలు కొన్ని
పరులకై వెలుతురులు
పంచు దివ్వెలు కొన్ని

- వేముగంటి నరసింహాచార్యులు

## నామకరణం

ఎళ్ళిపోద్ది. అయితే నా కడుపు పండి ఒక్క నలుసైనా పుడితే ఆ బిడ్డని చూసుకుంటూ వుండిపోయేదాన్ని. ఆ రాత నాకులేదు" అని బాధపడింది సీతాలు.

సీతాలనే పేరు పెట్టడం వల్లనే దానికా కష్టాలొచ్చాయేమో అన్పించేది. ఆ మాటే దానితో అంటే,

'సీతమ్మవారి పేరుకేటమ్మా. మాలచ్మి. పవిత్రమైంది. నా రాత యిలా తగలడితే పేరేం జేసింది? ఈడికెవరో కిట్టనివాళ్ళు నూరిపోసేరు. నిజం నిలకడమీద తెలవకపోదు" అంది.

అర్ధరాత్రి పన్నెండు - అంతా నిశ్శబ్దంగా వుంది. కామేశ్వరమ్మ మస్తిష్కంలో జ్ఞాపకాలు సుళ్ళు తిరుగుతూనే వున్నాయ్.

మనవడికి బాలగోపాలం అని పేరు పెట్టి తను తప్పే చేసిందా అనుకుంది చాలామార్లు. కొడుక్కి ఆ పేరు నచ్చినా కోడలికి నచ్చలేదన్న సంగతి క్రమంగా అర్థమైంది.

"అత్తగారు ఎంచెంచి ఆ పేరు పెట్టినందుకు వాడికా బుద్ధులే వచ్చేయి" అనేది. దానికి తగ్గట్టు గోపాలం ప్రవర్తన కూడ అలాగే వుండేది. చదువుమీద శ్రద్ధ చూపేవాడు కాదు. ఎంతసేపూ స్నేహితులూ షికార్లూను. కాస్త వయస్సొచ్చాక ఆడపిల్లల స్నేహాలు కూడ. ఎర్రగా బుర్రగా వుండేవాడేమో అమ్మాయిలంతా వాడి చుట్టూనే వుండేవారు. దానికితోడు గోపాలం పాటలు పాడేవాడు. లలితగీతాలూ, సినిమా పాటలూ నాటకాలూ పద్యాలూ ఒకటేమిటి ఎవరెక్కడ ఏది పాడమన్నా బిడియపడకుండా నిర్భయంగా గొంతెత్తి పాడేవాడు.

ఏ మాటకామాటే అనుకోవాలి. వాడి గొంతులో ఏదో ఆకర్షణ వుండేది. అదే వాడిని ఉచ్ఛస్థితిలోకి తీసుకువెళ్ళుందనిపించేది. కానీ యింటర్ మొదటి సంవత్సరం తప్పడంతో అందరికీ వాడి భవిష్యత్తు మీద అపనమ్మకం ఏర్పడిపోయింది.

దీర్ఘంగా నిట్టూర్చింది కామేశ్వరమ్మ.

పేరుబలం కొంత మనిషిని నడిపించకపోదు! తనమీద నమ్మకం వుంచుకొన్నవారికి తనేం అన్యాయం చెయ్యలేదు. వాళ్ల వాళ్ల అదృష్టాలు తనని కూడ గొప్పదాన్ని చేశాయి.

లేకుంటే ... మరి చక్కబడదనుకున్న సీతాలి సంసారం చక్కబడేదేనా?

ఎందుకూ పనికిరాడనుకొన్న గోపాలం ఇలా గొప్పవాడయ్యేవాడా? అందుకే యిప్పటికీ తనపై అందరికీ గురి!

సీతాలు ఆశపడ్డట్టుగానే దాని జీవితంలోకి మంచి రోజులొచ్చాయి. కట్నం తేలేదన్న కచ్చకొద్దీ రామయ్య మేనమామే యీ అనుమాన విష బీజాన్ని అతని బుర్రలో నాటి మరో పెళ్ళి చేసి కట్నం లాగాలనుకున్నాడు. కానీ నిజం బయటపడింది. రామయ్య పశ్చాత్తాపపడి సీతాల్ని మళ్ళీ తన జీవితంలోకి ఆహ్వానించాడు. బ్రతుకును చక్కదిద్దుకున్నాడు.

ఆ జంటకిప్పుడో పాప - ఆ పాపకి తన పేరేనట!

సరైన సంగీత జ్ఞానం లేకుండా అల్లాటప్పాగా పాటలు పాడే గోపాలం ఒక్కమారు సినీ గాయకుడైపోతాడని ఎవరనుకుంటారు? ఒక పెద్ద సభలో గోపాలం పాడిన పాట విని వాడి కంఠంలోని మాధుర్యాన్ని గుర్తించి వాడిని తన సినిమాలో పాడమనిఅడిగాడొక సినీ నిర్మాత. అంతే! ఆలంబన దొరికి గోపాలంలోని కళ విజృంభించింది. సంపాదనకు సంపాదన, కీర్తికి కీర్తి రెండూ లభించాయి వాడికి.

చిన్నప్పుడు పిల్లనగ్రోవి వూదుతూ అల్లరిచిల్లరగా తిరిగిన బాలకృష్ణుడే పెద్దయ్యాక మంచి వ్యవహర్త అవలేదా? గీతాజ్ఞానామృతాన్ని పంచలేదా ఆ విషయాన్ని కాస్త ఆలస్యంగా గ్రహించిన కోడలు తనని కొత్తగా గౌరవించడం చూస్తే నవ్వొస్తుంది.

శివకామేశ్వరమ్మ ఆ ఆలోచనల్ని అంతటితో ఆపి, మనవరాలి కూతురికి పెట్టే పేరు కోసం ఆలోచించసాగింది. అది తనకు మాత్రం నచ్చితే

చాలదు. అందరూ మెచ్చాలి. ముఖ్యంగా రాజశేఖరానికి నచ్చాలి! అంతకుముందు అనుకున్న నాలుగైదు పేర్లల్లోంచి ఒకటి ఎంచి నిశ్చయం చేసి, సంతృప్తిగా నిద్రపోయింది.

* * * * *

"సత్పురుష సభా మధ్యే ... వ్యవహారార్థం మమకుమార్యాః

ఆయుష్యాభి వృద్ధ్యర్థం ... మాసనామ్నా ..." అంటూ పురోహితుడు చెబుతుంటే వెండి పళ్లెంలో బియ్యం సర్ది భర్తకందించింది పావని. అక్కడ చేరినవారంతా ఆ పాపకు పెట్టబోయే పేరు ఏమైవుంటుందా అని అత్యంత ఆసక్తితో చూస్తున్నారు. రాజశేఖరం అందరి వంకా చూసి, ముగింపు చెప్పబోయే సస్పెన్స్ రచయితలా కూతురి పేరును ఒక్కొక్క అక్షరమే ఉచ్చరిస్తూ ఆ పళ్లెంలో వేలితో రాశాడు.

"క ... రు ... ణ"

చెంగల్రావు పేరు చాంతాడంత పేరేదో ఆ ముసలావిడ పెడుతుందనుకునేవారంతా ఆశ్చర్యపోయారు. కార్యక్రమం ముగిశాక రాజశేఖరం చెప్పాడు.

"చాలమందికి ఆశ్చర్యమే కలగొచ్చు. ఆ మాటకొస్తే యీ ఉదయం ఆవిడ నాకా పేరు చెప్పినప్పుడు మొదట నేనే ఆశ్చర్యపోయాను. నిజానికి 'కరుణ' చాల మంచి పేరు. నాగరికత పెరుగుతూ మనిషికీ మనిషికీ మధ్య అడ్డు గోడలు



నిరంతరంగా ఏర్పడుతూ హింస, దౌర్జన్యం, దోపిడి, క్రౌర్యం, కక్ష దినదినం పెరిగిపోతున్న యీ రోజుల్లో ప్రాణులన్నిటికీ గొప్పవాడైన మానవుడు తోటి ప్రాణుల ఎడల సహజంగా చూపాల్సిన కరుణ, జాలి చూపించకుండా పోతున్నప్పుడు వాటిని గుర్తు చెయ్యాల్సిన బాధ్యత మనకు వుంది. ఆ పదాన్ని వుచ్చరించడం ద్వారా అది కొంత సాధ్యపడుతుంది. అలా కాకపోయినా పేరుకుతగ్గ కరుణ స్వభావంతో నా కూతురు పెరగడమే నేను కోరుకొనేది!" అన్నాడు రాజశేఖరం. అందరిలోనూ ఆలోచన మొలకెత్తింది!

"బావుంది. మరి యీ శుభసమయంలో సినీగాయకుడైన బాలగోపాలం ఓ పాట పాడాలి" అన్నారెవరో.

"అవునోయ్! "కరుస్తానోయ్ ... చచ్చినాడా" లాంటివి కాకుండాట మంచి పాట పాడు" అన్నాడు రాజేంద్రప్రసాద్ నవ్వుతూ.

బాలగోపాలం లేచి, గళం విప్పేడు.

"పాడరాదా పాట ... పదిలముగ నీ నోట ...
పాట వరమని మురిసి ... పాట సుధామని తలచి
హిమగిరులు సుమవనులు ... విమలకేదారములు
వినువీధి తారకలు ... విని విని మురవంగ
పాట కోటలు దాటి ... పారావారము దాటి
పరుగు పరుగున ... నాకలోకములు చేరంగ"

పాట విని అంతా ముగ్ధులయ్యారు.

ఒరేయ్ గోపాలం ... ఆ పాట రాసిందెవరో తెలుసునట్రా" అడిగేడు తాతయ్య.

"తెలీదు తాతయ్యా. చిన్నప్పుడెప్పుడో బామ్మ నేర్పించింది. ఆ పాటతో నే నేను సినిమాల్లోకి వెళ్లాను. ఆ పాటంటే నాకెంతో యిష్టం" అన్నాడు.

"ఆ పాట రాసిందెవరో కాదురా. మీ బామ్మే" అన్నాడు తాతయ్య తాపిగా.

ఈమారందరూ ఆశ్చర్యంతో శివకామేశ్వరమ్మ వంక చూశారు.

"నిజమేనా బామ్మా" ఒక్క గంతులో బామ్మ దగ్గరకు వెళ్లేడు గోపాలం.

ఆమె కళ్లల్లో అతనూహించినంత ఆనందంలేదు. ఆ స్థానంలో సంతృప్తి, వాత్సల్యం, ప్రేమ, అభిమానం!

"చెప్పు బామ్మా ... అదే నిజమైతే ఓ మంచి సినిమాలో పాడుకుంటాను. మా బామ్మ పేరును వెండి తెరమీద మెరిపిస్తాను". అన్నాడు.

నిజమేనన్నట్లు చిన్నగా తలాడించి, గోపాలం తలను ప్రేమతో నిమురుతూ 'నేను పేరు పెట్టిన నా మనవలు నాకూ నా వంశానికీ పేరు తెచ్చేవాళ్లయ్యారు. అది చాలు. నాకు' అనుకుంది కామేశ్వరమ్మ. అప్పుడామె కళ్లు సంతృప్తిగా మెరిశాయి!! □



బి. వి. ఆర్. రాయగడ

★ పంజాబ్ మారణకాండ అరికట్టడానికి మార్గం దొరకదా? దీనిపై మీ అభిప్రాయం?

● రాజకీయవేత్తలు తమ తమ స్వార్థ ప్రయోజనాల కోసం టెర్రరిస్టుల వంటి అనేకానేక ద్రోహులను పాలోసి పాముల్ని పెంచినట్టు పెంచుతారు. అవసరం తీరాక- అవి మీ కక్కర లేదంటే కుదురుతుందా? కాటేస్తాయి. చెడు పెంచడం సులభం. కాని త్రుంచడానికి చాలా యాతన పడాలి.

బి. కె. సోంపేట

★ యువతీ యువకులు మాట్లాడుతూ కాలాన్ని మరిచి పోతారు కదా! ఆ శక్తి ఎవరిలో వుంది? కారణం?

● వారి వయస్సులో వుంది- కాల గమనాన్ని గుర్తించని శక్తి?

★ అక్కయ్యా! కొన్ని పత్రికలు ఏదో పార్టీకి డబ్బాలుగా మారితే మరికొన్ని పత్రికలు హీరోలకి వారి సంతతికి బాకాలుగా మారు తున్నాయి. అసలు నేడు వస్తున్న మంచి పత్రికలు ఏవి?

● చెప్పడం కష్టం తమ్ముడూ! పత్రికలని నేడు నడిపించేది డబ్బు- ప్రకటనలు. అంచేత అవి ఎవరిస్తే వారి బాకా వూదడం సహజం కదా?!

కె. వి. ఆర్. విశాఖపట్నం

★ శాంతి! ఎక్కడుంది?

● ఆ పేరుకలవాళ్ళు చాలా మంది తెలుసు నాకు! కాని మిరడిగేది- యుద్ధానికి యుద్ధానికి మధ్య శాంతిని గురించి కాబోలు! అదెక్కడుంటుంది బాబూ- చరిత్ర పుస్తకాలలో- ఛాప్టర్‌కి ఛాప్టర్‌కి మధ్య కాళీగా వుండే తెల్ల కాగితం తప్ప?!

కె. వి. ఎల్. దరిశి

★ మీ జీవితంలో మరిచిపోలేని సంఘటన అంటూ ఏదైనా వుందా?

● ఇంకాలేదు!

★ మీరు ప్రస్తుతం రాస్తున్న నవలలు?

● నవలలా?! నవల అనాలి. సాధారణంగా ఒక నవల- ఒకసారి రాస్తాను.... రెండే చేతులు ఒకటే బుర్రా కదా!?

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

★ ప్రస్తుతం మన రాజకీయ వ్యవస్థపై మీ అభిప్రాయం?

● సినిమాలకి పనికొచ్చేటంత వినోదభరితంగా వుందంటున్నారు. నా కంతగా తెలియదు మరి!

కె. వి. ఆర్. భిలాయినగర్

★ ప్రస్తుత దేశ పరిస్థితిని పట్టి నవ్యశక్తికి ఆహ్వానిస్తున్నారా? వర్తమానమే మేలను కుంటున్నారా? జరిగి పోయినదే మళ్ళీ కావాలను కుంటున్నారా?

● ఏ రాయి అయితేనేమిటి పళ్ళూడ గొట్టుకుందుకు అనుకుంటున్నా నయ్యా!!

జి. ఎన్. ఆర్. రామకృష్ణాపూరు

★ మీ దృష్టిలో నిజమైన స్నేహితులు ఎలా వుండాలి?

● కష్టం సుఖం చెప్పుకుంటే- కథలుగా రాయకుండా వుండాలి. సహాయం చేసి చెప్పకుండా వుండాలి. ఆనందాన్ని పంచుకున్నట్టే విషాదాన్ని కూడా పంచుకోవాలి.

సి. ఎస్. తిరుపతి

★ కులానికి మతానికి ఉన్న తేడా ఏమిటి?

● మతం క్రమశిక్షణనీ కులం మనఃతత్వాన్ని యిస్తుంది. ఇవి వ్యక్తిగతంగా ఉపయోగమేమో గాని వ్యవస్థలో వీటికి ప్రాముఖ్యం యివ్వడం అనాగరికమని నా నమ్మకం.

కె. బి. ఎమ్మిగనూరు

★ రిజర్వేషన్లపై జరుగుతున్న ఉద్యమం....

● నిష్ప్రయోజనం. ఒకళ్ళటూ ఒకళ్ళిటూ లాగడమే అధికార వర్గానికి కావలసినది. అప్పుడేకద- ముఖ్య విషయాలపై ప్రజల దృష్టి పడకుండా- యిలాంటి చిన్న విషయాలను గురించి అల్లరిపడుతూ కాలం గడిపేస్తారు!

కె. ఎన్. ఎమ్. ఖర్గపూరు

★ సాహిత్యానికి సామాజిక ప్రయోజనం వుండాలి అంటారు. అయితే ఈ దిశగా తెలుగు రచయితలు ఎంత వరకు ముందుకు వెళ్ళారు?

● చాలా చాలా ముందుకు వెళ్ళారని కదా- అంతా అంటున్నారు. సామాజిక ప్రయోజనం అంటే సమాజంలో కుళ్ళుని గ్లామరైజ్ చేసి భూతద్దంలో నుంచి చూపించి - చివరికి తెలుగు సినిమాలో నీతిలాగా ఓ నీతి చెప్పడమే కదా! అలాంటి కథలు 'చెప్పి మరి రాయిస్తున్నాం - పాఠకుల కోసం' అంటున్నారు పేపర్ల వారు. .. రాయిస్తే రాసే రచయితలూ - అలా రాయించి ప్రచురించే పేపర్లూ శ్రీరామరక్షగా వుండగా- సామాజిక ప్రయోజనం - మూడు పువ్వులూ ఆరు కాయలుగా విస్తరించదంటారా!

ఎం. సి. ఎస్. చినమల్లారెడ్డి

★ అక్కయ్యా! రెండు కథలు పంపాము. బాల్‌పెన్‌తో రైటింగ్ షీట్సుపై ఒక పక్కనే వ్రాసి పంపాము. తిరిగి వచ్చాయి. అలాగే బాల్‌పెన్‌తో జోక్స్ పంపితే తిరిగి వచ్చాయి. మేం ఏ ఇంకుతో రాసి పంపాలి? ఏ కాగితాలపై రాయాలి?

● ఇప్పటికేనా తెలియ లేదా? రాసే పెన్నుది కాదు- విలువ అని!! రచనలో సత్తా వుండాలని.... ఆరుద్రగారు ప్లాట్‌ఫారం మీద కొన్న రూపాయి పెన్నుతో 'సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర రాశారు.... నేను ఇంపోర్టెడ్ గోల్డు షీఫర్ పెన్నుతో ప్రెస్సు కాపీ రాశాను!! అంచేత? నాకేం పేర్రాలేదు! వారికే కద వచ్చింది. ముందు మీరు రాస్తున్న దెలా వుందో మీరే చదివి చూసుకోండి. □

# అపెల్ చెప్పే నిజా నిజాలు

మాత్రంచేత అవి నాసిరకం టి.వీలని అనలేం. కాని అసలు చిక్కు ఎక్కడ వస్తుందంటే, కొంత కాలానికి ఈ కిట్లు అమ్మిన విదేశీ కంపెనీ ఆ మోడల్‌ని విరమించుకున్నప్పుడు ఇక ఆ విడిభాగాలు ఇక్కడ దొరక్క ఆ కస్టమర్లు పడే ఇబ్బంది అంతా ఇంతాకాదు.

ఇక ఇంకోరకం వున్నారు. వాళ్లే ఈ దేశంలో అసలు టి.వి. టెక్నాలజీని రూపొందించామని నిర్విరామంగా చెప్తూవుంటారు. తప్పులేదు. కాని వాళ్ళుకూడా ముఖ్యమైన విడిభాగాల కోసం విదేశాల మీదే ఆధారపడాలి.

ఈ గందరగోళంలో పాపం ఏంచెయ్యాలో తోచని కస్టమరు అటూ ఇటూ ఊగిసలాడుతూ ఉంటాడు.

ఇటువంటి పరిస్థితిలో మేం చెప్పేదొక్కటే. మీరు ఒక మంచి టి.వి. కొనాలనుకుంటే ఒకసారి అపెల్ టి.వీని చూడండి. అత్యుత్తమమైన దేశీ విదేశీ భాగాల సమ్మేళనంతో, అత్యంత సాంకేతిక నైపుణ్యతతో టి.వీని రూపొందించి మీ ముందుంచాం. మన దేశపు టి.వి. తయారీరంగంలో హేమాహేమీల ఆధ్వర్యంలో అపెల్ టి.వి. రూపుదిద్దుకుంది. ఇది ఏళ్ల తరబడి నమ్మకంగా పనిచేస్తుందని హామీ ఇస్తున్నాం.

అపెల్ ఇదంతా ఇంత ధీమాగా ఎలా చెప్పగల్గుతోంది? అవునుమరి లాభార్జనే పరమావధిగా పెట్టుకుని టి.వీలు చేసి అమ్మే కంపెనీలవలే కాకుండా రాష్ట్రంలో ఎలక్ట్రానిక్స్ పరిశ్రమాభివృద్ధికోసం స్థాపించబడిన ప్రభుత్వ సంస్థ అపెల్. ఒక ఉన్నతమైన ఆశయ సాధనలో అపెల్ టి.వి. మొదటిమెట్టు మాత్రమే. అదిలోనే హంసపాదు అపెల్ ముమ్మాటికీ రానివ్వదు.

## APEL

**వట్టి మాటలు కట్టిపెట్టి గట్టినాణ్యత పంచిపెట్టే అపెల్.**

ఆంధ్రప్రదేశ్ ఎలెక్ట్రానిక్స్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ లిమిటెడ్
— ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సంస్థ




కావేరి పోర్టబుల్ 14"B/W రు. 1575/-



గంగమార్క్ II కలర్ రు.7,680/-



యమున కలర్ రు.7,500/-



నర్మద (కలర్) 6794/-

బయటి ఊర్ల అమ్మకాలపై రవాణా, ఇన్స్యూరెన్స్ ఛార్జీలు అదనం.

విజయవాడ: డోర్‌నెం.29-6-32,వార్డునెం.25
రామచంద్రరావు రోడ్, సూర్యారావు

విశాఖపట్నం: డోర్ నెం.50-92-1/F,

సీరియల్:

# నిశ్శబ్ద సంగీతం

బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

భర్త చేతిలోంచి పొట్లం అందుకుంది రాజేశ్వరి. మంగళసూత్రాలు బయటకు తీసి ఆమె మెడలో వేసింది. ఆమె వారించలేదు.

"నీకు సామాన్లు లేవా?" జ్ఞాపకం వచ్చి అడిగారు శ్రీపతిగారు.

జవాబుగా నవ్విందామె. ఆ నవ్వులో నిరాశ నిస్పృహ! దైన్యం! అనిశ్చలత!

"అదికాదమ్మా! చేతి సంచీ కూడా తెచ్చుకోలేదా?" మరలా అడిగారు.

మళ్ళీ అదే నవ్వు! ఆ దంపతులు కళ్ళతోనే కూడ బలుక్కున్నారు, ప్రస్తుతానికేమీ అడగకూడదని.

శ్రీపతిగారు రైల్వేలో పనిచేసి రిటైరయ్యారు. తర్వాత చిన్న చిన్న కాంట్రాక్టులు చేసారు. కాలం కల్సొచ్చి పెద్ద కంట్రాక్టరయ్యారు. లక్షలకు అధిపతి. ఇద్దరు మగపిల్లలూ యిద్దరాడపిల్లలూ సంతానం. అందరికీ వివాహాలయ్యాయి. మగపిల్లలు నాగ్‌పూర్‌లో ఒకడూ కలకత్తాలో ఒకడూ పనిచేస్తున్నారు. ఆయన ఖరగ్‌పూర్‌లో సెటిలయ్యారు. అక్కడ పెద్ద భవంతి కట్టించారు.

శ్రీపతిగారి భవంతిలో అడుగుపెడ్తూ అడిగిందామె.

"బాబూగారూ! ఇక్కడ గూండాలు లేరుకదా?"

"బాబుగారు కాదమ్మా బాబయ్యగారూ అని పిలు!" సర్ది చెప్పింది రాజేశ్వరి.

"ఇక్కడెవరూ రౌడీలు లేరమ్మా! అంతా మంచివారే!" హామీ యిచ్చారు శ్రీపతిగారు.

"ఉంటే నాకేం భయం! మీరున్నారు కదా!" అని నవ్వింది.

"అమ్మగారూ!" పిల్చింది రాజేశ్వరిని.

"అమ్మగారుకాదు! పిన్నిగారూ అని పిలవాలి" కరెక్టు చేసారు శ్రీపతిగారు.

"అయ్యో నామతిమండా! బాబయ్యగారి భార్య పిన్నిగారు కాకపోతే అమ్మగారెలా అవుతారు! మీరేమి అనుకోకండమ్మగారూ!"

అంటూ నవ్వింది.

మరలా అదే నవ్వు! జీవంలేని నవ్వు! అర్థంలేని నవ్వు, పిచ్చి నవ్వు!

"పర్వాలేదమ్మా!" అంది రాజేశ్వరి.

"రాత్రిళ్ళు మీదగ్గరే పడుకొంటా! ఒంటరిగా పడుకొంటే భయం! వాళ్ళు వస్తారు! యమభటుల్లాంటి వాళ్ళు! ఎక్కడున్నా కనిపెట్టి పట్టుకొంటారు! అయినా బాబుగారున్నారుగా! ఏవంటారు బాబుగారూ?"

నవ్వుతో ముగించింది.

శ్రీపతిగారికి ఏమనాలో తోచక "అవును.పరవాలేదు!" అన్నారు.

"ఎవరమ్మా వాళ్ళు?" ఆరా తీయాలని అడిగింది రాజేశ్వరి.

పకాల్న నవ్విందామె.

"మీ రొట్టి పిచ్చివాళ్ళలా వున్నారు పిన్నిగారూ! రౌడీలు, వాళ్ళపేర్లూ ఎడ్రస్సులూ చెబుతారా? వాళ్ళొట్టి కసాయివాళ్ళు! చూడండి ఎలా కొట్టారో!" ఆమె కళ్ళలో నీరు తిరిగింది.

పైటతీసి జాకెట్టు పైకిలాగి వీపు చూపించింది. శ్రీపతిగారున్నారన్న సిగ్గుకూడా పడలేదు.

ఆమె వీపు మీదున్న వాతలు చూసి జాలిపడ్డారా దంపతులు.

"పోనీ తల్లీ! ఆ దుర్మార్గులనుంచి బయటపడ్డావ్! ఆ విషయం మర్చిపో!" ఊరడించింది రాజేశ్వరి.

ఆ రాత్రి ఆమెను తమ గదిలోనే పడుకోబెట్టుకొన్నారా దంపతులు

మర్నాడు భర్తతో అంది రాజేశ్వరి–

"ఈమెకు మతిస్తిమితం తప్పినట్టుంది! డాక్టరుగారికి చూపిస్తే బావుణ్ను!" అని.

★ ★ ★ ★

అంతా విని సానుభూతితో నిట్టూర్చారు డాక్టరుగారు.

'ఇప్పుడామె కెలా వుంది డాక్టర్?" అడిగారు శ్రీపతిగారు

"పర్వాలేదు! ప్రోగ్రస్ బావుంది. మెంటల్‌గా అప్సెటయింది. చిన్న షాక్ తింది! వారం పదిరోజుల్లో మామూలు మనిషి కావచ్చు!" చెప్పారు

దీర్ఘంగా నిట్టూర్చి లేచారు శ్రీపతిగారు.

మరో మూడు వారాలు గడిచాయ్ నర్సింగ్ హోంకి వెళ్లారు శ్రీపతిగారు. డాక్టరుగారితో మాట్లాడ్తూంటే గబగబా డాక్టరుగారి గదిలో ప్రవేశించిందామె.

"డాక్టర్! స్పెషల్ వార్డు రూం నెంబరు టూ పేషంటు మందు తాగనని..." శ్రీపతిగార్ని చూసి ఆగిపోయింది.

"నీకెందుకమ్మా! సిస్టర్స్ చూసుకొంటారు!" లాలనగా వారించారు డాక్టరుగారు.

'బావున్నారా బాబయ్యగారూ! పిన్నిగారు రాలేదా?" ఆప్యాయంగా పలకరించింది శ్రీపతిగార్ని.

"ఆవిడకు రావాలనే వుందమ్మా! కానీ తీరిక లేదు! రెండో అమ్మాయిని పురిటికి తీసుకొచ్చాం! మనవల్తోనే దానికి సరిపోతోంది! నిన్ను చూసి రమ్మంది! వచ్చాను!" చెప్పారు.

"చూడమ్మా దేవీ! సిస్టర్ మేరిని ఒకసారి పిలు!" ఆమెను బయటకు పంపారు డాక్టరుగారు. ఆమె వెళ్లాక అడిగారు శ్రీపతిగారు.–

"ఆమెపేరు దేవి అని చెప్పిందాండి! మేమెంతడిగినా పేరు చెప్పిందికాదు!" అన్నారు.

"షి ఈజ్ నౌ ఆల్‌రైట్! ఫోన్‌చేద్దామనుకొంటున్నా! మీరే వచ్చారు!"

"థాంక్యూ డాక్టర్! బిల్ పంపండి పే చేస్తా!" కృతజ్ఞతలు తెలిపారు శ్రీపతిగారు.

జరిగిన కథ– 12: రమ గర్భవతయింది. తనకి రఘుని వివాహం చేసుకొనే ఉద్దేశ్యం లేదని ఉష రఘుతో చెపుతుంది. రేణుకాదేవిని కలిసానంటూ హనుమాన్ ప్రసాద్ అనే అతను లక్నో నుంచి పంపిన టెలిగ్రామ్ చదువుకుని లక్నో వెళ్ళిన రఘుకి ఎప్పటిలా నిరాశే ఎదురయింది వ్యధిత హృదయంతో హైదరాబాదు చేరుకున్నాడు రఘు కలకత్తా డైమండ్ హౌస్ నుండి సుజాత సహాయంతో బయటపడి ఇంచుమించు మతి స్థిమితం లేని స్థితిలో నున్న రేణుకి శ్రీపతి, రాజేశ్వరి దంపతులు ఆశ్రయం ఇచ్చారు ఆమెకు ఒకసైకియాట్రిస్టు దగ్గర ట్రీట్‌మెంటు ఇప్పించసాగారు.

"డిస్చార్జి చేసేముందు ఆమె గురించి తెల్సుకొన్నది మేం స్టడీ చేసింది మీకు తెలియజేయాలి! ఈమె ఒక కలిగినింటి కోడలు! పిల్లలున్నారు! ఏవో దృష్టశక్తులు ఆమెను బయటకు లాక్కొచ్చాయ్! భర్త అనురాగాన్ని మరువలేకుండా వుంది! తన సంతానాన్ని చూసుకోవాలని తహతహలాడ్తోంది. కానీ భర్తను చేరాలంటే భయం! బహుశః ఆమెను ఎవరో భర్తనుండి వేరు చేసారు! ఆమె పేరు రేణుకా దేవి! తన భర్త గురించి తెల్సుకోవాలని ప్రయత్నించాం! వివరాలు ఎందుచేతనో చెప్పలేదు! కొన్ని రోజులు గడిచాక నెమ్మదిగా అడిగితే చెబుతుంది."

తృప్తిగా శ్వాస వదిలారు శ్రీపతిగారు.

సిస్టర్ని వెంటబెట్టుకొని వచ్చింది రేణు.

"సిస్టర్! దేవిని ఈపూట డిస్చార్జి చేస్తున్నాం!" చెప్పారు డాక్టరుగారు.

"వద్దు డాక్టర్! ఇక్కడనే వుంటా! ఇక్కడ పిల్లల్తో కాలక్షేపం అవుతోంది! నన్ను బయటకు పంపకండి ప్లీజ్!" చేతులు జోడించి ప్రాధేయపడింది రేణు.

ఆమె మునుపటి పరిస్థితికి జారుకొంటుందేమో నన్న భయం వేసింది శ్రీపతిగారికి.

"నువ్ బయటకు పోతున్నట్టు ఎందుకు బయపడుతున్నావమ్మా! నాతో మనింటికి తీసుకొని వెళ్తా! మనింట్లోనూ చిన్నపిల్లలున్నారు. ఇద్దరు పిల్లల్తో మా చిన్నమ్మాయి సరోజిని పురిటికి వచ్చింది. నీకు మంచి కాలక్షేపం! నిన్ను తీసుకురమ్మని మీ పిన్ని పంపిందమ్మా! పిల్లల్ని చూసుకొంటూ మీ పిన్నిగారికి సహాయంగా వుందువుగాని! రామ్మా! ఇంటికి పోదాం!"

లాలించారు శ్రీపతిగారు.

"ఇప్పుడు నీకే అనారోగ్యమూ లేదమ్మా! వారానికోసారి నేనే మీ యింటికి వచ్చి చూస్తూ వుంటా!"

హామీ యిచ్చారు డాక్టరుగారు.

అయిష్టంగానే శ్రీపతిగారితో బయలుదేరింది రేణు.

శ్రీపతిగారి మనవల్తోనూ, వారి అమ్మాయి సరోజినితోనూ మంచి కాలక్షేపం అవుతోంది రేణుకి. సరోజనికి పురుడొచ్చింది. కొడుకు పుట్టాడు. బారసాలకు ఏర్పాట్లు ఘనంగా జరిగాయ్.

బారసాలకు తెచ్చిన సామన్ల పొట్లాలు విప్పుతోంది శ్రీపతిగారి భార్య రాజేశ్వరి. ఒకపొట్లానికి పాక్‌చేసిన పాత యిండియన్ ఎక్స్‌ప్రెస్ పేపరు విప్పుతూ దానిలో వున్న ఫోటో చూసి నిర్ఘాంత పోయింది. ఎదురుగా వున్న దేవిని పరీక్షగా చూసింది. ఆమె ఫోటోయే అది. సందేహంలేదు! పేపరు తీసుకొని వెళ్లి భర్తకు చూపింది. ఫోటోనీ, దానిక్రింద వున్న ప్రకటనని చదివారు శ్రీపతిగారు. ఆనందంతో ఆయినకు కళ్లు మెరిసాయ్!

"ఈ విషయం ఎవరికీ చెప్పకు! రేణుక్కూడా!" భార్యను హెచ్చరించారు. పేపర్ని మడిచి డ్రాయరులో పెట్టి ఆలోచనలో పడ్డారు.

★ ★ ★ ★

మధ్యాహ్నం పన్నెండు గంటలైంది. రమకి నిద్రతేలిపోయింది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. మనవడ్ని పక్కలో పెట్టుకొని నిద్రపోతోంది తల్లి. రమకి ఏమీ తోచలేదు. మేడమీదకి అన్నయ్య గదిలోకి వెళ్లింది. గదిలో నాలుగువైపులా రేణు ఫొటోలే! సోఫాలో కూర్చొని మాగజైన్ తిరగేస్తోంది. పోస్టుమేన్ వచ్చేవేళ. భర్తనుండి లెటరు రావాలి! మేడమీదనుండి పోస్టుమేన్ రాక దూరంనుండే కన్పిస్తుంది. కిటికీలోంచి వీధిలోకి రెండుసార్లు చూసింది. ఎండ ఎక్కువగా వుండటంవల్ల వీధి నిర్మాష్యంగా వుంది.

స్కూటర్ చప్పుడు విని చివాల్న లేచింది. కిటికీలోంచి కిందకి చూసింది. ఆ సమయంలో అన్నయ్య రావడం ఆశ్చర్యంగా తోచింది. మేడదిగి అన్నయ్య కెదురెళ్లింది.

రఘు హడావిడిగా మేడ మెట్లెక్కుతూ చెల్లెల్ని పిల్చాడు. అన్నయ్య ఆనందంగా వుండటం చూసి చాలాకాలం అయింది. ఆశ్చర్యంగా అతని వైపు చూసింది.

"కూర్చో!" అన్నాడు.

సోఫాలో కూర్చుంది రమ. ఆమె పక్కనే కూర్చున్నాడు. జేబులోంచి కవరు తీసి అందించాడు.

కవరుపై పంపినవారి అడ్రసు చూసింది రమ. అచ్చువేసి వుంది. యామిజాల శ్రీపతిరావు. ఇంజనీర్స్ అండ్ కంట్రాక్టర్స్ నింపురా ఖరగ్‌పూర్" అని వుంది. ఫోన్ నెంబరు కూడా వుంది.

'ఈ శ్రీపతిగారెవరన్నయ్యా?" అడిగింది.

"లోపలి వుత్తరం చదువ్!" అన్నాడు ఆనందంతో తబ్బిబ్బవుతూ రఘు.

కవరులో వున్న కాగితాన్ని బయటకుతీసి చదవనారంభించింది రమ.

చిరంజీవి రఘునాధ్‌కి,

నేనెవరో తెలియక పోవడంతో యిలా సంబోధిస్తూ రాస్తున్నందుకు ఆశ్చర్యంగా వుందికదూ!



# నిశ్శబ్ద సంగీతం

అనుదినమూ – కాదు! అనుక్షణమూ భర్తనీ, సంతానాన్నీ తలచుకొంటూ పరితపిస్తూ, తనవారిని చేరాలని వున్నా చేరుకోలేక మమకారాన్ని చంపుకొని ఈ లోకాన్ని విడిచిపోయే సాహసం చేయలేక జీవచ్ఛవంలా బ్రతుకు వెళ్ళమారుస్తున్న నీ అర్ధాంగి రేణుకాదేవి మా యింట్లో క్షేమంగా వుంది! అటువంటి యువతిని భార్యగా పొందిన నీవు అదృష్టవంతుడవు! వెంటనే వచ్చి ఆమెకు నీ దర్శన భాగ్యాన్ని కల్గిస్తావని ఆశిస్తూ ఈ లెటరు రాస్తున్నా! వచ్చేటప్పుడు మి సంతానాన్ని కూడా తీసుకొని వస్తే మాకూ సంతోషంగా వుంటుంది

ఇట్లు శ్రీపతిరావు.

చెల్లెలు ఉత్తరం చదువుతుంటే ఆమె ముఖ కవళికలను గమనిస్తూ వుండిపోయాడు రఘు. ఆమె మొహం విప్పారింది. సంతోషంతో సతమతమౌతూ "అన్నయ్యా!' అంది.

"రమా!"

ఆ యిరువురి హృదయం స్పందించింది. ఆనందబాష్పాలు కురిపించారు. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా దొర్లాయ్

"ఒక్క నిమిషం కూడా ఆలస్యం చేయకన్నయ్యా! అర్జంటుగా వెళ్ళు!' తొందర చేసింది

"లైట్నింగ్ కాల్ బుక్‌చేసి మాట్లాడా! క్షేమంగా వుందని శ్రీపతిగారు చెప్పారు."

చెప్పాడు రఘు.

"ఒదినని చూసి చాలాకాలం అయిందన్నయ్యా! చచ్చిపోయిందేమోనని భయపడ్డానన్నయ్యా!"

ఆమె మాటలు తడబడ్డాయ్ కంటనుండి నీరు జలజలా కారింది

కన్నీరు తుడుచుకుంటూ–

"ఎవరికీ చెప్పకుండా వెళ్ళన్నయ్యా! అమ్మకి కూడా యిప్పుడు చెప్పొద్దు!" అంది.

"మరి బాబుని తీసుకెళ్ళడం ఎలా?" సందిగ్ధంలో పడ్డారిద్దరూ. రమకి ఆలోచన తట్టింది.

"రాజమండ్రినుంచి ట్రంకాల్ వచ్చిందనీ మి అత్తయ్యగారికి ఒంట్లో బాగులేదనీ మనవణ్ణి చూడాలని వుందంటున్నారనీ, కిషోర్‌ని తీసుకొని వెళ్ళి చూపించి వస్తాననీ చెప్పు!" సలహా యిచ్చింది.

చెల్లెలు సలహా నచ్చింది రఘుకి.

"ఒకే! థేంక్యూ!" అన్నాడు హుషారుగా.

అన్నయ్య హుషారుగా వుండటం చూసి చాలాకాలం అయింది! ఆ ఆనందంలో తాను పాలు పంచుకొంది. కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయ్.

"కానీ ఒక్క విషయం మర్చిపోయాం!" అన్నాడు.

"తీరా మి ఒదిన్ని తీసుకొచ్చాక అమ్మ ఏమంటుందో!" అనుమానాన్ని వ్యక్తం చేసాడు.

"అవునన్నయ్యా! ఆ సంగతి ఆలోచించనేలేదు! అమ్మ ఏమంటుందో!" అనుమానాన్ని తెల్పుతూ ఆలోచించింది. చెల్లెలువైపు చూస్తూ వుండిపోయాడు రఘు.

"అమ్మ అంగికరించకపోడం అనేది ఉండదన్నయ్యా! కోడలు రాకకోసం అనుక్షణం నిరిక్షిస్తోంది! అయితే ఈ విషయం ముందుగానే చెప్పి ఒదిన్ని తీసుకురావడమా లేక ఆమె వచ్చాక వివరంగా చెప్పడమా అని ఆలోచిస్తున్నా!"

ఇద్దరూ ఆలోచిస్తూ కొన్ని క్షణాలు గడిపారు

"ఇలాంటి పరిస్థితిలోనే నీ స్నేహితుడొకడు పడ్డాడని చెప్పావ్! అతని పేరు జానకి రామం కదూ?" అడిగింది రమ.

"అవును! అతని అవసరం ఏముంది?" ఆమె ప్రశ్న అర్ధంగాక అడిగాడు

"చాలా వుంది!"

"అతనేవిధంగా సాయపడగలడంటావ్?"

" అతనితో చాలా పనుందన్నయ్యా! ఆయన టౌనులోనే వుంటున్నారా?"

"ఆఁ సీతాఫల్ మండిలో వుంటున్నాడు!"

"నీబెస్ట్ ఫ్రండేకదూ! నీ సంగతి అతనికి తెల్సా?"

"నా విషయాలన్నీ తెల్సిన మూడో వ్యక్తి అతనొక్కడే రమా! నా పరిస్థితికి చాలా బాధపడుతున్నాడు. అతను యిచ్చిన ధైర్యంతోనే రోజులు గడుపుకొంటూ వస్తున్నా! నాకోసం ఏం చెయ్యమన్నా చేస్తాడు!" చెప్పాడు.

"నీ వయస్సేనా? పిల్లలున్నారా?"

"నా వయసే! మూడేళ్ళబ్బాయి వున్నాడు!"

"అయితే అతనింటి అడ్రసియ్యన్నయ్యా, నేవెళ్ళి ఓ సారి మాట్లాడాలి!"

అడ్రసు చెప్పాడు రఘు. రమ కాగితంమీద రాసుకుంది.

ఇద్దరూ మేడదిగి కల్సి తల్లి గదిలోకి వెళ్లారు. తల్లి తెలివిగానే వుంది. మనవణ్ని జోకొడ్తోంది. తల్లితో అత్తగారి విషయం చెప్పాడు రఘు.

"వెంటనే వెళ్ళి మనవణ్ణి చూపించుబాబూ! కూతురుకోసం బెంగపెట్టుకొని సత్యవతి మంచం పట్టింది కాబోలు!" సానుభూతి వ్యక్తం చేసారు అనసూయమ్మ.

కొడుకుతో మర్నాడుదయమే ఖర్గపూర్‌కి ప్రయాణం అయాడు రఘు. అన్నయ్యతో స్టేషన్‌కి వెళ్ళింది రమ. ట్రైన్ బయలుదేరబోతుండగా అన్నయ్యతో మరోసారి చెప్పింది–

"ఒదిన్ని చూసిన వెంటనే ఒక టెలిగ్రామూ, బయలుదేరే ముందు ఏ ట్రైన్‌లో వచ్చేది మరొకటి పంపు! ఒదిన్ని చూసిన ఆనందంలో మర్చిపోకు!"

జవాబుగా నవ్వు మొహంతో తలూపాడు రఘు. ట్రైన్ బయలుదేరింది స్టేషన్నుంచి తిన్నగా సీతాఫల్ మండిలో వున్న జానకిరాం గారింటికి వెళ్ళింది రమ.

(ఇంకా వుంది)






# గెలవండి! రూ. 20,000/-ల విలువైన బహుమతులు!




## కలువబాల చందాదారులకు లక్కీడిప్:
## ఆగస్టు 1 నుండి నవంబరు 1 వరకు.



మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు

రు. 60లు సంవత్సర చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది. అదిగాక మీరి క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు.

"చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది.

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా 'కలువబాల'కు ఏడాది 'చందాదారులుగా' చేరడమే! కాకపోతే మీ 'చందా' సైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి 'కలువబాల' నుంచి ఒక 'చిరుకానుక' కాలక్రమంతో అందుతుంది.

"లక్కీడిప్" **1-11-1986** లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.

కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా:

**కలువబాల,**
**కేరాఫ్: ఆంధ్రపత్రిక,**
**గాంధీనగరం, విజయవాడ-3.**

---- కత్తిరించాలి ----



నిజమయితే ✓
కాకపోతే ×
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. (   )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. (   )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక (   )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ (   )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు: ..............................

..............................

చిరునామా: ..............................

..............................

..............................

ఎమ్. ఓ. పంపిన తేది ..............................

లేదా

డి. డి. జత చేయడమైనది.

దీపావళి కథల పోటీలో రు.700/- బహుమతి పొందిన కథ

# బరువు-బాధ్యత

రైల్లో కూర్చున్న శివరామయ్య కెంతో తృప్తిగా వుంది.

ఈ వ్యవహారం యింత సత్వరంగానూ, సంతృప్తిగానూ ముగుస్తుందన్న ఆశ అంతగా లేకపోయినా వారం రోజుల నాడీ వూరు వచ్చాడు.

అల్లుడు చేస్తున్న దుర్మార్గాన్ని అరికట్టాలని వచ్చాడు.





రెండేళ్ళ నుంచి కూతురు లక్ష్మి పడుతున్న బాధలకు విమోచన కల్గించాలనే నిశ్చయించాడు. ఈ

వ్యవహారం తేల్చుకోవాల్సిందే.... అంతగా అయితే నా
కుంటూ బ్రతుకుతుంది." అన్న దృఢ సంకల్పంతో నే

పంచనే యేదో వుద్యోగం వేసు
వచ్చాడు.

లక్ష్మి కాపురంలో యేవో కలతలు. శివరామయ్య భార్య నాగరత్నమ్మ రెండు మూడు తడవలు వెళ్ళి వచ్చింది. పరిస్థితులు చెయ్యిజారి పోవచ్చునన్నది తన అంచనా అని చెప్పింది. ఇక్కడ కొచ్చాక తెల్సింది– పరిస్థితులు పతాకస్థాయి చేరటానికి ఆమె బాధ్యత కూడా చాలా వుందని.... ఏమైనా వ్యవహారం సవ్యంగానే ముగిసింది.



## బరువు - బాధ్యత

కూతురు, అల్లుడు కిటికీ ప్రక్కగా ప్లాట్‌ఫారం మీద నిలబడి వున్నారు. లక్ష్మి కళ్లల్లో ఆనందం కనిపిస్తోంది. ప్రేమగా కూతురి తలమీద చేయివుంచాడు శివరామయ్య. రైలు కదిలింది. . .....

రైలు వేగం హెచ్చింది. నాలుగైదు గంటల్లో తన వూరు చేరుకోవచ్చు. కళ్లు మూతలు పడుతున్నయ్ శివరామయ్యకు. సంచి ప్రక్కనే పెట్టుకుని వుత్తరీయం తీసి దానిమీద వుంచాడు. చెయ్యి మీద తల వాల్చి బరువుగావాలుతున్న కనురెప్పల్ని తెరిచే ప్రయత్నం చెయ్యకుండా కూర్చున్నాడు.... రైలు లయబద్ధంగా నడుస్తోంది.

ఏదో బ్రిడ్జి మీదకు వచ్చినట్లుంది రైలు. రైలు చేసే శబ్దంలో కొంచెం మార్పొచ్చింది. అది చేసే సవ్వడి కూడా హెచ్చింది. కిటికీలోంచి క్రిందకు చూశాడు.... ఏదో నది... ఇసుక తిన్నెలు కనుపిస్తున్నయ్.. అక్కడక్కడ నీటిపాయలు ... నీరు ప్రశాంతంగా వుంది. త్వరగా కళ్లజోడు పెట్టుకుని పది పైసల నాణెం తీసి క్రిందకు విసిరాడు... నాణెం నీటిలోనే పడిందా? ఇసుక మీదనా?? నీటిలోనే పడిందన్న నమ్మకం కల్గింది శివరామయ్యకు. అవును ... తనిప్పుడు పనులు చాలా జాగ్రత్తగా చేస్తున్నాడు. ఇప్పుడే ననేమిటి? ఎప్పుడూ జాగ్రత్తగానే చేస్తాడు.. ఎప్పుడూనా?? ... బ్రిడ్జిని దాటింది రైలు. చిన్న చిన్న శబ్దాలతో లయబద్ధంగా నడుస్తోంది రైలు. కళ్లు మూతలు పడుతున్నయ్ శివరామయ్యకు....

"మంచే జరిగింది... మంచి జరిగింది
మంచే జరిగింది ... మంచి జర్గింది" – అంటూ నడుస్తోంది రైలు.

"అంతలో వుంది.... అట్లా వుంటుంది.
అంతలో వుంది.... అట్లా వుంటుంది" – అంటోంది రైలు. మగత నిద్రలోంచి వులిక్కి పడి లేచాడు శివరామయ్య.

"ఇంట్లో శాంత ... ఏట్లో శాంత
ఇంట్లో శాంత .... ఏట్లో శాంత" – ఆడుకుంటున్న పిల్లల మాదిరి పాడుతోంది రైలు.

విద్యుద్ఘాతం తగిలిన వాడిలా జాగృత స్థితిలోకి వచ్చాడు శివరామయ్య. మగత నిద్ర మాయమైంది. రైలు వేగంగా పరుగెత్తుతోంది. లయబద్ధంగా పాడుతోంది. గడియారం వంక చూశాడు. మరో మూడు గంటల్లో యింటికి వెడతాడు. తప్పదు. రైలు చేరవలసిన టైము కన్నా ముందే చేరేటట్లుంది.

"శాంత ముఖం చూడటం యెట్లా?"

"ఇక్కడ జరిగినదంతా విని శాంత కళ్లు వేసే ప్రశ్నలకు యెట్లా సమాధానం చెప్పటం?"

రైలు చేసే శబ్దాలు కావివి. శివరామయ్య మనస్సులోకి వస్తున్న ప్రశ్నలు. వీటిని ఆప లేకుండా వున్నాడు. ఒక సెకను ఆపగలిగితే రైలు వేస్తోంది లక్ష ప్రశ్నలు; చేస్తోంది క్రొత్త క్రొత్త వ్యాఖ్యలు.

★ ★ ★ ★

'మార్చి 15 లగ్నం బాగుంది. మా అందరికీ వీలు. అదే నిర్ణయిద్దాం' అన్నాడు పెండ్లి కొడుకు తండ్రి.

పెళ్లి చూపుల తతంగాలయిన పది రోజులకు మధ్యవర్తితో కలసి మళ్లీ వచ్చాడు పిల్లవాడి తండ్రి.

'మీరే లగ్నం నిర్ణయిస్తే దానికే మేం సిద్ధమవుతాం' అంది లోపలగా కూర్చున్న అనంతమ్మగారు. ఆమె పెండ్లికూతురు తల్లి.

'మార్చి కంటే మే నెలలో అయితే మా కందరకూ వీలు. అప్పుడయితే నాకూ శలవలు దొరుకుతయ్. అదీగాక మార్చిలో పిల్లలకు పరీక్షలు కూడాను. అన్నాడు శివరాం. అతను అనంతమ్మ కుమారుడు.

'నాయనా శివా! ఒక తడవ లోపలకు రా' అంది అనంతమ్మగారు. లోపలకు నడిచాడు శివరాం.

'మనం అట్లా అనకూడదు. వాళ్లు యెప్పుడు లగ్నం పెట్టమంటే అప్పుడే చెయ్యాలి. అదీగాక విదేశంలో వున్న వాళ్ల పెద్దబ్బాయ్ – అదే... పెండ్లి కొడుకు అన్నగారు – మార్చిలో వస్తాట్ట... అందువల్ల....' అర్థిస్తున్నట్లు అర్థోక్తిలో ఆపింది అనంతమ్మగారు.

'ఏఁవిటమ్మా యిది? అన్నీ వాళ్లు చెప్పినట్లే చెయ్యాలా? మన వీలు కూడా చూసుకోవద్దూ? ఇప్పటికే యీ సంబంధం విషయంలో మూడు నాలుగు తడవలు శలవు పెట్టి వచ్చాను. మళ్లీ నాకు శలవ దొరకద్దూ? మే నెల్లో అయితే స్కూళ్లకు శలవలు కూడాను. నేను యెలాగో శలవు శాంక్షన్ చేయించుకున్నా, మార్చిలో ప్రసాద్‌కు పరీక్షలు కూడాను' అన్నాడు కోపంగా.

'ఏఁవయినా వాళ్లన్న దానికి మనం వీలు చేసుకోవాలి.. తప్పదు మరి' అంది తల్లి.

నసుగుతూనే వరండాలోకి వెళ్లాడు శివరాం.

'పిల్లలకేవో . పరీక్షలన్నారు, యేం చదువు తున్నారు?' అన్నాడు సుబ్బరాజుగారు. ఆయన పెండ్లికొడుకు తండ్రి.

'అబ్బాయికే పరీక్షలు. అమ్మాయినింకా స్కూల్లో వెయ్యలేదు. కాన్వెంటు స్కూళ్లు కదా... యేవో పరీక్షలు ప్రతినెలా.'

'ఏ క్లాసులో వున్నాడు కుర్రాడు?'

'అప్పర్ నర్సరీ'

'ఓహ్! అదా సంగతి?! ఏ పదో తరగతేమో పబ్లిక్ పరీక్షలనుకున్నాను అని ఫెళ్లున నవ్వాడు సుబ్బరాజుగారు.

'అయితే అక్కగారూ! మార్చి 15 లగ్నానికి సిద్ధంకండి' అని లేచాడు.

శివరాం గుర్రుగా ఆయన వంక చూస్తూ నిలబడ్డాడు.

తర్వాత అతన్ని అనునయించేందుకు చాలా సేపు పట్టింది తల్లీకూతుళ్లకు.

ప్రసాద్ యిప్పుడు క్లాసులో రెండు మూడు రేంకుల్లో వుంటున్నాడు. మార్చి నెల పరీక్షల్లోనూ, సంవత్సరాంతం పరీక్షల్లోనూ బాగా రాస్తే క్లాసులో ఫస్టు రావచ్చు. ఈ మార్చి లగ్నంతో వాడి చదువేమవుతుందో యేఁవిటో' అంటూ గునుస్తూనే వున్నాడు శివరాం.

'ఎట్లాగో వీలు చేసుకోండి నాయనా.... దాన్నొ యింటిదాన్ని చేస్తే, తర్వాత దాని బరువు మీకుండదు' అంది అనంతమ్మగారు.

ఇదంతా శాంత వివాహానికి ముందు – ఇప్పటికి దాదాపు పాతికేళ్ల నాటి మాట.

... ఏళ్లు గడిచాయ్. ఇప్పటికి మూడేళ్ల క్రితం – శివరామయ్యకు ఆఫీసులో పని వత్తిడిగా వుంది.

లక్ష్మి వివాహం నిశ్చయమైంది. లగ్నం దగ్గర్లో కొచ్చింది – పట్టుమని పది రోజులు కూడా లేదు. వారం రోజుల క్రితమే శలవు తీసుకుందామనుకున్నాడు. "ఇప్పటి నుంచే యెందుకు?!" అన్నాడు పై వుద్యోగి.

'ప్రసాద్‌ను వెంటనే రమ్మని రాయండి' అంది నాగరత్నమ్మ వక రోజున. అప్రయత్నంగా శాంతమ్మ వంక చూశాడు శివరామయ్య. ఆమె కళ్ళు అతన్నే చూస్తున్నయ్. ప్రక్క చూపులు చూస్తూ –

'చూద్దాంలే' అన్నాడు.

పది రోజుల క్రితం వ్రాసిన వుత్తరానికి ప్రసాదిచ్చిన జవాబు తన జేబులోనే వుంది. లగ్నం వేళ్ళికి రాగలనని వ్రాశాడు. కోడలు వచ్చేదీ లేనిదీ తెలియజెయ్యలేదు. అయినా ఆవిడ యే కార్యానికి వచ్చింది గనక?

'నేను రేపట్నుంచీ శలవు పెడతానులే అన్నయ్యా! ఇంటి దగ్గర పనులు మేం చూసుకుంటాం. ఆఫీసు అయ్యాక బయట పనులు నువ్వు చూసుకుందువు గాని ... అధైర్యపడకు' అంది శాంతమ్మ.

ఇరవయ్యేళ్ళ నాడు పుట్టింటికి తిరిగి వచ్చిన శాంత. ఆమెకు తను అండగా వుంటాడని ఆశించింది తల్లి. కన్ను మూసే ముందు మరీ మరీ చెప్పింది. తన పొట్ట తను పోసుకుంటూ ఆమే శివరామయ్యకు అవసరాల్లో అండగా నిలబడుతోంది యిప్పుడు.

తలవంచుకునే బయటకు నడిచాడు శివరామయ్య. దాదాపు ఆఫీసరు కాళ్ళ మీద పడినంత జేసి యెలాగో శలవు సంపాదించాడు శివరామయ్య. ఆ మధ్యాహ్నమే పట్టు చీరెలు కొనేందుకు బజారుకు బయల్దేరారు శివరామయ్య దంపతులు.

'నేనూ వస్తాను నాన్నా! నా చీరెలు నేనే సెలెక్టు చేసుకోవాలి' అంది లక్ష్మి.

'ఆఁ... అలాగే... నువ్వు లేకుండా యెట్లా? నీ చీరెలే కాదు ... పెళ్ళికొడుకు సూటు గుడ్డ కూడా నువ్వే సెలెక్టు చెయ్యాలి. మేం తెస్తే బాగా లేవని మొగుడూ – పెళ్ళాలు యేకం అయి మమ్మల్ని తిడతారు' నవ్వుతూ అన్నాడు.

'ఫో నాన్నా! అట్లా అంటే నేను బజారుకు రానే రాను' అంది లక్ష్మి చెప్పులు వేసుకుంటూ.

ముగ్గురూ బజారుకు బయల్దేరారు – యిద్దరు ముందూ, వకళ్ళు వెనగ్గా నడుస్తూ. ముందున్నది తండ్రీకూతుళ్ళు.

శాంతమ్మ సున్ని విసుర్తోంది... ఆమె వివాహానికీ చీరెలకు బయల్దేరారు శివరాం దంపతులు. తనని రమ్మని పిలుస్తారేమోనని చూసింది, యెవ్వరూ పిలవలేదు. చీరెలు తెచ్చాక కూడా తనకు కొన్నవి నచ్చినయ్యా?' అని కూడా అడగలేదు అన్నా వదినలు.

'ఈ చీరె కట్టుకుని కన్యధారకు మీ వదిన పీటల మీద కూర్చుంటే పట్టు చీరెతో బాటు పెళ్ళి పందిరి కూడా ఫెళఫెళలాడి పోతుంది అంటూ భార్య మీద ఛలోక్తులు విసిరాడే తప్ప శాంతను యేమీ అడగలేదు శివరాం.

'మీ వదినకీ చీరె బాగుంటుంది కదు శాంతా?' అన్నాడు పైగా.

శాంత మీద ప్రేమ లేదని కాదు. అతని పరిస్థితు లేమిటో?! శాంతియుత సహజీవనానికి అతని విధానం అది కాబోలు. అంతా సవ్యంగా గడిచిపోవాలనే ప్రయత్నం కావచ్చు....

కళ్ళనీళ్ళు తుడుచుకుంది శాంతమ్మ. 'ఛ... పెళ్ళింట్లో యీ కన్నీళ్ళేవిటి' అనుకుంది. 'తిరగలి'కి దగ్గిరగా లాక్కుంది పళ్ళాన్ని.

"నేనిప్పుడు చెప్పేది నీకర్థం గాకపోతే యేదో వక రోజున వాటి అర్థం నీకు విపులంగా వివరణ లేకుండానే తెలుస్తుంది. అప్పటికి చేతులు కాలకపోతే మన అదృష్టమే. ముఖ్యంగా నీకు అదృష్టం అనాలి" – 'ఆయన' మాటలు యీ పదేళ్ళుగా పదేపదే గుర్తు కొస్తున్నయ్.




ఆయనెక్కడో యిప్పుడు?

"మీ అన్నయ్యలు వాళ్ళ పిల్లలకు కల్పించే సౌకర్యాలు చూసి, అల్లుళ్ళకు చేసే మర్యాదలు గురించి విని నువ్వు పొంగిపోతే నేనభ్యంతరం చెప్పను. కానీ అందువల్ల నేను వాళ్ళని గౌరవించాలి అంటే నాకు చాలా అభ్యంతరాలున్నయ్. ఈ విషయంలో స్వార్థాన్ని కొనుక్కునయినా నిలవ జేసుకుంటాను నేను" – సిగరెట్టు పొగ వదుల్తూ 'ఆయన' అనే మాటలు.

'మా వాళ్ళని తిట్టటం అంటే మహా యిష్టం' అంటూ తను.

"సిల్లీ... తిట్టటానికి కొంచెం సాన్నిహిత్యం వుండాలి. ఆ రోడ్డు మీదో శాల్తీ వెడుతోంది. తిడతానా ఆ వ్యక్తిని? ప్రేమ, ద్వేషం కూడా సన్నిహితుల మధ్యే సాధ్యం. మీ వాళ్ళ మొత్తం సంఖ్య యెంతో, వాళ్ళ పూర్తి పేర్లేవిటో కూడా నాకు తెలియవ్. అందు కవకాశాలు కూడా కల్పించలేదు 'మీ' వాళ్ళని నీకూ తెల్సు... అందువల్ల మీ వాళ్ళని తిడుతున్నాననటం అబద్ధం... అభాండం."

కాపురాని కొచ్చి యేడాది దాటిపోయినా 'మీ వాళ్ళు'. 'మా వాళ్ళు' అన్న స్థాయి నుంచి పైకి వెళ్ళలేదు యిద్దరూ... ఆయనెక్కడో యిప్పుడు??...

'పోస్టు' అన్న కేక... గేటు మీద నుంచి వక కవరు వరండా ముందు పడింది. అడ్రసు చూసి టేబిల్ మీద పెట్టింది శాంతమ్మ. సున్ని విసరటం కావస్తోంది.

బజార్నుంచి తిరిగి వచ్చారు ముగ్గురూ. ఉత్తరం చదివి శివరామయ్య, అతని భార్య యేవో మంతనాలు చేస్తున్నారు.

'దానికి సుఖం లేదు' – తల మీద కొట్టుకుంటూ అంటున్న వదిన మాటలు రెండు మూడు తడవలు వినిపించినయ్.

'అయితే ఆ వుత్తరం స్వర్ణ దగ్గర్నుంచన్న మాట' అనుకుంది శాంతమ్మ. శివరామయ్య మొదటి కూతురు స్వర్ణ.

'పెళ్ళింకా పది రోజులు కూడా లేదు. ఈయన్ని బొట్టూ – కాటుక పెట్టి తీసుకు రావాలంటే దొరికిన శలవులో రెండ్రోజులు ఖర్చవుతుంది' అంటూ బయటకు వచ్చాడు శివరామయ్య.

'స్వర్ణ విషయమా అన్నయ్యా?' అంది శాంతమ్మ.

'ఆఁ... ఎవరన్నా వెళ్ళి తీసుకురాకపోతే తనురాట్ట. దానినీ పిల్లల్నీ కూడా పంపట్ట దొరగారు.'

'ఇక్కడ పనులవుతూనే వుంటయ్ గానీ, నువ్వెళ్ళి

వాళ్ళని తీసుకురా అన్నయ్యా. శుభకార్యానికి కూతురూ, అల్లుడూ రాకపోతే యెట్లా? స్వర్గం కూడా బాధ పడుతుంది. మనకీ సంతోషంగా వుండదు' అంది శాంతమ్మ.

ఆమె వంక చూశాడు శివరామయ్య. అప్రయత్నంగా కళ్ళు క్రిందకు దించాడు. 'తిరగలి' గిర్రున తిరుగుతోంది పిండిని బయటకు విసురుతోంది. శాంతమ్మ సున్ని విసరటం పూర్తవుతోంది... శివరామయ్య పెద్దకూతురు పుట్టింట్లో వూరికి బయల్దేరాడు అల్లుణ్ణి ఆహ్వానించేందుకు, వెంట బెట్టుకుని తీసుకు వచ్చేందుకు

శాంతమ్మ మనసులో యెన్నో ఆలోచనలు. అనేక విషయాల పట్ల కోపం? ఎవరి మీదో కష్టకాలప్రవాహంలో కొట్టుకుపోతున్న ఆమె ఆ కోపాన్ని మనుష్యుల మీద చూపించటం మాని వేసింది. కోపం చూపించే చనువున్న మనిషీ కనిపించటం లేదు ఆయన యెక్కడో యిప్పుడు?? కోపంగా 'తిరగలి'ని త్రిప్పుతోంది. అవును... ఈ అన్నయ్యే!'తను కాపరానికి వెళ్ళిన క్రొత్తలో శ్రావణ మాసపు నోములకు పుట్టింటికి వెళ్ళాల్సినప్పుడు యేం రాశాడు?' నిన్ను తీసుకు వచ్చేందుకు ప్రత్యేకంగా వకళ్ళు రావాలా? చదువుకున్నావ్... రైలు ప్రయాణం చెయ్యటం తెలియదూ' అని కదూ!! 'ఆయన'ది అంతకంటే మంకు పట్టు. అప్పుడే అన్నయ్య లందరినీ కప్పుపుచ్చేందుకు వీళ్ళని వెనక వేసుకుని వచ్చేది. ఇప్పుడు వీళ్ళు తమ పిల్లల విషయాల్లో యెట్లా ప్రవర్తిస్తున్నారు?! అందాకా యెందుకు? మరో తడవతను వంటరిగా ప్రయాణం చెయ్యాల్సి వస్తుందని వుత్తరం రాస్తే తన రెండో అన్నయ్య కూడా అట్లాగే రాశాడు. పైగా ఆర్నెల్లు తిరక్కుండానే తమ వూరు భార్యా పిల్లల్తో వస్తూ స్టేషన్‌కు రమ్మని వుత్తరం మీద వుత్తరం వ్రాయలేదూ?! 'ఆయన' జవాబివ్వకపోతే ఆందోళనగా టెలిగ్రాం కూడా యిచ్చాడు కదూ!!? 'ఏం వాళ్ళు స్టేషన్లో దిగి యింటికి రాలేరా?' అని

# బరువు – బాధ్యత

యిప్పుడు అనుకుంటోంది తను. అదే మాట 'ఆయన' అని –

'వాళ్ళ ప్రాణాలు నీ ప్రాణాల కంటే విలువైనవి కదా... ప్రయాణ సౌకర్యాలు వాళ్ళకు గానీ నీ కెందుకు' అంటే దెప్పి పొడుస్తున్నాడని తను పోట్లాడేది అప్పుడు. ఇప్పుడు తెల్సి వస్తోంది. కానీ.... ఏం లాభం? ....'తిరగలి'ని యెత్తి గోడ వారగా పెట్టింది శాంతమ్మ. 'తిరగలి' రాళ్ళు రెండూ పెద్ద పెద్ద సున్నాలుగా కనుపిస్తున్నయ్. తన జీవితం నిండా సున్నాలే. గత పదేళ్ళ నుంచీ ఆ రోజుల్లో 'ఆయన' అన్న మాటలు పదే పదే గుర్తు కొస్తున్నయ్. గుర్తు చేసే పరిస్థితులు తరచు యెదురవుతున్నయ్...

ఆలోచనలు ముసురుతున్నయ్ శాంతమ్మను.

"తల్లి తండ్రుల చేత ప్రేమగా చూడబడటం పిల్లల కనీస అవసరాల్లో ముఖ్యమైంది. అది చిన్నతనంలో లోపిస్తే ప్రపంచంలో అందరూ తనని అన్ని వేళలా ప్రేమగా చూడాలని ఆశించటం జరుగుతుంది. అసంతృప్తితో అందరూ తనని హింసిస్తున్నట్టు ఫీలవటమూ జరుగుతుంది. కట్టుకున్న వాడు కన్న పిల్లల్ని ప్రేమగా చూసినా అసూయతో వోర్చలేని పరిస్థితి కూడా వస్తుంది. నా భార్యగా నీకు భర్త చూపించ గలిగినంత అనురాగం చూపించ గలను. కానీ గతంలో నీవు పొందలేని దానిని కూడా భర్తీ చెయ్యమంటే కష్టం. ఆ లోటు పూడ్చుకోవాలనే ప్రయత్నంలో మరింత లోటుకు చోటు చూపించకు.... ఇంకో విషయం– నన్నూ నా కుక్కని కూడ ప్రేమించు అంటే కుదర్దు".... లోతుగా ఆలోచించే మనిషి "ఆయన". ఏవో పుస్తకాలలోంచి వాక్యాలు చెబుతున్నట్టు చెప్పేవాడు.

తన మనస్తత్వం పెళ్ళి రోజునే గ్రహించాట్ట "ఆయన." శాంత కారోజుల్లో "ఆయన" యేం చెప్పినా తననీ, తన వాళ్ళనీ యెద్దేవా చేస్తున్నట్లనిపించి తను వాదించేది మూర్ఖంగా. అరిచేది పిచ్చిగా. శాంతమ్మ కీనాడు ఆ మాటల్లోని నిజాలు తెలుస్తున్నయ్....

అవును.... తన మనస్తత్వం ఆయనకు పెళ్ళి రోజునే తెల్సిందిట. పెళ్ళి చూపుల నాడు తెల్సినా బాగుండి పోయేది అని కూడా అనేవాడు. ఇంతకూ పెళ్ళి రోజున–

అప్పగింతలు ముగిసినయ్. తను పెళ్ళి కొడుకుతో విడిది యింటికి బయల్దేరింది. సన్నాయి వాళ్ళు "పోయిరావమ్మ జానకి" అని వాయిస్తున్నారు. తను చూసిన కొన్ని పెళ్ళిళ్ళలోనూ, సినిమాల్లో చూసిన అన్ని పెళ్ళిళ్ళలోనూ ఆ సమయంలో తల్లితండ్రులు, తోబుట్టువులు బావురుమని యేడవటం కనిపించేది. తన విషయంలో కూడా అట్లా జరగాలని ఆశిస్తూ అతని ప్రక్కన నడుస్తూ చుట్టూ చూసింది శాంత. తన తోబుట్టువులు– ఆడా, మగా– తమ పిల్లల్ని నిద్రబుచ్చుతూ కూర్చున్నారు. తండ్రి తన కెలాగూ లేడు. పైగా తండ్రి చండశాసనుడిగా వుంటాడన్నది దగ్గరగా చూసిన కొన్ని కుటుంబాల ద్వారా తన కొచ్చిన అనుభవం. తల్లికోసం వెనక్కి చూసింది. దూరంగా వున్న దొడ్డి వైపున వున్నది తల్లి– పనివాళ్ళుతో తోమి పెట్టిన వంట పాత్రలు లెక్క చూసుకుంటోం దావిడ. విడిదికి చేరాక దిండులో తల దూర్చి తనివితీరా యేడ్చింది శాంత. తనకేదో లోపం జరిగింది. ఎప్పుడూ తనకు లోపం జరుగుతూనే వుంది. ఇతనైనా తనని వోదార్చుతా డనుకుంది. దూరంగా కుర్చీలో కూర్చున్న పెండ్లి కొడుకు ఆమెనే చూస్తున్నాడు. ఆమెను వోదార్చ లేదు. అతనూ సినిమాలు చూస్తాడు. కానీ వాటిలో మాదిరి చెయ్యడు. కాలక్షేపానికి పని కొచ్చే కథల్లో మాదిరి ప్రవర్తించటం అతనికి గిట్టదు. ఆమె, వంకే చూస్తూ కూర్చున్నాడు. జీవితానికి దగ్గరగా జీవించాలన్నది అతని సిద్ధాంతం.... శాంత యేడుస్తూనే వుంది.

పెండ్లి కొడుకు – "అతను"– "ఆయన" అయ్యాడు. చేసిన కొద్ది కాలంలోనూ కాపురంలో అన్నీ గొడవలే. గల్లంతులే. అప్పుడు శాంత యెడుస్తూనే వుండేదెప్పుడూ.... ఇప్పటికీ శాంతమ్మ యేడుస్తూనే వుంది అప్పుడప్పుడూ.... ఆయన?? ఆయనెక్కడో యిప్పుడు??

డబ్బా నిండా సున్ని యెత్తి వదిన కందించింది శాంతమ్మ. తన వాటాలోకి వెళ్ళి ముఖం కడుక్కొని నుదుట కుంకుమదిద్దుకుంది.

* * * *

శివరామయ్య రైలు శబ్దాలు వింటూనే వున్నాడు. ఇక వక గంటలో యింట్లో వుంటాడు. రైలేదో స్టేషన్లో ఆగింది. ప్లాట్‌ఫారమంతా రద్దీగా వుంది.... కూలీలు ట్రాలీని లాక్కుపోతున్నారు. చెక్క పెట్టి వకటి ట్రాలీ మీద నుంచి క్రింద పడింది. కూలీ దాన్ని ట్రాలీ వైపుకు "బర, బర" లాగుతున్నాడు. ఆ పెట్టిమీద– "సున్నితమైన












ఆలోచించి చూడండి ప్రతిసారి
ఒక మిక్సీలోని బ్లేడులు మార్చవలసినచో,
ఆ మిక్సీ పనికిరానిది-కదా?

ఆలోచించండి. మిక్సీని కొనేది మీరు మెకానిక్ అవటానికి కాదు, మీ పనులను సులభముగా చేసుకోటానికి అటువంటప్పుడు ప్రతిసారి మిక్సీలోని బ్లేడులు మార్చుకొని, దానికి చేతినిండా పనిముట్లతో కష్టపడి—ఇదంతా సులభమా? ఇటువంటి మిక్సీలు కాల, శ్రమ వృథా తగ్గించునని కాదుకదా? అందువలనే ధృఢమైన ఆరు బ్లేడులుకల బ్లేడులు అమర్చబడి ఉండు మీనుమిక్స్ ఎంతో శ్రేష్ఠమైనది.

ఆలోచించండి. ఎటువంటి వాతావరణమైనను అవలీలగా ఎదుర్కొను శక్తి మీనుమిక్స్ యొక్క మోటారుకు గలదు.

ఆలోచించండి. ఎంతటి కరెంటు మార్పులైనను, ఈ మోటారు యొక్క పని చేయు శక్తిని తగ్గించలేవు.

ఆలోచించండి. ఒక ½ లీటరు స్టీల్ జాడీని [లోపల అమర్చబడిన బ్లేడ్‌తో సహా] మీరు పైసా ఖర్చు లేకుండా తీసుకెళ్ళవచ్చు. అదిలోనే మీకు 150 రూపాయలు లాభం.

ఆలోచించండి. రెండు జాడీలలోను పర్మనెంటుగా అమర్చబడిన బ్లేడులు వలన మీకు ఎంతో హాయి. సుఖము తక్కువ శ్రమ.

ఆలోచించండి. దృఢముగాను, తక్కువ స్థలము ఆక్రమించుకొనే తయారీ వలన మీకు ఎంతో హాయి.

మరింక ఎన్నో విషయాలు గూర్చి ఆలోచించండి—

ISI వారి చేత చేయబడిన 27 కష్టతరమైన నాణ్యతా పరీక్షల దాటిని తట్టుకున్న మీనుమిక్స్.

ఏ ఆనుగులు లేని, ఒక సంవత్సరపు గ్యారంటీలో పాటు వచ్చు మీనుమిక్స్.

ఎప్పుడూ తయారుగా ఉండే సర్వీసింగ్ సెంటర్‌లలోపాటు వచ్చు మీనుమిక్స్.

మొట్టమొదట ISI గుర్తును గెల్చుకున్నది. మీనుమిక్స్ ఉన్నది, నిజము.

18 సంవత్సరముల క్రితము అమ్మిన మీనుమిక్స్ ఇంకా మంచి స్థితిలో ఉన్నది, ఉన్నది, నిజము.

మీనుమిక్స్‌ను మీకు తెచ్చే కంపెనీ, భారతదేశములోనే మొట్టమొదట ఎలక్ట్రానిక్ ఫుడ్ ప్రాసెసర్ తయారుచేయుటకు నైపుణ్యము కల్గినవారు.

మీ ఆలోచనలకు రెక్కలొస్తుందా? కాని చూడండి.

# Meenumix

*Meenumix —*
*— for those who think beyond the big names and namesakes.*

Meenu Equipments
P O. Box No. 6909 Coimbatore 641044

**Regional office/Service Centres : Bangalore Ph : 72765 ; Cochin Ph 351596 ; Hyderabad Ph : 67327 ; Madras Ph : 474691**
**ANDHRA : Authorised Stockists : HYDERABAD** . Instyle, 3-6-477/2, Himalatnagar (Ph : 61664) **VIJAYAWADA** : Sunil Engineering Company
Opp . Tarapet Goods Shed, Pandit Jawaharlal Nehru Road (Phone : 77357) **VISAKHAPATNAM** : Andhra Trunk Works 26-15-39, Main Road (Phone 63448)

# బరువు - బాధ్యత

సామాన్లు: జాగ్రత్తగా చేరవేయండి" అని పెద్ద అక్షరాలతో వ్రాశారు. ఆ పెట్టెను యెత్తి ట్రాలీ పైకి విసరాడు కూలీ.

కూర్చున్న బల్ల యిరుకుగా వుంది. శివరామయ్యకు. ఈ యెదుటి బల్ల మీద కూర్చున్న వ్యక్తెవరో గానీ, వక అట్ట పెట్టెని వళ్ళో పెట్టుకునే కూర్చుంటాడు. స్టేషన్లో రైలు ఆగంగానే దాన్ని తీసి శివరామయ్య ప్రక్కనున్న ఖాళీ జాగాలో వుంచుతున్నాడు. కాళ్ళూ, చేతులూ సాఫీగా పెట్టు కూర్చుని రైలు కదలంగానే మళ్ళీ పెట్టెను శివరామయ్య ప్రక్కనుంచి తీసి వళ్ళో పెట్టుకుని కూర్చుంటున్నాడు. ఆ మనిషి యీ పెట్టెలోకి యెక్కిందగ్గర్నుంచీ అట్లానే చేస్తున్నాడు. ఆ పెట్టెలో యేం తీసుకు వెడుతున్నాడో మహానుభావుడు?! ప్రాణప్రదంగా చూసుకుంటున్నాడు.... రైలు కూత వేసింది. ఎదుటి సీట్లోని వ్యక్తి "అట్టపెట్టె"ని తన వళ్ళోకి తీసుకూర్చున్నాడు. శివరామయ్య ప్రక్కకు జరిగి విశాలంగా కూర్చున్నాడు. ఇంతవరకూ యీ "అట్టపెట్టె" వ్యక్తిని అంతగా పట్టించుకోలేదు గానీ యిప్పుడు అతని మీద విపరీతంగా కోపం వస్తోంది. ఆ వ్యక్తి తనలోని లోపాన్నేదో యెత్తి చూపిస్తున్నాడు. మళ్ళీ మళ్ళీ "అట్టపెట్టె" యెత్తి మరీ చూపిస్తున్నాడు.

అల్లుడు యిప్పుడు, అప్పుడెప్పుడో ఆ"విడి చేసిన వాడు" (శాంత భర్తనలాగే పిలిచేవాడతని పరోక్షంలో)- యిద్దరూ వకే విధంగా ప్రవర్తించారు. ఒకే విధంగా ప్రవర్తించనిది తను. ఇప్పటి తన ప్రవర్తన అప్పటిదానికి పూర్తిగా విరుద్ధం.

అప్పుడు -

శాంత కాపురంలో గొడవలు తెల్సుకుని తేల్చుకునేందుకు వెళ్ళాడు తను. తల్లి పోరగా వెళ్ళాడు. ఆ"విడ చేసిన వాడు" ఆ సాయంత్రం వచ్చి తను వచ్చిన పని విని చాలా గొడవ చేశాడు. ఆ రాత్రి.... అన్నం వడ్డించి యిద్దర్నీ పిలిచింది శాంత. తనని పిలవకుండానే వెళ్ళి కూర్చుని తినటం మొదలుపెట్టాడు.

"ఛీ!.... మర్యాదహీనులు, విడి చేసిన రకం" అంటూ తనూ అరిచాడు. ఆ రాత్రికి స్నేహితుడి యింటికి వెళ్ళాడు. మర్రోజు ప్రొద్దున హోటల్నుంచి వచ్చేసరికి భార్యాభర్తల మధ్య రాజుకుంటోంది.

"వీడికి మర్యాద కావాల్ట.... ఈ వెధవ నుంచి నేను చాలా పొందాను కదూ!? చెంప పగలగొట్టి మర్యాద చేస్తాను" అంటున్నాడా మూర్ఖుడు. మరి కొంచెం రాద్ధాంతం జరిగాక-

"నేనింతవరకూ యేమోగానీ, యికనుంచీ విడిచేసిన మనిషినే.... పెళ్ళాన్ని విడిచేసిన మనిషిని" అన్నాడు వాడు.

తను- శాంత దిక్కులేనిది కాదన్నాడు. నాలుగిళ్ళు ముష్టెత్తుకున్నా యింతకన్నా సుఖంగా బ్రతుకు తుందన్నాడు. శాంతని తొందర జేసి ఆ ప్రొద్దునే తీసుకొచ్చేశాడు. కానీ.... శాంత వుద్దేశ్యం యేమిటో తెల్సుకునే ప్రయత్నం చేశాడా తను???

ఇప్పుడు-

వారం రోజుల నాడు లక్ష్మి యింటికి వచ్చాడు. అల్లుడు ప్రవర్తించిన తీరు?? మొదటి రెండు రోజులు తనని పిలవకుండానే వెళ్ళి భోజనం ముందు కూర్చునేవాడు అల్లుడు. భర్తకు వడ్డిస్తూ మధ్యలో వచ్చి "నువ్వూ రా నాన్నా!" అనేది కూతురు.

"ఆకలిగా లేదమ్మా!.... కాసిని మజ్జిగ యివ్వు" అని త్రాగి పడుకునేవాడు. లక్ష్మిపడే బాధ చూడలేక మూడో రోజున తనూ వెళ్ళి విస్తరి ముందు కూర్చున్నాడు. భోంచేస్తున్న వాడల్లా లేచి




"దీపసుందరి"
చిత్రం : కమల్

పోయాడు అల్లుడు. ఏం జరిగినా బాధపడేది కూతురే. అది చూడలేక అల్లుడు ఆఫీసుకు వెళ్ళాక భోం చేసేవాడు. "సత్రంవా నా యిల్లు" అన్నాడు అల్లుడు. అయినా తను స్నేహితుల యిళ్ళకు వెళ్ళలేదు. హోటళ్ళ వెంట పడలేదు. అల్లుడి ప్రవర్తనా, "అతని" ప్రవర్తనా వకటిగానే లేదూ?" ఎటు తిరిగి నిన్నా యివ్వాళేగా అల్లుడు తిన్నగా తనతో మాట్లాడింది" అనుకున్నాడు శివరామయ్య. ఎంత పరాభవం జరిగినా తొందర పడలేదు. తను సూచించే పరిష్కార మార్గాలు లక్ష్మికి ఆమోదంగా వున్నవా అని ఆమెతో సంప్రదించాడు. ఆ అవకాశం శాంతకు దొరికిందా?.... ఎందుకని??.... ఎందువల్ల??? అంతరాత్మ సమాధానం చెప్పబోయింది. శివరామయ్య దాని నోరు మూసి తనే సమాధానం చెప్పుకున్నాడు-

అప్పుడు.... ఉడుకు రక్తం

ఇప్పుడు.... కాగి చల్లారిన పాలు

అంతరాత్మ నవ్వింది. శివరామయ్య ముఖం "యింత" చేసుకున్నాడు. "అది అబద్ధం...." అంటూ అంతరాత్మ గొంతెత్తింది.

అప్పుడు.... "అన్న"వి

ఇప్పుడు.... "తండ్రి"వి

రైలు ఆగింది.... అయినా యింకా లయబద్ధంగా శబ్దాలే....

"అంతలో వుంది".... అందుకే జరిగింది మంచే"

రైలు పరిగెత్తటం లేదు. అయినా యీ శబ్దాలతో చెవులు చిల్లులు పడుతున్నయ్. లయబద్ధంగా వినిపిస్తున్న శబ్దాల్లోంచి పుట్టింది మరో శబ్దం-

అది .... ఇది

బరువు బాధ్యత

రైలు వెయ్యి బ్రిడ్జిలను వెంట వెంటనే దాటుతున్న మోత....

రైలు ఆగే వుంది.... అదేదో చిన్న స్టేషను. ఊరికి కొంచెం దూరంలో వుంది. దూరంగా లైట్లు కనిపిస్తున్నయ్. లైట్ల వైపు నుంచి మెల్లగా వినిపిస్తోంది పాట-

"అన్నయ్య సన్నిధి...." అంటూ.

రికార్డు అరిగి పోయినట్లుంది. ఉత్సాహంగా మొదలైన పాట "పెన్నిధి" అనే చోట కొచ్చేసరికి వుసూరు మంటూ, యేడుస్తూ ఆగిపోతోంది. దాన్నెవరో మళ్ళీ ముందు నుంచీ పెడుతున్నారు. అది యేడుస్తూ ఆగిపోతోంది మళ్ళీ....

ఈ, రైలు కదిలేట్టు లేదు. ఈ పాట యీ రైలు డ్రయివరో, గార్డో కోరిన పాట అయ్యుంటుంది.... లేదు.... ఇద్దరూ కోరిన పాటేమో కూడాను.... కాదు. ఈ రైల్లోని జనమంతా కోరిన పాట కాబోలు. గొలుసులు లాగి రైలుని కదల్నివ్వటం లేదా వీళ్ళు??. శివరామయ్యకు కోపం యెక్కువవుతోంది. ఈ పాట శబ్దంతో యీ రైలు ఛిన్నాభిన్నం కాక తప్పదు. అంతవరకూ యీ రైలు కదల్దు. ఆ తర్వాతింకేం కదుల్తుంది?? అదీ మంచిదే. కానీ యీ పాట?!? శివరామయ్య చెవులు గట్టిగా మూసుకున్నాడు.

ఎదుటి సీట్లో వ్యక్తి తాలుకు "అట్టపెట్టె" శివరామయ్య ప్రక్కనే వుంది. దానివంక చూస్తున్నాడు. "అట్టపెట్టె"ని తీసుకుని దాంతో గ్రామఫోను రికార్డు మీద కొట్టి రెంటినీ పగల గొట్టేద్దామన్న కోపం వస్తోంది శివరామయ్యకు. కానీ.... శివరామయ్య కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. చెవులు మరింత గట్టిగా మూసుకున్నాడు. కానీ "అట్టపెట్టె" విశ్వరూపం ధరిస్తోంది. పాట మరింత బిగ్గరగా వినిపిస్తోంది. రైలు శబ్దాలు లయబద్ధంగా వినిపిస్తున్నయ్.... రైలు ఆగే వుంది! కదల్లేదు. రైలు కదిలేట్టు లేదు....

అదేవేళ్టికి యింటి దగ్గిర శాంతమ్మ అంటోంది- "నువ్వు ఆందోళన చెందకొదినా! అన్నయ్య తొందర పడడులే" అని. □

## వ్యక్తిగతం



సియోల్‌లో జరిగిన 10వ ఆసియా క్రీడోత్సవాలలో భారత దేశానికి లభించిన అయిదు బంగారు పతకాలలో మూడవ స్వర్ణ పతకాన్ని అందుకున్న మల్లయుద్ధ వీరుడు కర్తార్ సింగ్ ధిల్లాన్ పంజాబ్ పోలీసు శాఖలో ఇన్‌స్పెక్టర్‌గా పని చేస్తున్నాడు. ఈయన పాకిస్తాన్‌కి చెందిన షహిద్‌ని వందకిలోల విభాగంలో జరిగిన ఫ్రీ స్టయిల్ కుస్తీ ఫైనల్స్‌లో ఎంతో నేర్పుతో వోడించి న్యాయనిర్ణేతల ప్రశంసలని అందుకున్నాడు. ఈయన తన 33వ జన్మ దినోత్సవ కానుకగా ముందుగానే ఈ బంగారు పతకాన్ని పొందారు.... □



లెనిన్‌గ్రాడ్‌లో జరిగిన ప్రపంచ చదరంగం పోటీలలో 24 సంవత్సరాల గారీ కాస్పరోవ్ తన ప్రత్యర్థి అయిన అనతోలీ కార్పోవ్ పై విజయాన్ని సాధించి టైటిల్‌ని నిలబెట్టు కున్నాడు. ఇటీవల జరిగిన ఈ రీ మ్యాచ్‌లో అవసరం అయిన 12 పాయింట్లని సాధించి కాస్పరోవ్ తిరిగి ప్రపంచ ఛాంపియన్ అయినాడు. ప్రపంచ చదరంగం పోటీలలో ఇప్పటి వరకూ 95 మాచ్‌లు ఆడిన ఘనత వీరిద్దరిదే. నూరేళ్ళ చరిత్ర కల ఈ పోటీలలో ఇంత వరకూ పదముగ్గురు మాత్రమే ఈ టైటిల్‌ని సాధించ గలిగ్గారు. అంతకు ముందు పదేళ్ల పాటు ప్రపంచ చదరంగం చక్రవర్తిగా ఉన్న కార్పోవ్‌ని 1985లో కాస్పరోవ్ వోడించి ప్రపంచ ఛాంపియన్ అయినాడు. రెండేళ్ళుగా వీరిద్దరి మధ్యా సాగిన పోరాటం ముగిసింది. కాస్పరోవ్ 1963లో రష్యాలోని బాకూ నగరంలో జన్మించాడు. తన తల్లిదండ్రుల వద్ద చిన్నప్పుడే చదరంగంలో పాఠాలని నేర్చుకున్నాడు. ఏడేళ్ల ప్రాయంలోనే బాకూలో జరిగిన పోటీలలో ఒకేసారి ఆరుగురు చదరంగం క్రీడాకారులని వోడించి ఆశ్చర్య పరిచాడు. 16వ ఏట ఇంటర్ నేషనల్ మాస్టర్, 17వ ఏట గ్రాండ్‌మాస్టర్, ప్రపంచ జూనియర్ చదరంగం టైటిల్‌ని సాధించాడు. 1981లో సోవియట్ యూనియన్ ఛాంపియన్. 1982లో చదరంగం ఆస్కార్ అవార్డు, "ప్లేయర్ ఆఫ్ ది ఇయర్" గౌరవాలని అందుకున్నాడు. 1983 ప్రముఖ చదరంగ క్రీడాకారులని వోడించి ప్రపంచ టైటిల్ కోసం పోటీ పడటానికి తగిన అర్హతని సంపాదించాడు. 1985లో కార్పోవ్‌ని వోడించి ప్రపంచ చదరంగ ఛాంపియన్ బిరుదుని అందుకున్నాడు. రీ మ్యాచ్‌లో కూడా కాస్పరోవ్ తన ప్రతిభని మరోసారి నిరూపించుకుని టైటిల్‌ని నిలబెట్టుకున్నాడు..... □

# వారఫలం

### 31-10-1986 శుక్రవారం నుండి 6-11-1986 గురువారం వరకు

★ **మేషం :** ఇటీవల మీరు ప్రారంభించిన వ్యాపారం దిగ్విజయంగా సాగిపోతుంది. ప్రతికూలంగా ఉన్నవారు అనుకూలురవుతారు. వ్యవహారమందు మీకే విజయం. రాజకీయంగా మేలు గాదని గ్రహించాలి. సమయానికి డబ్బు అందుతుంది. ఇంకేం కావాలి? స్త్రీలకు : అన్ని రంగాలలో అనుకూలమే.

★ **వృషభం :** ధనాదాయం, వృత్తి యందు పెంపు చెప్పక తప్పదు. ఉద్యోగంలో ఏదో అనుకూల మార్పు సంభవం. పరాయి వారిచేత చిక్కిన డబ్బు ఎలాగో చేజిక్కించుకొంటారు. కళారంగావకాశాలు అలాగే చిక్కుతాయి. స్త్రీలకు : ఉద్యోగమందు పెంపు. ఒకవేళ కొందరకు 'ప్రమోషన్' రావచ్చు.

★ **మిథునం :** ఇరుగు పొరుగు తగాదాలు రాకుండా చూచుకొండి. అనవసర వ్యవహారాలలో తప్పనిసరి జోక్యం ఉండవచ్చు. లావాదేవీలలో ఇబ్బంది జరుగవచ్చు. ఎలాగైనా సవరించుకొనాలనుకున్న వ్యవహారంలో ఇబ్బంది రావచ్చు. స్త్రీలకు : కావలసిన వారితో, చుట్టు ప్రక్కల వారితో తగాదాలు రానున్నవి. గ్రహించండి. అధిక వ్యయమూ ఉన్నది.

★ **కర్కాటకం :** మేలు జరుగవలసిన వ్యవహారాన కీడు సంభవించవచ్చు. అనుకొన్న పనులు జరుగకపోవచ్చు. అయినవారితో తగాదాలు రావచ్చు. అనవసరంగా డబ్బు ఖర్చు పెట్టవలసిన అగత్యం ఏర్పడవచ్చు. వృత్తి యందు పెంపు కనిపించకపోవచ్చు. కొందరకు వాహన ప్రమాదం ఉన్నది, జాగ్రత్త. స్త్రీలకు : వృత్తియందు నూతనావకాశాలు.

★ **సింహం :** నూతన వ్యక్తులతో పరిచయం, లావాదేవీలలో అనానుకూలం. రావలసిన డబ్బు రాకపోవటం, వ్యాపారం అనుకొన్న విధంగా జరుగక పోవటంగమనింపతగిన అంశాలు. బాగా దెబ్బ తిన్నభూముల విషయంగా శ్రమిస్తారు. కొందరకు దొంగ భయమున్నది, గ్రహించండి. 'వారఫలం' వాస్తవమని గ్రహిస్తారు. స్త్రీలకు : రాజకీయంగా అనానుకూలం. వృత్తి యందు ఇబ్బంది.

★ **కన్య :** ఒకపని సక్రమంగా జరుగలేదనిపిస్తుంది. వ్యాపారాన పెద్దగా అభివృద్ధి కనిపించదు. రాజకీయవాదులకు మేలైన వారంగాదు. అనుకొన్న దొకటి, అయ్యేది దొకటి. అలవాటుగా చేసే పనిలో లోపం కనిపిస్తుంది. ఒకవేళ లాభించవలసిన వ్యవహారంలో నష్టం రావచ్చు. స్త్రీలకు : స్థితి యందు పెంపు, ఉద్యోగ రీత్యా అనుకూలం. శుభ కార్య విషయంగా సంభాషణలు.

★ **తుల :** విలాస వస్తు సేకరణకు అనుకూలం. రాజకీయంగా మీకు మేలు గాదు. పెద్దల వలన, అప్పు లిచ్చిన వారివలన, మిత్రుల వలన, స్త్రీల వలన ఇబ్బందులు రాకుండా చూచుకోవాలి. వృత్తియందు పెంపున్నది. స్త్రీలకు : శుభ కార్యాను కూలం, రాబడి యందు మేలు చేకూరుతుంది.

★ **వృశ్చికం :** ఇప్పుడిప్పుడే కొంత మెరుగు కనిపిస్తుంది. మీ అభీష్టం నెరవేరుతుంది. నూతనంగా వ్యాపారం ప్రారంభిద్దామా? చిత్రం నిర్మిద్దామా? అని అనుకోకండి. ధైర్యం చేయండి. ముందు నడవండి. క్రమంగా మేలు జరుగుతుంది. 'శని గ్రహాశీస్సు' లుంటాయి. స్త్రీలకు : వృత్తి యందు మేలు. ధనాదాయముంటుంది.

★ **ధనుస్సు :** ఏదో ఆలోచిస్తారు. మరేదో చేస్తారు. వ్యాపారాన్ని పెంచాలనుకొంటారు. ఏవేవో ఎత్తులు వేస్తారు. అవి సాగిరాకపోవటంతో విసుగు జనిస్తుంది. ఉద్రేకం అధిక మవుతుంది. ఉద్రేకంతో ఏ పనీ చేయరాదు గదా! స్త్రీలకు : నూతన విషయాలలో జాగ్రత్త అవసరం. గ్రహిస్తారుగా! గ్రహస్థితి అది.

★ **మకరం :** ధన విషయంలో ఇబ్బంది లేదు. సఖ శాంతులకు లోపం లేదు. కళారంగంలో అంతకన్నా లోపం ఉండదు. చిత్రరంగానుభవం గల వారికి, రంగ స్థల అనుభవం గల వారికి సదవకాశాలు లభ్యం కాగలవు. రాజకీయంగా కూడ అనుకూలమే! కృషి అవసరం. స్త్రీలకు : ఉద్యోగ రీత్యా మేలున్నది, గ్రహించాలి.

★ **కుంభం :** సులభంగా ఒకానొక వ్యవహారం సానుకూలం కాగల వారం. ధనవంతుల సాయం చేకూరుతుంది. వ్యాపారంలో అనుకూలం. రాజకీయంగా ఏవిధంగా మీకు మేలు గాదు. అత్యవసర పనులు సానుకూలమవుతాయి. స్త్రీలకు : నూతనాంశాలు గ్రహిస్తారు. ధనం చేకూరుతుంది.

★ **మీనం :** అధికారమందు వృద్ధి యున్నది. అనుకొన్న విషయాలలో విజయమున్నది. సులభంగా మీ అభీష్టం చేకూరుతుంది. నూతన వ్యాపారం కొంత మేలుగా ఉంటుంది. అలాగు అనుకోలేదుగా మీరు. వ్యవహారం ఏదో సమయానికి అందుబాటులోనికి రావటం విశేషం. శుభ కార్యాలు వాయిదా పడటం గమనిస్తారు. 'వారఫలం' చూస్తే ముందుగా తెలిసికొంటే మంచిదేగా! స్త్రీలకు : అన్ని విధాల మేలైన వారం, గ్రహించండి.

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

సీరియల్

# సంకెళ్ళెవరికి?

## డాక్టర్ కొత్త రవీంద్రబాబు



(గత సంచిక తరువాయి)

వారం రోజుల్లో కోలుకుంది రూప. ఆ వారం రోజులూ గూడెం ప్రజలు యావన్మంది ఆస్పత్రి ఆవరణలో నే గడిపారు.

"మమ్మల్ని మనుషుల్ని చేసి మళ్లీ మనుషుల్లో కలపాలనుకుంది! ఆమెకు ప్రమాదంగా వుంటే మేము ఇళ్ల దగ్గర ఎలా నిదురపోతాం?" అంటూ అక్కడే వుండిపోయారు.

గూడెం ప్రజల మాటలు వింటున్నకొద్దీ పశ్చాత్తాపంతో కుమిలిపోసాగాడు చింటూ.

సారంగపాణి వచ్చి "ఒరేయి చింటూ! రాణి నా చెల్లెలు లాంటిదిరా! మేమిద్దరం ఎప్పుడు మాట్లాడుకున్నా నీ గురించే చర్చించుకునేవాళ్లం! రాణిని చూస్తే నాకు చిన్నప్పుడు వైద్య సహాయంలేక మరణించిన మా చెల్లె కమల గుర్తొచ్చేది. అటువంటి రాణిమీద అభాండాలు వేసావు నువ్వు!

ఆ రోజు నువ్వు ఆమెను పొడిచివేయటానికి ముందు ఆమె నాతో "అన్నయ్యా! పైకి అలా వున్నా చింటూ మనసు వెన్నలాంటిది ఎన్ని ప్రయాసలు పడి అయినాసరే అతన్ని మంచి దారిలోకి తీసుకురావాలి" అని అంది" అంటూంటే చింటూ కనుకొలకులనుండి కన్నీళ్ళు కారసాగాయి.

ఆరుముగం మాటలు, మణి మాటలు విని లేనిపోనివి వూహించుకుని ఆవేశంలో రాణిని పొడిచాడేగాని ఆమె వంట్లోంచి రక్తం కారిపోతున్న క్షణం నుంచి అతని మనసును పశ్చాత్తాపం దహించివేయసాగింది.

రాణిని సాక్షాత్తు దేవతలాగా కొలుస్తున్న గూడెం ప్రజలను చూచినకొద్దీ అతను కుంగిపోసాగాడు. "రాణి తన ప్రాణం కాపాడింది. కాని తాను ఆమె ప్రాణం తీయబోయాడు.

వీళ్ళు! వీళ్ళూ నావంటి కిరాతకులే! వాళ్లకు మంచి మార్గంలోకి వెళ్లే దారి చూపబోయిందామె. అంత మాత్రానికే వాళ్ళు ఆమెను నెత్తిన పెట్టుకు ఆరాధిస్తున్నారు!

తాను కిరాతకులలో కెల్లా కిరాతకుడు. వీళ్ల మధ్య వుండతగడు! వీళ్ల మధ్య నుండి వెళ్ళిపోవాలి" అనుకోసాగాడు చింటూ. అనుకున్నాడేగాని రాణిని కళ్లారా చూసిగాని అక్కడ నుండి వెళ్లాలని లేదతనికి.

హాస్పిటల్ వార్డులోకి వెళ్లి ఆమెను చూడటానికి ముఖం చెల్లలేదు! అందుకే గూడెం ప్రజలు ఆమె ఆరోగ్యం గూర్చి చెప్పుకుంటున్న వార్తలు వింటూ గేటు దగ్గరే వుండిపోయాడతను.

తిండీ, నిద్రా లేక, మాసిన గడ్డం, మురికి గుడ్డలతో నీరసపడిపోయాడు చింటూ!

రాణిని డిశ్చార్జి చేసారు. టాక్సీ తీసుకువచ్చారు. రాణి టాక్సీలో కూర్చుని వుంటే వెనకనే గూడెం ప్రజలందరూ నవ్వు ముఖాలతో కదిలారు.

కాని ఆమె కళ్ళు అందరిలోనూ ఎవరి కోసమో వెతుకుతున్నాయి అందరిలోనూ దిగాలుపడిపోయి వున్నదతనే!

గేటు పక్కన వున్న చింటూను చూడగానే ఆమె కళ్ళు తళతళ మెరసాయి.

కారు ఆగింది. కాంతివంతమయిన ఆమె చూపుల సమ్మోహన శక్తి చింటూను వివశుడిని చేసి ఆమె వద్దకు నడిపించుకు వెళ్లింది.

చుట్టూతా అంతమంది వున్నారన్న జ్ఞానం లేకుండా రాణిని పసిపిల్లవాడిలా పొదివిపట్టుకుని రోదించసాగాడు చింటూ!

ఆ దృశ్యం చూసి కనులు చెమర్చనివారు లేకపోయారు!!

* * * *

మణి ఒక్కటి తప్ప ఇప్పుడు చింటూ, జాకాల్‌తో సహా అందరూ వచ్చి చదువుకుంటున్నారు

రెండు బ్లాక్ బోర్డులు తెప్పించి రూప, సారంగపాణి వాళ్లకు విడివిడిగా పాఠాలు చెబుతున్నారు!

గ్రామ ప్రజల్లో వస్తున్న మార్పు రూపకు ఎంతో ఆనందాన్ని కలుగజేసింది. నులక పేనటం, నవ్వారు తయారు, తివాచీలు తయారు, బుట్టలు అల్లటం, ఒకటేమిటి ఏ విధంగా కష్టపడి నిజాయితీతో నాలుగు రూపాయలు సంపాదించటానికి వీలవుతుందో ఆ విధంగా, ఎవరికి చేతనైన విధంగా వారు వళ్ళు వంచి పనిచేయడం మొదలెట్టారు.

ఆస్పత్రి నుండి తిరిగి వచ్చాక చింటూ కొద్ది రోజులపాటు బెరుకుగా తిరిగేవాడు కాని రూప అభిమానంగా ఆదరిస్తూ, ప్రేమామృతం చిలకరిస్తున్నప్పుడు అలా ఎంతో కాలం వుండలేకపోయాడు.

చాలా రోజులుగా ఆ గ్రామ ప్రజలు దొంగతనాలకు, దోపిడిలకు వెళ్లటంలేదు! గ్రామంలోనూ, చుట్టూతా వున్న నేల చదును చేయబడి పూలమొక్కలతోను, కాయగూరల పాదులతోను నిండివున్నది!

రూప పూలమొక్కలకు పాదులు చేస్తుంటే చింటూ ఆమెకు సాయపడతూ వున్నాడు. చింటూ, రాణి అలా సన్నితంగా మసలుకోవడం చూచి సారంగపాణి ఎంతో సంతోషిస్తున్నాడు. ఛమేలీకి కూడా చింటూ రాణిల సాన్నిహిత్యం ఆనందాన్ని కలిగిస్తున్నది!

ఒక రోజు మధ్యాహ్నం భోంచేసి విశ్రాంతిగా వున్నప్పుడు "రాణీ! నిన్ను

జరిగిన కథ– 14: రూప మాటలతో గూడెంలోని ప్రజలలో కొంత పరివర్తన రాసాగింది. వాళ్లకు రూప సారంగపాణి సహాయంతో చదువు చెప్పటం ప్రారంభించింది. రాణి, సారంగపాణి అలా సన్నిహితంగా మసలు కొంటుంటే చింటూకి ఏమిటోగా ఉంది. రాణి పీడ ఎప్పుడు విరగడయి పోతుందా అని ఎదురు చూస్తోంది మణి ఆరుముగం. మణి చెప్పిన మాటలతో రాణిపట్ల చింటూ మనసు అనుమానంతో, ద్వేషంతో నిండిపోయింది. సారంగపాణిని కత్తితో పొడవడానికి వెళ్లిన చింటూకి రూప అడ్డం వెళ్లి కత్తి దెబ్బ తగిలి స్పృహ కోల్పోయింది. చింటూ రక్తం ఇవ్వడంతో గండం గడచింది.

చూడగానే అనుకున్నా చింటూకు తగిన జోడీ దొరికిందని! ఇన్నేళ్ళు నా చేతులమీదుగా పెరిగాడు. ఇక మీ ఇద్దరూ ఒకటయితే నిశ్చింతగా వుంటాను" అంది ఛమేలీ రూపతో.

మళ్ళీ ఆమే "మూడు సంవత్సరాల పిల్లవాడుగా వున్నప్పుడు నాగయ్య చింటూను తెచ్చి నా చేతుల్లో పెడుతూ "ఛమేలీ! బంగారంలాంటి పిల్లవాణ్ని తెచ్చి నీకప్పజెప్పుతున్నా! ఎలా పెంచుతావో?" అన్నాడు.

అప్పటికింకా మాటలు రావు! సరిగా నడవటం కూడా రాదు. అలాంటి కుర్రాడిని తీసుకుని తెలుగుదేశం నుండి ఇలా వొచ్చేశాం! మొదట్లో నేను పిల్లవాడిని తీసుకొని తాత సుబ్రమణ్యం దగ్గర వుండేదాన్ని. నాగయ్య వేడన్‌తాంగళ్ దగ్గర పది ఎకరాలు పొలం కొనుక్కుని సాగు చేయించే ప్రయత్నాలలో పడిపోయాడు.

పిల్లవాడికి పేరేమి పెట్టాలి అనుకుంటుంటే అంతా వాణ్ని "చింటూ" అని పిలవసాగారు. ఇక్కడ నీళ్ళు వంటబట్టాయో ఏమో తర్వాత చాలా చురుకుగా తయారయాడు నడవటం, పరిగెత్తటం, మాటలు జోరుగా నేర్చుకుని తన ఈడు పిల్లలతో పాటు తిరగసాగాడు.

సుబ్రమణ్యం నాకు పింతల్లి భర్త! అతను మమ్మల్ని ఇక్కడే వుండమన్నాడు! అప్పటికీ, ఇప్పటికీ అతని మాటకు గూడెంలో ఎదురులేదు.

నేను చింటూ కొన్నాళ్ళు ఇక్కడ, కొన్నాళ్ళు వేడన్‌తాంగళ్ వద్ద వుండేవాళ్ళం.

నాగయ్య పొలం సాగుచేయడం పూర్తయేసరికి చింటూ చిన్న చిన్న దొంగతనాలు చేయడంలో ఆరితేరాడు! చిన్నప్పటి నుండి రక రకాలుగా గొంతులతో మాట్లాడతూ అందరనూ నవ్విస్తూ వుండేవాడు! వయసొచ్చిన దగ్గర్నుండి రకరకాల వేషాలు వేసుకొని పోలీసుల కళ్ళు గప్పి తిరిగేవాడు. వీరమణి అనేఅతని దగ్గర తాళాలు తీయడం నేర్చుకున్నాడు. మారు తాళం చెవులతో తాళాలు తీయడంలో చింటూకంటె నేర్పరి లేదు!

అన్నీ బాగానే వున్నాయ్! వీడికో జోడు దొరికితే బాగుండును అనుకుంటుంటే నువ్వు వచ్చావు! ఇన్నాళ్ళు పెంచి పెద్ద జేసినందుకు ఇక నా బాధ్యత తీర్చుకుందామని అనుకుంటున్నా" అంది ఛమేలీ!

కొంచెంసేపు సిగ్గుతో తలదించుకుని ఆ తర్వాత ఛమేలీని అడిగింది రూప "అయితే చింటూ ఎవరి కొడుకు?" అని

"ఎన్నిమార్లు అడిగినా నాగయ్య చెప్పనేలేదు ఇరవై సంవత్సరాల క్రితం అతను వాళ్ల చుట్టాల ద్రాక్ష తోట పనులు చేయిస్తూ హైద్రాబాద్‌లో వుండేవాడు. అప్పుడే నన్ను దగ్గరకు తీసాడు! కాని డబ్బులు కాజేస్తున్నాడని తెలుసుకుని వాళ్ల చుట్టం మమ్మల్నిద్దర్ని వెళ్ళగొట్టాడు. ఆ తర్వాత కొద్ది



# సంకెళ్లె వరికి?

రోజులకే ఈ పిల్లవాడిని. కొంత డబ్బునూ తీసుకుని నా దగ్గరకు వచ్చాడు నాగయ్య.

పిల్లవాణ్ని చూచి ముచ్చటపడ్డాను! "ఇక్కడ వుంటే పోలీసులు పట్టుకుంటారు" అని నాగయ్య అంటే బాతులు మద్రాసు తీసుకొని వెళ్లే లారి ఎక్కి తమిళనాడు వచ్చాం. మొదట్లో తాత పంచన జేరినా చింటూ క్రమంగా కులవృత్తి నేర్చుకుని ఆరితేరాడు" అంది చమేలీ!

* * * * * *

పరిగెత్తుకుని వచ్చినందువల్ల ఆరుముగం తెగ రొప్పుతున్నాడు! "తాతా!" "చింటూ, "జాకాల్" అంటూ కేకలు పెట్టాడు రొప్పుతూనే!

అంతా చుట్టూ జేరాక "వందలకొద్దీ పోలీసులు గ్రామం చుట్టుముడతారట. తుపాకులు, గ్రైనేడ్లు, స్టెన్‌గన్‌లు తీసుకు వస్తున్నారు. మద్రాసు నుండి నిన్ననే అదనపు బలగం వచ్చి దిగింది. ఇవ్వాళో రేపో ముట్టడి [illegible] చిదంబరం చెప్పాడు" అన్నాడు ఆరుముగం.

"తాతా! నా గురించి మీకేం భయంలేదు. అవసరమైతే పొడుచుకు చావటానికి నా దగ్గర కత్తి వున్నది. నేను చెప్పిన మాట యీ ఒక్కసారి వినండి!"

"సరే" అన్నాడు తాత!

* * * * * *

గ్రామం చుట్టూ పోలీసు వేన్‌లు వచ్చి ఆగాయి. వాగు అంచున, కొండ మీద ఎర్రటోపీలు వలయాకారంలో నిలబడ్డాయి. లౌడ్‌స్పీకర్ అమర్చిన జీపులో నాయర్, శాస్త్రి, తంగవేలు బయల్దేరి గ్రామం మొగదలకు వచ్చి ఆగారు.

"మీ గ్రామం చుట్టూ ముట్టడి వేసాం! తప్పించుకు పోవటానికి ఇక మీకు మార్గంలేదు! చింటూను, జాకాల్‌ను మాకప్పజెప్పి మర్యాదగా లొంగిపొండి"

పదే పదే లౌడ్‌స్పీకర్ నుండి హెచ్చరికలు వినపడ్డాయి.

రూప తాత ఇంటి ముందు నుండి పోలీసు జీపు వైపుగా నడవసాగింది.

గూడెంలోని ఇళ్ల నుండి అనేక జతల కళ్లు ఆమె వంకే ఆత్రంగా చూస్తున్నాయి. ఆ చూపుల్లో భయం, అనుమానం, కొద్దిగా ఆశ. "పోలీసులు మమ్మల్ని వేటాడి చంపకుండా వుండాలంటే రాణివల్లే ఏమైనా వుపయోగం" అని!

జీపుల్లోనూ, వానుల్లోనూ కలవరం బయలుదేరింది!

"ఆ వచ్చేది ఎ. యస్. పి. రూప" కానిస్టేబుల్ దగ్గర్నుండి డి. ఐ. జి. దాకా







అంతా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. "చూస్తారేం! తియ్యండి కత్తులూ, బరిశలూ, గొడ్డళ్లూ, వూళ్లో అడుగు పెట్టినవాడిని నరికపారేద్దాం! ఆడవాళ్లు కారం కుండలూ, సున్నం పిడతలూ దగ్గర అట్టిపెట్టుకోండి! పోలీసులు మనల్ని ముట్టడించటం కొత్తకాదు!" అన్నాడు తాత.

"ఒక్క మాట! పోలీసులు అంత పెద్ద ఎత్తున దాడి జరుపుతున్నప్పుడు మనం వాళ్లను ఎదుర్కోగలమా?" అంది రూప.

"ఎలా చస్తేనేం? వాళ్లకు చిక్కితే చిత్రహింసలు పెట్టి చంపుతారు! వాళ్లతో పోరాడుతూ చస్తే కనీసం బాధలయినా వుండవు. అయినా రాణి పోలీసుల్ని నమ్మగూడదని మొదట్నుంచి చెబుతున్నా! నమ్మించి గొంతు కోయడంలో వాళ్లను మించినవాళ్లు లేరు" అన్నాడు తాత.

"తాతా! ఇందులో ఏదో పొరపాటు వుండి వుంటుంది. ఐ. జి. దగ్గర్నుంచి మన సమస్యలను పరిష్కారం చేస్తున్నాం అని జవాబు వచ్చింది.

మీరు పోలీసులతో తలపడే ముందు నేనొక్కసారి వాళ్లతో మాట్లాడతాను. ఆ తర్వాత కూడా ఫలితం లేకపోతే మీ యిష్టం" అంది రూప.

"రాణీ! ఇంకా నీకు వాళ్ల మీద ఆశ వున్నదన్న మాట! వాళ్లతో మాట్లాడటానికి వెళితే నిన్ను వెనక్కు రానిస్తారా? పట్టుకుని ... వద్దు రాణీ!"

అందరి పెదాలపై అదే మాట!

రూప డి. ఐ. జి. నాయర్ ముందు నిల్చుని శెల్యూట్‌చేసి కాయితం అందించింది.

"రూపా!" అంటూ తంగవేలు జీపు దిగి ఆమె దగ్గరగా వచ్చాడు.

"అవున్సార్! మీ పర్మిషన్ లేకుండా ఇలా వచ్చినందుకు క్షమించాలి! కాని జరుగుతున్న విషయాలన్నీ ఎప్పటికప్పుడు ఐ. జి. గారికి తెలియజేస్తూ ఆయన సలహాపైనే నడుచుకుంటూ వచ్చాను".

"ఆ!?".

"సార్! గ్రామ ప్రజలంతా మీకు సరెండర్ అవుతారు కాని మీరు మీ రైఫిల్స్‌ను, గ్రైనేడ్స్‌ను, స్టెన్‌గన్స్‌ను అవతలకు పంపివేయాలి!"

"వాట్ ఎ స్ట్రేంజ్ స్టేట్‌మెంట్ ఫ్రం ఏ పోలీస్ ఆఫీసర్" అంటూ ఆమె చెప్పినట్లు చేయమని ఆర్డరిచ్చాడు డి. ఐ. జి. నాయర్.

నాయర్, శాస్త్రి, తంగవేలు, రూప గూడెం వైపుగా నడిచి రాసాగారు.

ఇళ్లలోపల కత్తులూ, గొడ్డళ్లూ, గునపాలూ, కారం కుండలూ, సున్నం పిడతలూ పుచ్చుకున్నవాళ్లందరూ చేతుల్లో వస్తువులు వదిలేసి బయటకు నడిచారు.

# భారతి

సాహిత్యాభిమానులకు ★ చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని, పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడుతుంది

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




- - - - - - - - - - - - - - - - - - - - ✂ - - - - - - - - - - - - - - - - - - - -

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________________

చిరునామా : ______________________________

______________________________

చందాదారుని సంతకం




డి. బి. ఆర్. – చీరాల

మా అబ్బాయికి ఆరు సంవత్సరములు సంవత్సరం క్రితం కాళ్ళకి గజ్జి వచ్చినది. ఆ బొబ్బల నుండి నీరు కారుతూ వుండేది అది తగ్గిపోయి ఇప్పుడు పులిపిర్ల లాగా వచ్చినవి ఇవి తగ్గాలంటే ఏవి మందులు వాడాలి?

చర్మ వైద్యులు పైపూతగా వాడటానికి ప్రస్తుత రోగ పరిస్థితిని అనుసరించి సాలిసిలిక్ యాసిడ్ గల మిశ్రమాన్ని ఇస్తారు. కార్టికోస్టిరాయిడ్ ఆయింట్‌మెంట్లు ఎంతో ఉపశమనాన్ని కలుగ చేస్తాయి. అలర్జీ వల్ల పై రోగ లక్షణా లేర్పడతాయి.

జి. యస్. ఎమ్. – పాలకొల్లు

నేను గత 2 సం ల నుండి కుడివైపు పార్శ్వపు నెప్పితో బాధపడు తున్నాను కంటి ప్రక్క నరం లాగటంతో ప్రారంభమవుతుంది ఇది వచ్చినప్పుడు విపరీతమైన చమటలు, ఆవలింతలు వస్తాయి ఏకారంగా వుంటుంది కంటి నరం దగ్గర నుండి మెడనరం వరకూ నెప్పి వుంటుంది కంటి గుడ్డులో ఏ నరము గూడా పలుపు పెడుతుంది ఒక గంట నిద్రపోతే తగ్గుతుంది నాకటిర్ణశక్తిలో గాని, ఏరోచనంలో గాని ఏమి లోపము లేదు

మైగ్రైయిన్ అనబడే ఈ లక్షణం ఉన్నవారికి తాత్కాలిక ఉపశమనానికి ఆస్పిరిన్, కఫేన్, ఎర్గాట్ మొదలయిన మందులు వాడటం మినహా ప్రత్యేక చికిత్స ఏమీ లేదు కొన్ని సం.ల తర్వాత రోగ లక్షణాలు వాటంతట అవే తగ్గుతాయి. రోగాన్ని ఉద్రిక్తపరచే లక్షణాలకి తగిన ముందు జాగ్రత్తలు తీసుకున్నప్పుడు చాలా మటుకు రోగ లక్షణాలు తగ్గుతాయి.

ఎ ఎస్ ఎస్. – ఏలూరు

సిగరెట్ త్రాగిన తరువాత రెండు నిముషములు ఈల ఊదటం వల్ల ఆ సిగరెట్ త్రాగటం వల్ల వచ్చే హాని పోతుందని, ఈల ఊదటం వల్ల మన శరీరంలో వున్న కార్బన్-డై-ఆక్సైడ్ బయటకు వచ్చి ఆక్సిజన్ లోపలికి వెడుతుందని నా స్నేహితుడు చెప్పాడు అది ఎంతవరకూ నిజం"

ఇలా చెయ్యటం వల్ల సిగరెట్ల మూలంగా రాగల హాని ఏమాత్రమూ తగ్గదు.

ఎ ఆర్. ఎమ్. – కడప

నాకు వివాహమయి 5 సంవత్సరములు అయినది. పిల్లలు లేరు ఎక్కువగా తుమ్ములు వస్తాయి తుమ్ములు వచ్చినప్పుడు కండ్లు దురదలుగా వుంటాయి డాక్టర్లకు చూపిస్తే అలర్జీ అని మందులు వ్రాసిచ్చారు మందులు వాడితే తగ్గి మరల వస్తుంది ఈ తుమ్ములు, కండ్ల దురదలకు పిల్లలు పుట్టక పోటానికి ఏమైనా సంబంధ మున్నదా?

ఈ రెండిటికీ సంబంధం లేదు. నేత్ర వైద్యులకి, అలర్జీ క్లినిక్‌లలోను కంటి లక్షణానికి గాను పరీక్ష చేయించటం అవసరం పిల్లలు పుట్టక పోవటానికి గల కారణాలను స్త్రీ పురుషు లిరువురిని పరీక్షించి తెలుసుకోవలసి ఉంటుంది. పై రెండిటికీ సంబంధం లేదు. □

## సంకెళ్ళెవరికి?

వాళ్ళ ముఖాలలో ఆశ్చర్యం, ఆనందం సమంగా చోటు చేసుకున్నాయి!

"రాణి!"

"జిందాబాద్'

అరుపులు, కేకలు మిన్నుముట్టాయి. ఎవర్ని బంధించడం కోసమైతే పోలీసు బలగమంతా ఇన్నాళ్ళూ నిరీక్షిస్తూ వున్నదో ఆ చింటూ, జాకాల్ పోలీసాఫీసర్ల ముందుకు వచ్చి నిలబడ్డారు!

కానిస్టేబుల్ దామోదరం రొప్పుకుంటూ వచ్చాడు. అతని చేతుల్లో సంకెళ్ళున్నాయి

వాటిని చూచి రూప ముఖం చిట్లించింది.

"సార్! బేడీలు వేయమంటారా? అని అడిగాడు దామోదరం డి ఐ జి నాయర్ని

"ఎవరికి!"

"దొంగలకు"

'ఎక్కడున్నారు దొంగలు?" డి ఐ. జి. మాటలకు మతిపోయినట్లు చూసాడు దామోదరం!

"ఈ రోజు నుండి ఈ గూడెంలో దొంగలెవరూ లేరు! ఇక బేడీలకు పనిలేదు! తీసుకునివెళ్ళు!"

డి ఐ జి మాటలు దామోదరానికి పూర్తిగా వినపడలేదు! చుట్టూ వున్న ప్రజల కరతాళ ధ్వనుల శబ్దంలో అవి కలసిపోయాయి!

★ ★ ★ ★ ★ ★

తంగవేలు, అతని భార్య మధురం రూప–చింటూల వివాహ కార్యక్రమానికి ఆధ్వర్యం వహించారు. వివాహం మద్రాసులోని "ఎబాట్స్‌బరి"లో జరిగింది తంగవేలు దంపతులు కన్యాదానం చేయగా శాస్త్రోక్తంగా వివాహం జరిగింది.

పోలీసు డిపార్టుమెంట్ మొత్తం వివాహానికి తరలివచ్చింది ముఖ్యమంత్రి, మంత్రివర్గ సభ్యులు, ఎం. ఎల్. ఏ. లు, రాజకీయ నాయకులూ, ఒకప్పటి దొంగలూ, దోపిడీగాళ్ళతో కల్యాణమంటపం నిండిపోయింది!

రూప, చింటూ వివాహ కార్యక్రమం ముగిసి వేదిక దిగి వస్తూంటే ఎదురుగా వనజా రాఘవరావూ ఎదురొచ్చారు

"ఆంటీ"

'నువ్వు పిలవకపోయినా నీ వివాహానికి రాకుండా వుండలేకపోయాం!" సహ్మారంగా అంది వనజ

పోలీసాఫీసరుగా నా డ్యూటి నిర్వర్తించాలనుకున్నాను నువ్వు పోగొట్టుకున్న వస్తువును నీకప్పజెప్పినప్పుడుగాని నా విధి నిర్వహణ సక్రమంగా నెరవేర్చానన్న తృప్తి మిగలదు! అంటూ చింటూను వనజ ముందుకు తీసుకుని వెళ్ళింది.

చింటూ ముఖం వంకే రెప్పార్పకుండా చూస్తున్న రాఘవరావు వనజల ముఖాల్లో ఏదో అనుమానం తాలూకు ఛాయలు పొడసూపి అవి క్రమంగా పువ్వెత్తున ఎగసిపడే ఆనంద తరంగాలుగా మారిపోయాయి

చింటూ ఎడమచేతి బొటనవేలు ఎత్తి చూపుతున్న రూపతో అక్కర్లేదమ్మా! నువ్వు పొరపాటు చేస్తావని కలలో కూడా అనుకోలేం" అన్నాడు రాఘవరావు

ఆంటీ! మీ అబ్బాయి మీకు దొరికాడన్న సంతోషంలో చిన్నప్పట్నుంచీ పెంచిన రూపను మరచిపోరు గదా!

చింటూను తనివితీరా కౌగలించుకుని ఆనందభాష్పాలు విడుస్తున్న వనజ -

ఇన్నాళ్ళు ఒక కంటితో యీ ప్రపంచాన్ని చూస్తున్నాళ్ళ ఇకనుంచీ వృద్ధాప్యంలో రెండు కళ్ళతో మీ దంపతులిద్దర్ని చూచుకోగల అదృష్టం కలిగింది అన్నది

సంతోషంగా తల వూపాడు రాఘవరావు

(అయిపోయింది)

# ఫాల్గుణి డైరీ

## తాజ్‌మహల్‌కి వెళ్లి ఆస్పత్రి పాలయిన విదేశీ మహిళ!

తాజ్‌మహల్‌లో కొన్ని మరమ్మత్తులు జరుగుతున్నాయట. ఈ మరమ్మత్తులు జరిగే చోట కనీసపు హెచ్చరికలూ, జాగ్రత్తలూ చూపకపోడంతో తాజ్‌మహల్ చూడ వెళ్ళిన వో విదేశీ మహిళ మిసెస్ వెల్స్ తల మీద వో పెద్దరాయి పడి, ఆమె తల పగిలిందట చివరికో పుంజిడు కుట్లతో ఆమె ఆసుపత్రి నుంచి బయట పడ్డదట.

## వ్యభిచారం చట్టబద్ధం చేయడం విషయంపై రిసెర్చి!

భారతదేశంలో వ్యభిచారాన్ని వృత్తిపరంగా అంగీకరిస్తూ చట్టబద్ధం చేయాలా, లేక యిలానే




వదిలెయ్యాలా అనే విషయం మీద న్యాయశాస్త్ర నిపుణులు చట్టబద్ధం చేస్తే చాలా మేలని చెప్తున్నారట ఈ విషయంతో వో మూడు సంవత్సరాలు రిసర్చి చేసిన జీన్ డి సున్హా అనే ఆయన వ్యభిచారాన్ని చట్టబద్ధం చేయడం మంచిది కాదనీ దాని వల్ల వ్యభిచారిణులకు ఏమాత్రం మంచి కలుగదనీ నిర్వచించారట – దేశానికి యిదీ వో ముఖ్య, తక్షణ సమస్యా ఏమిటి!

## భార్య మెడ నరికిన భర్త!

మధుర మేలూరుకు చెందిన క్రిష్ణన్ అనే అతనికి అయిదుగురు ఆడపిల్లలట. మగపిల్లాడు కావాలన్న తన కోర్కె తన భార్య అళఘుజ్యోతితో తీరలేదని ఆ మానవుడు యింకో పెళ్ళి చేసుకోదలచి తన భార్యను సమ్మతి పత్రం రాసిమ్మని కోరాడట. దాని కామె సమ్మతించనందు వల్ల కోపంతో చేతి కందిన కొడవలితో ఆమె మెడ నరికి పారిపోయాడట అళఘుజ్యోతి ఆసుపత్రి పాలయ్యిందట!

## తమిళనాడులో అలజడులు!

హిందీ భాషను తమ రాష్ట్రంలో బలవంతంగా ప్రవేశ పెట్టాలని కేంద్ర ప్రభుత్వం చూస్తోందని తమిళనాడులో అల్లరులూ, అలజడులూ ఆరంభమయ్యాయి హిందీ రాసి వున్న బోర్డులకు తారు పులిమారు మద్రాసులోని లా కాలేజి విద్యార్థులు యిద్దరు హిందీ తమ రాష్ట్రంలోకి ప్రవేశ పెట్టడానికి కేంద్రం చేస్తున్న ప్రయత్నానికి నిరసనగా వంటికి నిప్పు అంటించుకుని ఆత్మాహుతికి పాల్పడబోయి, పోలీసుల చేత అరెస్టయ్యారట.

## స్వామివారి మీద ఫిర్యాదు!

'తన బట్టలు యిప్పించి, దిగంబరుణ్ణిగా చేసి, మంచం మీద పడుకోబెట్టి, తానూ దిగంబరుడుగా తయారయి, తన మీద పరుండి. తనతో అనేకసార్లు రతి జరిపారు' అని తుమ్కూరు (కర్నాటక)కు చెందిన శిద్ధ గంగ మఠం విద్యార్థి దీపక్‌సింగ్ ఆ మఠంకు చెందిన చిన్నస్వామి గౌరిశంకర్ మీద పోలీస్టేషనులో ఫిర్యాదు చేశాడట ఈ సందర్భంగా ఏన్టిసిపేటరీ బెయిలు తీసుకున్న ఆ స్వామి వారు తాను ఆ మఠంలోని అవకతవకలను పైకి తీయాలని చేసిన ప్రయత్నాల వల్ల అవి గిట్టని




వారు తన మీద యీ విధమైన కథ అల్లారని శలవిచ్చారట

## జీవితంపై విరక్తితో విషం తాగిన మహిళ!

దిండిగల్లుకు చెందిన మలరవిళి అనే ఆమె ఐదరు పిల్లల తల్లి అయినా ఆమె భర్త మురుగేశన్ ఆమెను తగినంత కట్నం తేలేదనీ, తీసుకురమ్మని వాపబాదేవాడట ఆ రకమైన బ్రతుకు యిష్టంలేక మలరవిళి తాను విషం త్రాగడం గాక, తనిద్దరు పిల్లలకూ చేరో కొంచెం పట్టించిందట

## గర్భనిరోధానికి వనమూలిక!

అలనాడు అగస్త్య మహాముని గర్భ నిరోధకాన్ని కలిగించే వో వనమూలికను గురించి వివరించారట ఆ వివరాలను ఆధారంగా తీసుకుని బెంగుళూరు సిద్ధ మెడికల్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్ వారు చేసిన పరిశోధనలలో విజయం లభించిందట ఆ




మూలికతో చేసిన మాత్రలను బుతుస్రావం ఆరంభమయిన స్త్రీకి అయిదో రోజు నుంచి అయిదు రోజులు పాటు (యీ మాత్రలు) యిస్తే, గర్భధారణ జరుగదనీ, ఈ విధంగా ఒక్కసారి వాడితే సుమారు ఏణ్ణర్థం సురక్షితంగా ఆ స్త్రీ వుండవచ్చుననీ వారన్నారట

## యువకుని కొజ్జాగా మార్చిన హిజ్రా గురువు!

హైదరాబాదులోని వో పెద్ద ఫిల్మ్ స్టూడియోలో వో చిన్న పని చేస్తున్న గంగయ్య అనే యువకుణ్ణి ఒకాయన పట్టుకుని, నిన్ను అందమైన అమ్మాయిగా మారుస్తాను అని ఆశ చూపి ఆపరేషనుకు తీసుకుపోయాడట అది అమ్మాయిగా మారే ఆపరేషను కాదనీ, ఆ రకంగా మారడం తన కిష్టం లేదని మొత్తుకున్నా, అతనికి మత్తు మందిచ్చి ఆపరేషను చేసి పారేశాడటాయన దాంతో కొజ్జాగా మారిన గంగయ్య తనను కన్న వారికి ముఖం చూపలేక ఢిల్లీ పారిపోయి, అక్కడ తన లాటి వారితో కలిసిపోయాడట ఈ విధంగా దేశంలో సుమారు 40 వేల మంది యువకులకైనా ఈ హిజ్రా గురువులు ఆపరేషన్‌లు చేశారట □

# భ్రష్టా! నీరాత తారుమారు!

## ఇమంది రామారావు

హీరో మృత్యుంజయుడు తన పుట్టినరోజు పండగను చాలా వైభవంగా జరుపుకున్నాడు. ఆంధ్రదేశం నుండి తన అభిమానులు దేశంలో వరదలు వచ్చినా.... రైళ్ళు పూర్తిగా రద్దు చేసినా.... మద్రాసు వచ్చేందుకు డబ్బులు లేకపోయినా... ఎలాగోలా... ఎలా? అని మీరడగొద్దు.... యింట్లో దొంగతనం చేసి కావచ్చు... రాత్రుళ్ళు రిక్షాయో, ఆటో రిక్షాయో నడిపి కావచ్చు ఎలాగోలా... లా... డబ్బులు సంపాదించి ప్రత్యేకమయిన బస్సుల్లో దేశం నలుమూలల నుండి అభిమానులు తరలివచ్చారు.

అందుకే మృత్యుంజయుడు పుట్టినరోజు ఘనంగా జరిగింది [illegible] అంద – దండలు పుష్కలంగానే వున్నాయన్నది ఋజువయి పోయింది. అందుకు పోర్టికోలో మినియేచర్లో హిమాలయ పర్వత శిఖరాల్లా కనిపిస్తున్న పూలమాలల దొంతరలే సాక్ష్యం. అఖిలాంధ్ర మృత్యుంజయుడు అభిమాన సంఘాల అధ్యక్షుడు సులోచనరావు ఈ వేడుకలను తనే రిప్రెజెంట్ చేస్తూ నిర్వహిస్తున్నాడు.

ఇక్కడ సులోచనరావుని గురించి రెండు ముక్కలు చెప్పుకోవాలి. మృత్యుంజయుడు ఎవరికోసం పుట్టాడో కరెక్ట్‌గా చెప్పలేం గాని.... సులోచనరావు మాత్రం మృత్యుంజయుడు కోసమే పుట్టాడు. సులోచనరావు బి. కాం. [illegible].... పత్రికలకు కథలు రాస్తుంటాడు. సినిమాల మీద సద్విమర్శలు చేస్తుంటాడు. సులోచనరావుకి అభిమాన సంఘాల్లో బాగా మాట్లాడగలడు బాగా రాయగలడు అన్న మంచి పేరుంది. సులోచనరావు బి. కాం. ఫస్ట్‌క్లాస్ స్టూడెంట్ అని తెలిసినపుడు.... తను ఏ ఉద్యోగప్రయత్నమూ చేయకుండా మృత్యుంజయుడు 'సేవ'లోనే వున్నాడని.... ఆయన యోగక్షేమాల ధ్యానంలోనే జీవనం గడుపుతున్నాడని తెలిసినపుడు ఎవరికైనా మనసు చివుక్కుమంటుంది. అయ్యో! ప్రతిభ ఎలా బూడిదలో పోసిన పన్నీరయి పోతుందో అని- యిలాంటి సులోచనరావులు దేశంలో ఎందరున్నారో ఏమోగాని. ఇక్కడ ఫంక్షనుకు ఎటెండ్ అయినవారిలో సగం సులోచనరావులూ, [illegible] సగం సులోచనరావులూ.... [illegible].... [illegible] సులోచనరావులూ వున్నారు. అందుకే అంత దివ్యంగా వెలిగి పోతోంది మృత్యుంజయుడి ఫంక్షను ప్రభ-

"అభిమాన సోదరులారా!" అంటూ యింట్లోనే ఎరేంజ్ చేసిన మైకు పుచ్చుకొని అటు యిటూ చూశాడు మృత్యుంజయుడు. అభిమానులు చప్పట్లు మద్రాసు నగరం మార్మోగి పోయేలా కొట్టారు. "మీ అభిమానం నాకింతగా వుండటం యిది నిజంగా నా అదృష్టం. నా పూర్వజన్మ సుకృతం! ఒక్క మాటలో చెప్పాలంటే .... మీరు లేక పోతే నేను లేను!" అన్నాడు బరువుగా.

"మీరు లేకపోతే మేమూ లేము" అంటూ కేకలేసారు పిచ్చి అభిమానులు వెర్రిగొంతుతో.... వారి 'నాభి' లోంచి దూసుకు వచ్చిందామాట. మృత్యుంజయుడు చాలా సినిమాల్లో నటించాడు. కాని అభిమానుల అపరిమితమయిన ప్రేమతరంగాల్ని ఎదురించి రియాక్షన్ యివ్వడం శక్తికి చాలని పనయి పోయింది. కళ్ళు ఒకసారి అద్దుకున్నాడు.

"థాంక్యూ- థాంక్యూ వెరీమచ్ మైడియర్ బ్రదర్స్! మిమ్మల్ని చూసి నేను గర్విస్తున్నాను. మీ అభిమానం. మీ ప్రేమ పాశాలకు శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను!" మళ్ళీ చప్పట్లవర్షం.... నా జీవితాంతం మీ పవిత్రమయిన 'ప్రేమ'ను గుండెల్లో పదిలంగా దాచుకుంటాను. నేను చనిపోయినా సరే. నా కృతజ్ఞతకు గుర్తుగా నా మూత్రపిండాలను.... నా అభిమానులకు అవసరమయితే వారి కోసమే వినియోగించాలని స్థిరమయిన నిర్ణయం తీసుకున్నాను!" అభిమానుల్లో కలకలం బయలుదేరింది. చప్పట్ల ఘోష.... ఈసారి చప్పట్లు ఘోష.... మద్రాసు బోర్డరు దాటి, ఆంధ్రాకి వెళ్ళిపోయాయి.

ఆంధ్రాలో ఎక్కడ చూసినా యిదే మాట. గోదావరి వరద ప్రవాహంలా ఈ ప్రచారం కొనసాగుతుంది. 'ప్రేమ'కు త్యాగానికి నిర్వచనం మృత్యుంజయుడు! అభిమానులంటే ఎంత అభిమానం! ఆయన ఋణం ఎన్ని జన్మలెత్తితే మాత్రం తీర్చుకోగలం. అభిమాన సంఘాలు నిర్వహించిన "మృత్యుంజయుడు జన్మదిన అభినందన సదస్సులలో యిదే విషయాన్ని ప్రశంసించారు." అసలు మృత్యుంజయుడు పేరులోనే వుంది పెన్నిధి. ఆయన చనిపోతే మాత్రం ఏం? ఆయన మూత్రపిండాలను అభిమానుల కోసం కేటాయించడం ద్వారా అమరుడవుతాడు. నిజంగా మృత్యుంజయుడు అవుతాడు!" అన్నాడు సులోచనరావు. అభిమానులు వీర ఆనందంతో హిప్... హిప్.... హుర్రేలు పలికేరు. లాంగ్‌లివ్ మృత్యుంజయా! అంటూ కరపత్రాలు ప్రింటు చేయించారు. భారీ యెత్తున ఖర్చు చేసి వాల్‌పోస్టర్లు అచ్చేయించి మృత్యుంజయుడు కీర్తిని దశదిశలా వ్యాపింపచేశారు. ఒకరోజు.... దినపత్రికలో చూసిన వార్త మృత్యుంజయుడు అభిమాన సంఘాల్ని కలవర పరిచింది. గోడు గోడున ఏడ్చారు. గుండెబాదుకున్నారు ఒకరోజంతా స్థానికంగా షాపులు మూయించేశారు.

"మృత్యుంజయరావుకి మూత్రపిండాలు దెబ్బతిన్నాయి నటనకు స్వస్తి" ఈ వార్తను అభిమానులు జీర్ణం చేసుకోడానికి వారం రోజులు పట్టింది. తమ చెవుల్ని తామే నమ్మలేని స్థితి. కాని నమ్మాలి. స్వయంగా మద్రాసు మృత్యుంజయరావు యింటికి ఎస్. టి. డి.లో గంటల తరబడి వేలాది రూపాయిలు ఖర్చు పెట్టి తెలుసుకున్న నగ్నసత్యం యిది. "వీల్లేదు. మృత్యుంజయుడు నటనకు స్వస్తి చెప్పడానికి వీల్లేదు!" అంటూ గుండె చించుకొని అరిచాడు సులోచనరావు. మిగతా అభిమానులు కోరస్‌లా సులోచనరావు ఏం చెబితే అది చెబుతున్నారు. సులోచనరావు ఆధ్వర్యంలో మృత్యుంజయుడు తిరిగి సంపూర్ణ ఆరోగ్యవంతుడయి. నటించేందుకు యజ్ఞయాగాదులు చేశారు. పేదలకు అన్నదానం వస్త్రదానం చేశారు. "మీరెన్ని చేస్తే ఏముందర్రా పిల్లకాయలూ.... మళ్ళీ మీ మృత్యుంజయరావు బతికి బట్టగట్టాలంటే ఈ పూజలూ, అన్నదానాలు... వస్త్రదానాలు ఏం ప్రయోజనం లేదు. మూత్ర పిండాల్ని దానం చెయ్యాలి!" అన్నాడు ఒక తల పండిన ముసలాడు.

సులోచనరావు ఆ ముసలివాడ్ని అదృశ్య వాణిలా భావించాడు. ఎంత మంచి సలహా యిచ్చాడు. నిజంగా మృత్యుంజయుడ్ని కాపాడ్డం కోసం ఆదేవుడే ఈ ముసలివాడి రూపంలో కనిపించి మనకి కర్తవ్యం ప్రభోదించాడేమో. పదండి మద్రాసు. వెంటనే మృత్యుంజయుడ్ని చూదాం. నా మూత్రపిండాలను దానం చేయడానికి నేను సిద్ధం!" అన్నాడు సులోచనరావు. "నువ్వేనా మేము లేమా?" అన్నారు మిగతావారు. ఈ విషయంలో ఘర్షణ పడటం సులోచనరావుకి సుతరామూ యిష్టం లేదు. ముందు మద్రాసు వెళదాం మన డేరింగ్ యంగ్‌మన్ "మృత్యుంజయుడ్ని చూదాం! మనకోసం తాను మూత్రపిండాలను తన పుట్టిన రోజు సందర్భంగా దానం చేస్తానని ప్రకటించాడు. అలాగే తన అభిమానులుగా తనకోసం మనలో ఏ ఒక్కరి మూత్ర పిండాలనయినా దానం చేసేందుకు సిద్ధమే అని మన సంసిద్ధతను తెలియ చేద్దాం! తదుపరి కార్యక్రమం డిజైన్ చేయవలసింది నేనుకాదు మన ప్రాణంలో ప్రాణం మన అభిమాన డేరింగ్ డాషింగ్ అండ్ యాంగ్రీ యంగ్‌మన్ మృత్యుంజయుడే!" అన్నాడు సులోచనరావు. అభిమానులందరూ తమ అంగీకారాన్ని తెలియచేస్తూ కేరింతలు కొట్టారు.

మద్రాసు బోర్డరు దాటగానే మృత్యుంజయరావు ఇల్లు చూసినే ఫీలింగూ. మృత్యుంజయరావు

యింటి గేటును చూడగానే మృత్యుంజయరావుని చూసిన ఫీలింగు మృత్యుంజయరావుని చూడగానే మృత్యుంజయరావు నటించిన అన్ని సినిమాల్ని ఒకేసారి పాత్రలన్నీ మృత్యుంజయరావు మొహం మీద సూపర్ ఇంపోజ్ చేసినట్టు కనిపించ సాగాయి.

"సార్! యిది నమ్మ లేక పోతున్నాం సార్ మీ కింత అన్యాయం జరగడం మేం భరించలేక పోతున్నాం సార్! ఎందుకుసార్ ఆ భగవంతుడు మాకింత పెద్ద శిక్ష విధించాడు!' అంటూ సులోచనరావు కంట తడిపెట్టాడు అభిమానులందరూ ఎక్కిళ్ళు మింగు తున్నారు మృత్యుంజయుడు మాట్లాడలేక పెదవులు వొణుకుతున్నాయి చేతులు వొణుకు తున్నాయి. "డోంట్ వర్రీ మైడియర్ బ్రదర్స్ .. లెట్ ఇట్ బి యింతకాలం నటుడుగా 'ఏ ఒన్'గానే వెలిగాను. మీ అందరి అభిమానం పొందేను దట్సాల్! చాలు నాకీ తృప్తి! ఈ జన్మకిది చాలు! వచ్చే జన్మంటూ వుంటే మళ్ళీ నేను నటుడుగానే పుడతాను. మీ అందరికోసం!" అన్నాడు చెమర్చిన కళ్ళను తుడుచుకొంటూ

"నో .. నో . మీరు విరమించకూడదు సార్.... మీరు నటించాలి మీరెప్పుడూ 'ఏ ఒన్'గానే వెలగాలిసార్ మీ అభిమానులుగా మేమెప్పుడూ సగర్వంగా తలెత్తుకొని తిరగాలిసార్' అన్నాడొక అభిమాని

"అవునుసార్! మీరు నటించాలి మీరెప్పుడూ యాంగ్రి యంగ్ మాన్ గానే వుండాలి మీరు సంపూర్ణ ఆరోగ్య వంతులు కావాలి అందుకు మేం పథకం ఆలోచించాం!' అన్నాడు మరొక అభిమాని.

"మీరు మాకోసం మీ మూత్రపిండాలను దానం చేస్తానని మీ పుట్టినరోజు సందర్భంగా ప్రకటించారు అది ఇంత తొందరగా మరిచిపోయేటంత కృతఘ్నులం కాదు సార్మేం.... మీకోసం మేం మా మూత్రపిండాలు యివ్వడానికి సిద్ధంగా వున్నాం!" అన్నాడు యింకో అభిమాని. సులోచనరావు రెప్పార్పకుండా మృత్యుంజయుడ్ని చూస్తూ వుండిపోయాడు. మృత్యుంజయుడు చెంపలను తాకుతూ కన్నీటి బొట్లు జారిపోయాయి. అందర్నీ దగ్గరగా తీసుకున్నాడు. పెనవేసుకున్నాడు. ఒక్కొక్కర్నీ ప్రేమతో గుండెకేసి హత్తుకున్నాడు. అతని స్పర్శతో అభిమానులు పులకించి పోయారు. పరవశించి పోయారు. మైడియర్ బ్రదర్స్.... చాలు! మీరంటున్న ఈ మాటలు చాలు నా జీవితం సార్థకమయ్యిందని చెప్పడానికి. ప్రతి మనిషి జీవితంలో ఎవరికెంత ప్రాప్తముందో అంతా జరుగుతుంది. ఎవరి నుదుట రాసింది వారు అనుభవించి తీరాలి!"

"అవసరమయితే ఆ బ్రహ్మరాతను తారుమారు చేస్తాం సార్!" అన్నాడు సులోచనరావు ఆవేశంగా మధ్యలో కట్ చేస్తూ.

"లేదుసార్! మీరు సంపూర్ణ ఆరోగ్య వంతులు కావాలి! మీరు చికిత్స చేసుకోండి! మా మూత్రపిండాలు మీకు యిస్తున్నందుకు మేం బాధపడటం లేదు. ఆనందిస్తున్నాం. మామాట మీరు కాదనకూడదు. భక్తుడి ఆరాధనను. కాదనే హక్కు దేవుడికి వుంటుందంటారా?" ఎదురుప్రశ్న వేశాడు మరో తెలివైన అభిమాని. మృత్యుంజయుడు 'స్తబ్దత'గా వుండిపోయాడు... తను ఏం మాట్లాడినా ఏ నిర్ణయం తీసుకున్నా 'స్వార్థం' అనిపించుకుంటుంది. మృత్యుంజయుడి తడికళ్ళు ఆరాధనతో మెరిశాయి. అభిమానులు ఎగిరి గంతేశారు. మృత్యుంజయుడికి థేర్స్ పలికేరు కొండంత ఉత్సాహంతో.

"నేను ఈ పుణ్యకార్యాన్ని నిర్వహించాలను కొంటున్నాను!" అన్నాడు సులోచనరావు స్థిర నిశ్చయంతో.

"నేను మృత్యుంజయుడి పట్ల నాకున్న ప్రేమాభిమానాలు నిరూపించు కోవాలంటే యింతకంటే మరో అవకాశం దొరకదు!" అన్నాడు మరో అభిమాని.

"కాదు.... నేను!" అన్నాడు మరొకరు.

"కాదు.... కాదు... నేను!" అన్నాడు యింకొకరు. యిలా నేనంటే నేను.. అని వాదులాటకు సిద్ధమయ్యారు.... "సరే ఒక పని చేద్దాం! చీటీ తీద్దాం.... ఎవరికి మృత్యుంజయుడి పేరు దక్కుతుందో వారే అందుకు అర్హులు!" అన్నాడు సంఘాల అధినేతగా సులోచనరావు.

తనను గురించి తన భవిష్యత్తును గురించి యింత మంది తమ ప్రాణాలను సైతం లెక్క చేయకుండా పోటీ పడటం చూసి మృత్యుంజయు డికి అణువణువూ పులకించింది. చీటి వేశారు. చీటీలు తీశారు. "ఐయామ్ ఎలక్ట్ మేన్!" అంటూ దిక్కులు పిక్కటిల్లేలా కేకేశాడు సులోచనరావు. అందరు అభిమానుల్లో సులోచనరావుకి కంగ్రాట్యు లేషన్సు చెబుతూ ఆకాశమంత ఎత్తుకు ఎత్తేశారు. సులోచనరావు కలలు ఫలించాయి. మృత్యుం జయుడు సులోచనరావుని ఆత్మావలింగనం చేసుకున్నాడు. సులోచనరావుకి 'లత'లా పెనవేసుకు పోయాడు మృత్యుంజయుడు. సులోచనరావు జీవితంలో యింత కంటె మధురమయిన క్షణం మరొకటి వుండదేమో. ఈ వార్త అన్ని దిన, వార పత్రికల్లో హెడ్‌లైన్స్‌లో వచ్చేసింది. అమెరికాలో చికిత్స జరిపించేందుకు అమెరికన్ డాక్టర్సుతో మాట్లాడి ఎపాయింట్‌మెంట్ ఫిక్సయింది. రేపే అమెరికా ప్రయాణం. అభిమానులందరూ. మీనంబాక్కం విమానాశ్రయంలో ఘనంగా 'ఫేర్‌వెల్'



# ఇద్దరూ విద్వాంసులైతే!




భార్యాభర్తలు ఇద్దరూ విద్వాంసులైతే వారి జీవితం వినోదంగా ఉంటుంది. అంతేకాదు. సమయానుకూలంగా ఒకరినొకరు ఎక సక్కెం చేసుకోవడం జరుగుతుంది. అది పరస్పరం అనిష్టాన్ని సూచించేది కాదు. వినోదానికి మాత్రం అలా చెయ్యడం జరుగుతుంది.

పెద్దిభట్టు భార్య అందకత్తెయే కాని వికారంగా ఉండదు. అయినా, ఆమెను ఉడికించడానికి అతడు ఇలా అన్నాడట:

"తింత్రిణీదళ విశాల లోచనా
నింబ పల్లవ సమానకుంతలా,
మేరు మందర సమాన మధ్యమా
పెద్దిభట్టు గృహిణీ విరాజతే"

పెద్దిభట్టు భార్య కన్నులు చింతాకులంత విశాలములైనవి. కుంతలములు వేప చిగుళ్ల వలె (ఎర్రగా) ఉంటాయి. నడుము మేరు, మందర పర్వతాలను పోలి ఉంటుంది" అని దీని భావం. ఏ స్త్రీకయినా ఇలాటి వర్ణన చిరుకోపాన్నయినా కలిగిస్తుంది. ఇది సర్వసాధారణం. ఆమె వెంటనే ఏమీ అనలేదు. మౌనం వహించి, ఎదురు చెప్పడానికి తగిన సమయాన్ని ఎదురు చూస్తూ ఉండినదట!

ఒకప్పుడు వృద్ధుడైన ఆ పెద్దిభట్టు అద్దంలో తన ముఖాన్ని చూచుకొంటున్నప్పుడు గడ్డంలోని పండు వెంట్రుకలు అందులో ప్రతిబింబించడం చూచి, అతడు వినోదంగా తన ముఖాన్నిలావర్ణించు కున్నాడు.

"పలితాని ముఖేందుకుండలే
శకలానీతి విభా విదూ మహే"

అని శ్లోకంలో మొదటి సగ భాగాన్ని చెప్పాడు.

'ఈ తెల్లని వెంట్రుకలు ముఖచంద్రుని శకలముల వలె ఉన్నవని అను కుంటున్నాము మేము" అని దీని అభిప్రాయం.

అది వింటున్న అతని భార్యకు సమాధానం చెప్పడానికి చక్కని అవకాశం దొరికింది. అందువల్ల ఆమే చిరునవ్వు నవ్వుతూ

"అత ఏవ నిమీల్యతే తరాం
తరుణీ లోచన పద్మ సంతతిః"

మీ ముఖచంద్రుడిలోని శకలా లయినందు వల్లనే వాటిని – ఆ పలిత కేశ ఖండాలను చూచి, యువతీమణుల కన్నులనెడి పద్మములు మూసికొని పోవుచున్నవి- అని దీని అభిప్రాయం.

యువతులకి ముసలి వారి పయి ఇష్టం లేకుండుట స్వభావమే కదా!

దీనికి అతడు ఏమీ అనలేకపోయాడు.

ఆయన భార్యకు- తగిన సమాధానం చెప్పిన సంతృప్తి కలిగింది.

–బులుసు వేంకటరమణయ్య

---

చెప్పేరు మృత్యుంజయుడి తాలూకు నిర్మాతలు, వర్శకులు బంధు మిత్రులూ, శ్రేయోభిలాషులూ అందరూ ఘనంగా వీడ్కోలు చెప్పేరు. మృత్యుంజయుడితో బాటు సులోచనరావు మెడలోను పూలమాలలు వేశారు బొంబే వెళ్ళేందుకు ఫ్లైయిట్ సిద్ధంగా వుంది.

అందరూ మృత్యుంజయుడ్ని ఆశగా చూశారు. మృత్యుంజయుడు ఫ్లైయిట్ కేసి నడిచాడు. సులోచనరావు అనుసరించాడు. అభిమానులు లాంగ్‌లివ్'లు చెబుతున్నారు మృత్యుంజయుడికి సులోచనరావు తన మూత్ర పిండాల దానం చేస్తాడు మృత్యుంజయుడు సంపూర్ణారోగ్యంతో తిరిగి వస్తాడు ఈ విషయం అక్కడున్న వందలాది వేలాది అభిమానులు, బంధు మిత్రులు, నిర్మాత,

## బ్రహ్మ!
## నీ రాత తారుమారు!

పర్శకులకు అందరికీ తెలుసు

కానీ –

మృత్యుంజయుడు తన పుట్టినరోజున తన మూత్ర పిండాలను అభిమానుల కోసం దానం చేయనున్నానని ప్రకటించడం పబ్లిసిటీ స్టంట్ అనీ, భవిష్యత్తులో 'మూత్ర పిండాల మార్పిడి' జరగనుందనీ అందుకని అభిమానుల్ని (మెంటల్‌గా ప్రవోక్) మానసికంగా రెచ్చగొట్టేందుకు మాత్రమే ఆ పబ్లిసిటీ యిచ్చారన్నది ఒక్క మృత్యుంజయుడికి మాత్రమే తెలుసు!

తన నుదుట రాసిన బ్రహ్మ రాతను తారుమారు చేసి, తను సంపూర్ణ ఆరోగ్య వంతుడ్ని ఔతున్నానన్న విజయగర్వంతో భారంగా నిట్టూర్చాడు మృత్యుం జయుడు. మృత్యుంజయుడ్ని బ్రతికించు కొంటు న్నాను నా అభిమాన హీరో ఎప్పుడూ ఆనందంగా ఆరోగ్యంగా వుండాలి. అందుకోసం బ్రహ్మరాతను సైతం తారుమారు చేసి తన మూత్ర పిండాలను దానం చేయగలుగుతున్నాను మృత్యుంజయుడికి సంపూర్ణ ఆరోగ్యాన్ని యివ్వగలుగు తున్నానని సులోచనరావు వేడి నిట్టూర్పు విడిచాడు. అతడి మనసు దూది పిండెల్లా గాలిలో తేలిపోతోంది. ఫ్లైయిట్‌తో బాటు – మృత్యుంజయుడు, సులోచనరావు ఒకర్నొకరు చూసుకొని తృప్తిగా.. నిండు మనసుతో నవ్వుకున్నారు.. .. □

ఆంధ్రపత్రిక పాఠకులకి చక్కటి అవకాశం!



## కళ్యాణవేదిక

ఉచిత సమాచారం



వధూవరుల సమాచారము వుచితంగా ప్రతి బుధవారం ప్రకటిస్తాము.

సమాచారం పంపేవారు ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.

★ వధువు / వరుని తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరినీ కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.

★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు **వుచితంగానే** వాటికి సంబంధించినవారికి నెల రోజులలోపు పంపడం జరుగుతుంది.

★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.

★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని తిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసు గల కవర్లు, లేదా స్టాంపులు జతపర్చకూడదు.

★ ప్రకటనకు ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు దానిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.

★ ఇతర విధమైన వుత్తర ప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.

★ సమాచారము పంపేవారు ఈ దిగువ కూపను పూర్తి చేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.

★ కళ్యాణవేదిక శీర్షిక ద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన వచ్చినది తెలియచేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

### కళ్యాణవేదిక ఉచిత సమాచార కూపను

పేరు... ... ... ... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ... ... ...

... ... ... ... ... ...పిన్‌కోడ్... ... ...

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం.....................



## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ ''ప్రత్యేక'' సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

# హైదరాబాద్ నోట్‌బుక్

## బాలయోగీయ ఆవిష్కరణ:–

ముమ్మడివరం బాలయోగి పేరు నాలుగు దశాబ్దాలుగా దేశ మంతటా మారుమ్రోగింది. ముమ్మడివరం గ్రామం దక్షిణం వైపున ఒక మాలపేట వుంది. ఆ పేటలో కటికదల అనే ఇంటి పేరు గల కుటుంబంలో 1930 అక్టోబర్ 23న జన్మించాడు బాలయోగి. ఆయన తండ్రి శ్రీ గంగయ్య. తల్లి శ్రీమతి రామమ్మ. ఈమె శ్రీ గంగయ్యకు ద్వితీయ భార్య. బాలయోగికి తలిదండ్రులు పెట్టిన పేరు సుబ్బారావు. ఇతని మూడో ఏటనే తల్లి రామమ్మ మరణించింది. కనుక ఇతడు మేనత్త, తర్వాత సవతి తల్లి పెంపకంలో పెరిగాడు. ఇతడు పది సంవత్సరాలు వచ్చేవరకు మామూలు పిల్లలతో కలిసి తిరుగుతూ వుండేవాడు. అక్షరాభ్యాసం గాని, బడికి వెళ్లడం గాని జరుగ లేదు. 1941 నుంచి ఐదేళ్లపాటు పలువురు భూస్వాముల వద్ద పాలేరుగా పని చేశాడు. 1946 జూన్ 22 శనివారం ప్రాతఃకాలం నుంచి తపస్సు ప్రారంభించాడు; బాలయోగిగా ప్రసిద్ధుడయ్యాడు. ముమ్మడివరంలో ఏటా లంకతల్లమ్మ అనే దేవత ఉత్సవాలు జరుగుతూ ఉంటాయి. సుబ్బారావు ఆ ఉత్సవంలో కృష్ణ నారదులున్న ఒక చిత్రపటాన్ని కొనుక్కొని, ఒక సూర్యోదయాన ఒక కొబ్బరి తోటలో ప్రవేశించి ఒక కొబ్బరి చెట్టు నీడలో ఉత్తరాభిముఖంగా కూర్చుని, ఆ పటాన్ని ముందుంచుకొని పూజించి ధ్యాన నిమగ్నుడయ్యాడని తద్‌జ్ఞులు అంటున్నారు. ఆ విధంగా ధ్యాన నిమగ్నుడైన కొంత సేపటికే దేహ స్పృహ లేనంతగా సమాధి స్థితు డయ్యేవాడట. ఆ వేసవి మధ్యాహ్నపు ఎండలో శరీరం నిండా కండ చీమలు పాకుతున్నప్పటికీ, ఏ విధమైన చలనమూ లేకుండా కూర్చుండి పోయాడట. ప్రజలు ఈ దృశ్యానికి ఆశ్చర్య పడ్డారు; తలిదండ్రులు వ్యాకులపడ్డారు. అతనిని ఆ తపస్సు నుంచి మానిపించడానికి అతని తలిదండ్రులు, ప్రజలు ఎంత ప్రయత్నించినా లాభం లేకపోగా, ఒక బలశాలి అయిన యువకుడు బలవంతంగా సుబ్బారావును లేవదీసి తలిదండ్రులకు అప్పగించాడు. కాని సుబ్బారావు కళ్ళు తెరవ లేదు, అన్నం ముట్ట లేదు; తపస్సమాధిలోనే వున్నాడు. ఇంత చిన్నవాడు ఘోరమైన తపస్సు ప్రారంభించడం ఆ ప్రాంతమంతా ప్రచారమై, అతనిని దర్శించడానికి జనం తండోపతండాలుగా రాసాగింది. తండ్రి శ్రీ గంగయ్య ఆ తీర్థ ప్రజకు తట్టుకోలేక అక్కడికి కొంత దూరంలో పంట కాలవ పక్కన సర్కారుపుంతలో ఒక పర్ణశాల వేయవలసి వచ్చింది. సుబ్బారావు లేచి వెళ్లి ఆ పర్ణశాల మధ్యలో సిద్ధాసనం వేసుకొని తపస్సు కొనసాగించాడు. ఆ పర్ణశాలే తర్వాత ఒక మందిరంగాను, పుణ్యక్షేత్రంగాను మారింది. బాలయోగి సుబ్బారావు తపస్సు ప్రారంభించిన తర్వాత కొన్నాళ్లు పాలు పుచ్చుకొనే వాడు. నెల తర్వాత అది కూడ మానేశాడు. అందువల్ల శరీర ధర్మాలు కూడ నిలిచి పోయాయి. అతడు కూర్చున్న స్థలం నుంచి కదిలేవాడు కాడు. బాలయోగి తపస్సు ప్రారంభించిన మూడేళ్ల వరకు అందరూ ఆయన్ను ఎప్పుడుబడితే అప్పుడు దర్శించు కొనేవారు. దాని వల్ల తరచు తపోభంగం కలుగుతూ వుండేది. తపస్సు నిరంతరాయంగా జరుగడానికి ఆ కుటీరం తలుపులు, ఆయన ఆజ్ఞ ప్రకారం మూసివేయ బడినాయి. కాని, ఏడాదికి ఒకసారైనా దర్శనానికి వీలు కలిగించాలని ప్రజలు కోరగా, ప్రతి శివరాత్రినాడు వెలుపలికి వచ్చి దర్శన మివ్వడానికి ఆయన ఒప్పుకొన్నారు. 1949 ఫిబ్రవరి 26వ తేదీన ప్రారంభమైన అట్టి శివరాత్రి దర్శనాలు 1985 శివరాత్రి వరకు అవిచ్ఛిన్నంగా జరిగాయి. లక్షల కొలది భక్తులు ఆయన దర్శనానికి దేశం నాలుగు చెరగుల నుంచీ రావడం, ఒక ఎత్తైన వేదికపై ఆయన ఆసీనుడై దర్శన మివ్వడం, యాత్రికులకు తగిన సౌకర్యాలు కల్పించడం పరిపాటి అయింది. బాలయోగి తపస్సు ప్రారంభించిన తొలి రోజుల్లో రహస్యంగా ఆహారం తీసుకొంటున్నాడేమో అనే అనుమానంతో వివిధ రాజకీయ పక్షాలూ, ప్రభుత్వమూ కూడ ఎన్నో పరిశీలనలు జరిపాయి. కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిన తర్వాత అప్పటి ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం మంత్రి శ్రీ కళావెంకటరావు ఆ ప్రాంతం వాడు కావడం వల్ల ప్రత్యేకంగా పరిశీలించి, బాలయోగి ఏమీ తినకుండా గాఢమైన తపస్సమాధిలో వున్నాడనడంలో సందేహం లేదని ప్రకటించారు. బాలయోగి 1985 జూలై 20న సిద్ధి పొందారు. ఆయన తపస్సు విషయంలాగే మరణం విషయంలోను ఎందరో సంశయాలు వెల్లడించారు. బాలయోగి అంత త్వరగా మరణిస్తాడని ఎవ్వరూ భావించలేదు. ఆయన సమాధి నుంచి వచ్చి సంఘానికి నాయకత్వం వహిస్తాడని పలువురు భావించారు. అలాటి వారిలో మిత్రులు బోయి భీమన్నగారొకరు. బాలయోగి మృతిపట్ల తమ ఆవేదనను, ఆర్తిని ఉపశమింప జేసుకోవడానికి బాలయోగీయం అనే ఈ కావ్యం రచించారు. కులం, మతం, వర్గం, అస్పృశ్యత, సమైక్యం, వేదాంతం, యోగం, విశ్వవిచారణ, హేతువాదం మేధావిత మొదలైన వాటిని గురించి తన అభిప్రాయాలు వెల్లడించారు. 52 పుటల విపుల పీఠికలో బ్రాహ్మణత్వ యోగాదులను గురించి విపులంగా చర్చించారు. బాలభవుడు, వ్యాసావాసం, పాలేరుతనం, కవీ – యోగి, నవయుగాద్భుతం, అసమధార, శివరాత్రి దర్శనాలు, శంకాజీవులు, హేతువాదం, నాటకీకరణ, దీక్షాసిద్ధి, సంధ్యాదీపం, కుహువు, చ్యుతధర్మం, నాగదర్శనం, కంచెలు–సంకెళ్ళు, మేధామాధవం, – అనే పదిహేడు చిన్న చిన్న ప్రకరణాలున్న ఈ బాలయోగీయ కావ్యం ఆవిష్కరణ సుఖేలా, శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, విశ్వసాహితి, భీమన్న సాహితీనిధి సంస్థల యాజమాన్యాన అక్టోబర్ 7వ తేదీ సాయంకాలం శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో జరిగింది. డాక్టర్ జె. బాపురెడ్డి ఐ. ఎ. ఎస్. అధ్యక్షత వహించారు. జస్టిస్ శ్రీ కె. పున్నయ్య సభను ప్రారంభించారు. జస్టిస్. కె. రామస్వామి ముఖ్య అతిథిగా వున్నారు. తెలుగు విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ తూమాటి దోణప్ప కావ్యాన్ని ఆవిష్కరించారు. డాక్టర్ భీమన్న ఈ కావ్యాన్ని రాష్ట్ర ప్రభుత్వ పబ్లిక్ సర్వీస్ కమిషన్ మాజీ సభ్యులు, ప్రముఖ ఆర్య సమాజ నాయకులు డాక్టర్ టి. వి. నారాయణకు అంకితమిచ్చారు. రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శి శ్రీ కె. ఎస్. ఆర్. మూర్తి (ఐ. ఎ. ఎస్.) కృతి కర్తను సత్కరించారు. డాక్టర్ పి. యశోదా రెడ్డి, డాక్టర్ పోరంకి దక్షిణామూర్తి, డాక్టర్ విజయభారతి, శ్రీయుతులు కె. కలివేలు, పోతుకూచి సాంబశివరావు, ఎల్లోరా, శ్రీమతి మాచిరాజు సావిత్రి (యు ఎస్ ఎ) మున్నగువారు కవి, కావ్య గుణాలు తెలుపుతూ సారస్వత శుభాకాంక్షలు తెలిపారు. శ్రీ భీమన్నది సమన్వయ మతమని డాక్టర్ బాపురెడ్డి, ఇది భీమోపనిషత్తని, భీమన్నగారి సిద్ధాంతాలు కొన్ని స్థాపిత ధర్మానుసారులు కావని, అయినా పరిశీలింప దగినవని డాక్టర్ యశోదారెడ్డి, శ్రీ భీమన్న సాహిత్య బంధువు మాత్రమే కాక ఆయన సతీమణి ద్వారా ఆత్మబంధువయ్యారని శ్రీ ఎల్లోరా అన్నారు. డాక్టర్ పోరంకి దక్షిణామూర్తి యోగాన్ని గురించి, పరమ హంస 'యోగానంద' గురించి ప్రసంగించి, ఈ కావ్యంలో యోగ విషయాలు నూతన పద్ధతితో చర్చించ బడినవన్నారు. డాక్టర్ భీమన్న వేదమతంలో పూర్తిగా విశ్వాసమున్నవారు.

> కులములెన్నియున్న కులతత్త్వ మెంతున్న
> అంటు సొంటు గోడలడ్డమున్న
> జ్ఞానియైన యెవని నైనను పూజించు
> విశ్వ దృష్టిగలది వేదజాతి.(పుట–6)

అని గట్టిగా చెప్పారు. నిజం. వేదకాలం నుంచి నిన్న మొన్నటి వరకు భారత సంస్కృతి చరిత్రను తిరగవేస్తే ఈ వాస్తవం స్పష్టమవుతుంది. మన మహాజ్ఞానులు, మహాయోగులు భీమన్న గారన్నట్టు అస్పష్ట జనన చరిత్ర గలవారే. వారి జ్ఞానాన్నే గౌరవించింది సంఘం. ఆయనే అన్నట్టు వేదోపనిషన్మతాన్ని అనుసరిస్తేనే కుల వ్యవస్థ కూలిపోతుందని నా నమ్మకం. ఈ ఆవిష్కరణోత్సవం శ్రీమతి హైమవతి ప్రార్థనతో ప్రారంభమైంది, శ్రీ వేణు స్వాగతం చెప్పారు. చివరని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహరావు వందన సమర్పణ చేశారు. మిత్రులు భీమన్న ఎప్పుడూ ఉత్తమ కావ్యాలు రచిస్తున్నారు. ఆ పరంపరలో ఇదొక ఉత్తమ కావ్యం.

## ఉపశ్రుతి :–

సార్, సార్, మీకెన్నేళ్ళు – అనడిగింది ఒక విద్యార్థిని . డెబ్బై నాలుగు – అన్నాను. ఎలా బతికారుసార్ అన్నేళ్ళు – అని మరల అడిగింది. ఎందుకమ్మా? – అన్నాను. ఈ పుస్తకాల మోత, నోట్‌పుస్తకాల వేటలో అన్నేళ్ళు వుంటామా? – అని అన్నది విచారంతో.

– తిరుమల రామచంద్ర

# ఉత్తరాలు......

(7 వ పేజీ తరువాయి)

## కథలు

ఈ వారం 3-9అక్టోబర్ 86 అందాల రాణి భానుప్రియ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా బాగుంది 'బహుమతి', 'కొన్ని కథలింతే', అంతర్యం కథలు చాలా బాగున్నాయి ఆకర్షించదగ్గ కథలు ప్రచురించారు ధన్యవాదాలు

- సాహుకార బిల్లేశ్వరరావు, నౌపడా

## ప్రత్యేకత

3-9, అక్టోబర్ '86 సంచిక ముఖచిత్రం బాగుంది కథలన్ని బాగున్నాయి విజయశాంతి సమాధానాలు ఒక మాదిరిగా వున్నాయి 'న్యూఢిల్లీ లేఖ - పత్రికకే ఒక ప్రత్యేకంగా చెప్పుకోవచ్చు!

- యన్ కనకారావు, పర్లాకిమిడి

## ఇల్లాళ్ళూ ఆలోచించండి!

ఆవిరిపై వంటకాలు అన్న శీర్షికతో డాక్టరుగారు వ్రాసిన వ్యాసంలో చాలా చక్కని ఆరోగ్య సూత్రాలను- మడి బట్ట విశిష్టతను తెలుపుతూ వినాయకచవితి ప్రత్యేక సంచికలో ఇల్లాళ్ళపై ప్రత్యేకంగా ప్రచురించిన వ్యాసం చాలా బాగుంది నేడు అల్ట్రా మోడరన్ ఫ్యాషనంటూ అశుచిగా వంటచెయ్యడం కల్చర్ పేరుతో ఎంగిలి తిండ తినడం ఇలాంటివి ఎక్కువ కనిపిస్తున్నాయి కాని ఈ వ్యాసం చదవడంవల్ల ఆధునిక ఇల్లాళ్ళు ఆలోచించి జాగ్రత్త వహించాలనే అభిప్రాయాన్ని కల్గించే విధంగా డాక్టరుగారు ఆ వ్యాసాన్ని మలిచినందుకు మా అభినందనలు అదే విధంగా వివిధ అంశాలపై చక్కని శీర్షికలు, కథలు అందిస్తున్న సచిత్ర వారపత్రికకు మా శుభాకాంక్షలు

- కె వాణీప్రభాకరి, తణుకు





## అవీ – ఇవీ – అన్నీ.

### శ్రీ వి. ఎస్. అవధాని కాలధర్మం

ప్రముఖ రచయిత, పత్రికా రచయిత శ్రీ వి ఎస్ అవధాని అక్టోబరు 10 ఉదయం విజయవాడలో మరణించారు. ఈయన వయస్సు 68 సంవత్సరాలు శ్రీ అవధాని తొమ్మిది సంవత్సరాల పాటు ఆంధ్ర పత్రికలో పని చేసిన తర్వాత 1960లో బ్రిటిష్ ఇన్‌ఫర్‌మేషన్ సర్వీస్‌లో చేరి 1974లో పదవీ విరమణ అనంతరం విజయవాడలో స్థిరపడ్డారు ఈయన అనేకానేక వ్యాసాలు, విమర్శలు, కథలు, నవలలు రచించారు. కొంతకాలంగా గుండెకి సంబంధించిన రుగ్మతతో బాధపడుతూ ఉన్నారు ఈయనకి భార్య, కుమారుడు, ముగ్గురు కుమార్తెలు ఉన్నారు

### ఎఱ్ఱన పీఠం

#### సిద్ధాంత వ్యాసముల

ఒంగోలులోని ఎఱ్ఱన పీఠం ప్రపస్తుత ... రచనము – ఎఱ్ఱన, పోతనల ... పరిశీలనము" అనే అంశంపై సిద్ధాంత వ్యాసాల పోటీని నిర్వహిస్తున్నది ఉత్తమ వ్యాసానికి ... వేలు నగదు బహుమతి లభిస్తుంది అరటావు సైజులో 150 పేజీలు మించని సిద్ధాంత వ్యాసాలు మూడు ప్రతులను శ్రీ ధారా రామనాథశాస్త్రి, కార్యదర్శి, ఎఱ్ఱన పీఠం, మామిడిపాలెం, ఒంగోలు – 523002, అన్న చిరునామాకు 1987 ఫిబ్రవరి 28 వ తేదిలోగా రిజిస్టర్డ్ పోస్టులో పంపాలి




*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S. Radhakrishna; Phones - Business 61247, 61248, Editorial. 75667*

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



యస్. కనకారావు, పర్లాకిమిడి

ఉత్తమాభిరుచులు కలిగిన నటి ఉత్తమనటి కాగలదా?

నటికి ఉత్తమ అభిరుచులుంటే చాలదు చక్కని పాత్రలు రావాలి. వాటిని సమర్థవంతంగా పోషించి మీ చేత "శహబాష్" అన్పించుకుంటేనే ఉత్తమ నటి కాగల్గుతుంది.

పి. భీమారావు, శ్రీకాకుళం

పేదవాని ప్రేమకు విలువ లేదంటాను. మీరేమంటారు?

ప్రేమకు ధనిక – పేద అనే వ్యత్యాసం లేదని మాత్రం చెప్పగలను.

నాగండ్ల, అమ్ముపాలెం

మీరు 'ఆంధ్రసచిత్ర వారపత్రిక'కు ఒక సీరియల్ వ్రాయాలని నా కోరిక రాస్తారా? లేదా?

వ్రాసే సమయం.... సందర్భం లభించినప్పుడు తప్పకుండా రాస్తాను. మీ సూచనకు నా ధన్యవాదాలు!

హెచ్. యస్. కుమార్, అనంతపురం

పట్టువదలని విక్రమార్కుడిలా మీకు ప్రశ్నలు వేస్తుంటే బహుమతి లభిస్తుందా?

పట్టువదలని విక్రమార్కుడి లాగానే ఆలోచనాత్మకంగా అందర్నీ ఆకర్షించే ప్రశ్న వేస్తే దానికి తప్పకుండా నా కలర్ ఫోటో లభిస్తుంది.

డి. వి. సన్నయ్య, కట్టుబోలు; జి. సుధాకర్, శృంగవరపుకోట

మీ దృష్టిలో ఏ రకమైన పాత్రల్ని వేయాలని వుంది?

అందరూ మెచ్చుకునే పాత్రలు.

ఎ. హెచ్. చంద్రమౌళి, నల్గొండ

నాయికగా చిత్రసీమలో స్థిరపడిన మీరు జీవితాంతం నటిగానే మీ జీవితాన్ని కొనసాగిస్తారా?

చిత్ర విచిత్రమైన యీ చిత్ర రంగంలో ఏ నిమిషంలో ఏం జరుగుతుందో ఎలా చెప్పగలం?

## ఉత్తమ ప్రశ్న

వి. సుశీల, విశాఖపట్నం

ఈ నాటి నాయికలు.... నాటి నాయికల కంటె పై స్థాయిలో ఉన్నారా యింకా దిగువనే వున్నారా?

"పాతొక రోత.... కొత్తొక వింత" అని అంటుంటారు. అయితే నాటి సినిమా పరిశ్రమకి నేటి సినీ పరిశ్రమకు ఎన్నో విషయాల్లో మరెన్నో వ్యత్యాసాలు వున్నాయి. సాంకేతికంగా నాటికన్నా నేడు ఎంతో ఉన్నత స్థాయిలో వుంది చిత్ర పరిశ్రమ. మారుతున్న కాలానికి అనువుగా అన్నీ మారాయి.... మారుతున్నాయి. నాయికలు విషయంలో కూడా అంతే! ఆ రోజుల్లో ఆ నాటి నాయికలు గొప్ప స్థాయిలో వెలిగారు. ఈనాడు యిప్పుడున్న స్థాయిలో యీ నాటి నాయికలు వెలుగుతున్నారు.

యన్. పద్మజ, విజయనగరం

అజ్ఞానంలో వున్న స్త్రీలు మీరు నటించిన సినిమాలు చూసి చైతన్యవంతులు అవుతున్నారు.

నిజంగానా! ఇంతకన్నా ఆనందం మరేముంటుంది!!

కె జనార్దన్, ఖమ్మం

ఈ దేశం మనకేం యిస్తుందని అనుకునే వారందరూ మీరు నటించిన సందేశాత్మక చిత్రాలు చూసైనా– 'ఈ దేశానికి మనమేం చేస్తున్నాము" అని ఆలోచిస్తే బాగుంటుంది కదండీ?

మీ అభిప్రాయంతో తప్పక ఏకీభవిస్తాను!

కొప్పరపు నాగేశ్వరరావు, నరసరావుపేట

రేపటి పౌరులు' చిత్రంలో మీరు నటించిన పాత్రవలన నేటి సమాజంలో గొప్ప మార్పు వస్తుందని నా అభిప్రాయం నా అభిప్రాయంతో మీరు ఏకీబవిస్తారా?

తప్పకుండా!

యం.యస్. బాలసుబ్రహ్మణ్యం, విజయవాడ

ధర్మరాజు పరిపాలనలో ధర్మం నాలుగు పాదాల నడిచేది అన్నారు మరిప్పుడు ధర్మం ఎన్ని పాదాల మీద నడుస్తుందంటారు?

తెలుగు దేశంలో తెలుగు గద్దమీద వున్న మీరు ధర్మం ఎన్ని పాదాలతో నడుస్తుందో తెలుసుకోలేకపోతున్నందుకు చాలా బాధగా వుంది. భారతం కాలం నాటి ధర్మరాజు లాంటివారు నేడు ఎక్కడో ఓ చోట వుండి వున్నారు కాబట్టే యీ మాత్రమైనా ధర్మం.... న్యాయం నిలబడి వుందని అంటాను.

యస్. మధుమోహనరావు, పూండి

ఆరుకోట్ల ప్రేక్షకాంధ్రుల అభిమానాన్ని పొందారు కదా! మీ విజయ రహస్యం ఏమిటి?'

ప్రేక్షకుల అభిమానాన్ని పొందానని మీరే అన్నారు కదా! ఇంతకన్నా మించిన విజయ రహస్యం ఏముంటుంది? | □



సత్యనారాయణ
సమర్పించు



రమా ఫిలింస్

# అడవి రాజా

దర్శకత్వం
**కె.మురళీమోహనరావు**

నిర్మాత
**కె.నాగేశ్వరరావు**

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన అందాల నటి జయసుధ. ఎన్నోరకాల వెరైటీ పాత్రలలో నటించిన తను, "లక్ష్మణ రేఖ"లో దగాపడిన యువతిగా, "ఆమె కథ" చిత్రంలో పిచ్చిదానిగా, "గృహప్రవేశం" చిత్రంలో భర్తను తీర్చిదిద్దిన ఆదర్శ గృహిణిగా, "ప్రేమాభిషేకం"లో వేశ్యగా, "సంసారం - సంతానం" చిత్రంలో పిల్లలు లేని గొడ్రాలిగా, "రాజా వెడలె" చిత్రంలో ఆధునిక



శృంగార యువతిగా ఇలా అనేక విధమైన ఎన్నో పాత్రలలో జీవించి నాలుగోవతరం కథానాయికల లిస్టులో అగ్రస్థానంలో ఉండనడానికి తన అవార్డులే తార్కాణాలుగా ఆరు కోట్ల ఆంధ్రుల హృదయాలలో నిలిచి పోయింది. ఈ మధ్య నటించిన "ధర్మపీఠం దద్దరిల్లింది" చిత్రంలో తల్లిగా నట జీవితంలో తన విశ్వరూపాన్ని ప్రదర్శించింది. ఇదే విధంగా నా అభిమాన నటి ఇంకెన్నో వెరైటీ పాత్రలు పోషించి నేషనల్ అవార్డు తీసుకోవాలనేదే నా కోరిక.

– జె. కోదండనాయకి, మత్రాభస్తి,
కొత్తగూడెం

★ ★ ★

హీరో కృష్ణ అంటే నాకు ఎంతో ఇష్టం. చిన్నప్పటి నుండి నేటివరకు ఆయనంటే ప్రత్యేకమయిన అభిమానం. ముఖ్యంగా ఆయన డాషింగ్, డేరింగ్ నేచర్ నన్నెంతో ఆకట్టుకుంది. కష్ట కాలంలో ఉన్నవాళ్ళను ఆదుకోవడం, బ్రతకటం, బ్రతకనివ్వడం, ప్రక్కవాళ్ళను అణగదొక్కకుండా,



సాటి నటులను వ్యసనాలపాలు చేయకుండా వాళ్ళను పైకి తేవడానికి కృషి చెయ్యడం లాంటి విషయాలు నా కెంతో ఇష్టం. నిరంకుశత్వంను ఎదురించి నిలవటంలో ఆయనకు ఆయనే సాటి. ఇలాంటి వారు ఉండబట్టే నిరంకుశత్వం మనల్ని పామై కాటెయ్యకుండా కేవలం పడగ విప్పి మాత్రమే ఉన్నది.

రాష్ట్రం ఆపదల్లో ఉన్నప్పుడు ఆయన దాన గుణం మరువలేనిది.

రచయిత నవుతున్న నేను తప్పకుండా ఆయన మీద ఒక మంచి నవల వ్రాస్తాను. అది ఆయనకు అంకితం ఇస్తాను. పై విధంగా నా అభిమానాన్ని వ్యక్తం చేస్తాను.

– జాగృతీ కిరణ్, ధరమ్‌పేట, నాగపూర్

★ ★ ★

అపూర్వ నటనా కౌశలంతో సినీరంగ సామ్రాజ్యానికి మేటి అగ్రనటుడిగా ఏటికి ఎదురీద గల గుండె ధైర్యంతో 64 కళలను అరచేతిలో పెట్టుకొని చలన చిత్ర రంగంలో తన సాహసోపేతమయిన ఫైట్స్‌తో, పాటకు లయబద్ధంగా వేసే స్టెప్స్‌తో ఒక స్పీడును కలుగచేసి అద్భుతంగా నటిస్తూ ఆల్ రౌండ్ హీరోగా ఆరుకోట్ల ఆంధ్రుల అభినందనలు అందుకొంటూ చలన చిత్ర సీమలో ప్రజల హృదయాలలో చిరకాలం నిలిచిపోయే "చిరంజీవి"గా శాశ్వత స్థానాన్ని సంపాదించుకొని, "అడవి దొంగ"గా అందులో విజృంభించి, "విజేత"గా వీరవిహారం చేసి, "కొండవీటి



రాజా"గా సరిక్రొత్త రికార్డులను సృష్టించి వెలుగొందుతున్న మా ప్రియతమ అన్నగారు చిరంజీవి గారు. అవార్డ్సు విన్నర్, రికార్డ్సు రన్నర్. ఈ చిరంజీవి చిరకాలం చిరంజీవిగానే వుండాలని నా యొక్క అభిలాష.

– సంకురుభుక్త జోగారావు,
భీమునిపట్నం

★ ★ ★

నా అభిమాన తార జయప్రద. నటనలో చతురతలో అభినయంలో పొరపాటు రాని నటి. దుఃఖంలో, చిలిపితనములో, గర్వంలో... ప్రేయసిగా, భార్యగా, తల్లిగా, అక్కగా, చెల్లిగా ఒక్కటేమిటి నవరసాల కథానాయిక జయప్రద నటనంటే నేనెంతో ఇష్టపడతాను. జయప్రద నటించిన హిందీ, తెలుగు చిత్రాలు ఎన్నో చూసాను. కొలది కాలములోనే అగ్ర నటీమణులలో ఒకర్తుగా పేరు తెచ్చుకున్నారు. తెలుగులో "సీతారాములు" చిత్రం, హిందీలో "స్వర్గ్‌సే సుందర్". ఈ చిత్రాలు చూసి నేను జయప్రద అభిమాని నయ్యాను. ఆమె తెలుగు, హిందీ అభిమానులకు "ఆరాధ్య దేవత". అన్నీ కలబోసి చేసిన అందాల సుందరి జయప్రద.

కాని ఈ మధ్య ఆమె తెలుగు సినిమాలలో అరుదుగా కన్పించుతోంది. డాన్స్, డ్యూయెట్స్‌కు పరిమితం కాకుండా వెరైటీ పాత్రలలో నిండైన వస్త్రధారణతో అభిమానుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచేటట్టు నటించాలని, నటించి మెప్పించ



గలరని నాయొక్క చిన్న కోరిక.

– మర్రి కిషాన్, మస్కాట్

★ ★ ★

ఈమధ్య వచ్చిన హీరోలు అందరూ అంచెలంచెలుగా పైకి వచ్చి, కీర్తి ప్రతిష్టలు సంపాదించుకున్న వారే! కాని, నా అభిమాన కథానాయకుడు వెంకటేష్ మాత్రం ఏవిధమైన స్టైల్‌గాని, ఇమేజ్ గాని, నాటకానుభవం గాని లేకుండ, కేవలం పట్టుదల, కృషితో పైకి వచ్చి తొలి చిత్రం "కలియుగ పాండవులు"లో తన నటనా వైదుష్యాన్ని ప్రదర్శించి అఖిలాంధ్ర ప్రేక్షకుల హృదయాన సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్న ఘనుడు. ఒక ప్రసిద్ధ నిర్మాత కొడుకు తొలి చిత్రం తోనే పేరు ప్రతిష్టలు తెచ్చుకోవడమనేది ప్రశంసించ దగ్గ విషయం.

వెంకటేష్ "కలియుగ పాండవులు" చిత్రంలో కేవలం ఫైట్స్, స్టెప్స్ బాగా చేయడమే కాకుండ, డ్రామా సన్నివేశంలో కూడ నేటి సీనియర్ నటులకు ఏమాత్రం తీసి పోలేదని నిరూపించు కున్నారు. ఇదే



విధంగా రాబోవు "బ్రహ్మ రుద్రులు" "అజేయుడు" చిత్రాలలో నటించి ముమ్ముందు 'రాశి'కి ప్రాధాన్యత ఇవ్వకుండ 'వాసి' కి ప్రాధాన్యత ఇవ్వ వలెనని అతని అభిమానిగా మనసార కోరుకుంటున్నాను.

-మాడ భూషి నరసింహాచారి,
నర్సాపురం

అందము, టాలెంట్ సమపాళ్ళలో మేళవించిన నటి జయప్రద అంటే నాకు చాలా అభిమానం. సిరిసిరి మువ్వ, భద్రకాళి, మాంగల్యానికి మరో ముడి, అంతులేని కథ మొదలైన చిత్రాలలో ఆమె నటన శిఖరాగ్ర స్థాయిని అందుకుంది. సీతారాములు, మేఘ సందేశం, సాగర సంగమం మొదలైన చిత్రాలు జయప్రదలో అణగి ఉన్న 'మహానటి'ని వెలుగులోకి తెచ్చాయి. ఈ మధ్య



జయప్రద నటించిన (హిందీ) సంజోగ్, స్వర్గ్‌సే సుందర్ చిత్రాలు ఆమెను మహానటిగా జాతీయ స్థాయిలో నిలబెట్టాయి. ఆమె చిరకాల వాంఛ అయిన జాతీయ అవార్డు ఈ సం. తప్పకుండా రావాలని, అందుకు అర్హత గల చిత్రాలలోనే ఆమె నటించాలని కోరుకుంటున్నాను. అది తప్పకుండా తెలుగు చిత్రం అవుతుందని ఆశిస్తున్నాను.

-పి. వి. భాస్కరరావు,
గాంధీనగర్, ఏలూరు

★ ★ ★

యావద్భారత దేశమే గర్వించ తగ్గనటుడు కమల్ హాసన్ నా అభిమాన నటుడు. మరో చరిత్ర నుండి స్వాతిముత్యం వరకు ఆయన నటించిన చిత్రాలు కళామ తల్లికి తలమానికాలు. వాచకంలో గాని అభినయంలోగాని ఏ భాషలోనైన నటించి మెప్పించగల ఆ నటునికి ఏ నటుడు సాటిరాడనుట అతిశయోక్తి కాదు. విభిన్న భాషలలో విభిన్న పాత్రలలో నటించి నటుడన్న పదానికి అర్థం చెప్పిన నటుడు కమల్ – కమల్ ఏ పాత్రలో నటించడు. జీవిస్తాడు. కాని ఇంత ప్రజ్ఞ కలిగిన నటుడికి తెలుగులో అనువాద చిత్రాలు రావడం దురదృష్ట



కరం. అయినా అప్పుడప్పుడు ఓ ఆణిముత్యం లాంటి "స్వాతిముత్యం", "సాగర సంగమం" వంటివి విడుదలై మా వంటి అభిమానులను సంతృప్తి పరుస్తుంటాయి. కమల్‌హాసన్ గారు కథాప్రాధాన్యం గల ఇట్టి చిత్రాలలో నటించి మమ్ములను ఆనందపరుస్తారని నా మనవి.

-శేఖరమంతి శంకర్, అనకాపల్లి

నా అభిమాన యువనటుడు యాంగ్రీ యంగ్ మాన్, యాక్షన్‌కింగ్ మరియు కరాటే కింగ్ "అర్జున్". నేను "ప్రేమకు సవాల్" చిత్రం ద్వారా "అర్జున్" అభిమాని నయ్యాను. "అర్జున్" లోని నటనను యువకులు మాత్రం అభిమానిస్తున్నారు. కానీ, పెద్దవారు అంతగా అభిమానించడం లేదు. అందువలన పిన్నలు, పెద్దలు అందరూ అఖిలాంధ్ర ప్రజానీకమంతా మెచ్చే విధముగా తన నటనను వృద్ధి పరచుకొనగలడని ఆశిస్తున్నాను. అర్జున్ "మాపల్లెలో గోపాలుడు" చిత్రం ద్వారా తన ఇమేజ్‌ను పెంచుకున్నాడు. ఇంకా ఇమేజ్‌ను పెంచే వెరైటీ చిత్రాలలో నటించాలని, తన నటన



ప్రేక్షక హృదయాలలో చెరగని ముద్రగా ఉండిపోవాలని అభిమానిగా ఆశిస్తున్నాను.

-యన్. శరత్‌బాబు, విస్సన్నపేట

★ ★ ★

ఆరున్నర కోట్ల ఆంధ్రుల అభిమాన నటి సూపర్ స్టార్ విజయశాంతి నా అభిమాన నటి. ఆమె అంటే నాకు చాలా యిష్టం. శ్రావణ సంధ్య చిత్రంలో ఆదర్శభావాలు గల వ్యక్తిగా జీవించి అరుణ కిరణంలా వెలుగొందుతూ ప్రతి ఒక్కరిని రేపటి పౌరులుగా రూపు దిద్దుతూ దుర్మార్గులను, రౌడీలను అగ్నిపర్వతంతో తుద ముట్టించి ఝాన్సీగా అఖిలాంధ్ర ప్రేక్షక హృదయాలలోనూ శాశ్వత స్థానాన్ని ఆక్రమించి, అందరి ప్రశంసలు పొంది ఎన్నో రికార్డులు సృష్టించి



సావిత్రి, వాణిశ్రీ, జయసుధల వారసురాలై బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను ఆకర్షించే అందం, ఆకర్షణ, నటనా చాతుర్యం గల అందాల తార– కుమారి శాంతిగారికి నాదొక చిన్న మనవి. సృష్టిలో ఎన్ని పువ్వులున్నను దేవుని పూజకు నోచుకున్నవి కొన్ని పువ్వులు మాత్రమే. అట్లాగే సినీ స్థాయిలో ఎంత మంది హీరోయిన్‌లు ఉన్ననూ ప్రతి సంవత్సరం నా అందాల అభిమాన తార శాంతిగారే ఉత్తమనటి అవార్డులు అందుకోవాలని నా కోరిక, మనవి.

-మండా విజయలక్ష్మి, అరసవిల్లి,
(శ్రీకాకుళం)

అందాల తార రజని నా అభిమాన తార. తమిళరంగం నుండీ మన తెలుగు రంగానికి వచ్చి తన అసమాన నటనా కౌసల్యంతో ఆంధ్రుల అభిమానానికి పాత్రురాలైన రజని ముున్ముందు వైవిధ్యమున్న పాత్రలలో నటించాలని కోరిక. అనతికాలంలోనే అగ్రనటుల ప్రక్కన కథానాయికగా నటిస్తూ అందర్నీ మెప్పిస్తుంది. "బ్రహ్మముడి" చిత్రంతోనే తనకూ తెలుగు చలన చిత్ర రంగానికి



బ్రహ్మముడి వేసుకొంది. తను నటించిన చిత్రాలలో తన పాత్ర మేరకు (జీవించి) నటిస్తుంది.

నా అభిమానాన్నే కాక అనేక ఆంధ్రుల అభిమానాన్ని చూరగొన్న ఈ తార హిందీ చిత్రాలకు వెళ్ళకుండా తెలుగు వారినే ఆనంద పరుస్తుండాలన్నది నా అభిప్రాయం.

హీరోయిన్ ప్రాముఖ్యత కల్గిన చిత్రాలు చేస్తే చూడాలని ఆశ. ముందు ముందు "సూపర్‌స్టార్" కాగలదని నా అభిప్రాయం. మూస పాత్రలు పోషించవద్దని మనవి.

ఈ మధ్య రజని నటించిన "ఆదపడుచు" లో మొదటి పాటలో దుస్తులు, భంగిమలు బాగోలేదు. దయచేసి అటువంటివి చేయవద్దు....!

–ఐ. రామారావు, ఆసిఫ్ నగర్,
హైదరాబాద్

★ ★ ★

సినీ నీలాకాశంలో మెరిసిన నూతన నటుడు "వెంకటేష్". కలియుగ పాండవులు చిత్రం ద్వారా సినీ పరిశ్రమలో అడుగు పెట్టిన యంగ్ అండ్ డేరింగ్ "విజయ్" అపూర్వ నటనకు కలియుగ పాండవులు ఒక నిదర్శనము. వెంకటేష్ చిత్రాలతో యింకా ఉన్నత స్థాయికి రావాలంటే ఒకే తరహా పాత్ర



నటించకుండా, విభిన్న పాత్రలు నటించవలసిందిగా కోరుచున్నాము. త్వరలో ప్రముఖ నటుల స్థాయికి చేరగలరని, వెంకటేష్ తదుపరి చిత్రము బ్రహ్మరుద్రులు విజయవంతం కావాలని కోరుచున్నాను.

-ఎం. రామాంజనేయులు, ఠాకూర్‌నగర్,
కర్నూలు □



"గురుబ్రహ్మ"లో శారద, అక్కినేని నాగేశ్వరరావు

# సినిమా విశేషాలు

—జి.వి.జి.

## కృష్ణతో కోడి రామకృష్ణ దర్శకత్వంలో "దొంగోడొచ్చాడు"

"సరదాగా నవ్వించే చిత్రం. అంతర్లీనంగా ఫామిలీ డ్రామా కూడా ఉంటుంది" అన్నారు ఎన్. రామలింగేశ్వరరావు. ఈయన సమర్పించే శ్రీ మూవీస్ వారి పై చిత్రంలో కృష్ణ, రాధ, గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, రాజా, జీవా, జయంతి, చిత్ర, సుమిత్ర పాత్రధారులు. ఎం. శ్రీనివాస చక్రవర్తి కథకు సత్యానంద్ సంభాషణలకర్త. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ. రామచంద్రసింగ్ శిల్పం, సలీమ్ నృత్యాలు, సాహుల్ సాహసాలు, కె. అమరేశ్వరరావు సంయుక్త దర్శకత్వం, సత్యం– నాగేశ్వరరావు కూర్పు; బి. ఎం. రాము– గోవిందు నిర్వహణ, ఎన్. ఎస్. రెడ్డి సహకార దర్శకత్వంతో ఎన్. ఎ. ప్రసాద్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. ఘట్టమనేని విజయలక్ష్మి, పెమ్మసాని జనార్ధనరావులు నిర్మాతలు. "అక్టోబర్ నుంచి డిసెంబర్ వరకు ప్రతినెలా 1-10 తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే కోడి రామకృష్ణ.

## బందెల ఈశ్వరరావు దర్శకత్వంలో "ఆణిముత్యం"

"విలన్‌గా ఎడిటర్ వి. సి. మోహన్‌ను, వాంప్‌గా అనంతలక్ష్మి అనే యువతిని, మరో ముఖ్యమైన పాత్రలో రజనీష్ అనే యువకుడ్ని పరిచయం చేస్తున్నాం. నవంబర్ 6 నుంచి మా గురువుగారు శ్రీ దాసరి ఆశీస్సులతో షూటింగ్ ప్రారంభిస్తున్నాం," అన్నారు బందెల ఈశ్వరరావు. ఈయన దాదాపు ఏడేళ్ళ పాటు దాసరి నారాయణరావు వద్ద ఇరవై చిత్రాలకు దర్శకత్వపు శాఖలో శిష్యరికం చేశారు. ఇప్పుడీయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో వీరా రామకృష్ణ, ముత్తిరెడ్డి సూర్యనారాయణమూర్తి నిర్మించే కళావాహిని క్రియేషన్స్ వారి పై చిత్రంలో శరత్‌బాబు, రాధిక, రాజేంద్రప్రసాద్, అల్లు రామలింగయ్య, మాడా, రమాప్రభ, 'కుక్క' పద్మ పాత్రధారులు. డైరెక్టర్ 3 పాటలు, శివదత్త 2 పాటలు రాయగా వాటిని చంద్రశేఖర్ స్వరపరచారు. కె. ఎస్. మణి ఛాయ, కె. ఎల్. ధర్ శిల్పం, విజయకృష్ణ సహకార దర్శకత్వం, సి. హెచ్. సాంబశివరావు నిర్వహణ, కృష్ణంరాజు కూర్పుతో కాపుగంటి వి. రమణరావు ప్రొడక్షన్ కంట్రోలర్.

## శోభన్‌బాబు, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో "కార్తీకపౌర్ణమి"

"శోభన్‌బాబు సరసన భానుప్రియ తొలిసారి నాయికగా నటిస్తోంది. పరుచూరి సోదరుల "నల్లపూసలు" నవల ఆధారం. అక్టోబర్ 15న పాట రికార్డింగ్. అక్టోబర్ 16 నుంచి షూటింగ్," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డి. శివప్రసాదరెడ్డి నిర్మించే శ్రీ కామాక్షి కమర్షియల్స్ వారి పై చిత్రంలో రాధిక, సత్యనారాయణ, వేలు, వీరభద్రరావు ప్రభృత నటవర్గం. గీతాలు : వేటూరి. సంగీతం : చక్రవర్తి. ఛాయ : సుధాకరరెడ్డి. కూర్పు : డి. వెంకటరత్నం.

"సక్కనోడు"లో విజయశాంతి



## "ఉమ్మడి మొగుడు"లో మామకు తగ్గ అల్లుడు

ఎస్. ఐ. దుస్తుల్లో ఇంటికొచ్చిన భర్త వీరభద్రం (గొల్లపూడి)ని పోల్చుకోలేక వరలక్ష్మి (వై. విజయ) తొట్రుపడి, పైటను నిండుగా కప్పుకుంటూ, "ఆయన లేరండీ. స్టేషన్‌కే బయలుదేరి వెళ్ళారు," అంది.

వీరభద్రం ఠీవిగా-టోపీని తీసేసి నవ్వాడు. "నేనేనే పిచ్చి మొహమా! ఈ రోజు నుంచి బీట్ కానిస్టేబుల్‌ని కాదు, ఎస్. ఐ. వీరభద్రాన్ని."

ఇంతలో కూతురు అలివేలు (విజయవాణి) అక్కడ కొచ్చి, "అయ్, నాన్నా! ఈ డ్రెస్‌లో భలే ఉన్నావు." అంది.

వరలక్ష్మి విస్మయంలోంచి తేరుకుని, ఆనందంగా "ఏమండీ! మీరు ఎస్. ఐ. అయ్యారా! ఇది కలా – నిజమా?" అంది.

"కలలాంటి నిజమే. నేను ఎస్. ఐ. అవను – అవను అని పెళ్ళి చేసుకున్నప్పట్నుంచి ఈ రోజు దాకా నా ప్రాణం తీశావు. నాకు ఇష్టం లేక వదిలేశా గాని, నాకీ బోడి ప్రమోషన్ ఎప్పుడో వచ్చేదే! అవునూ.... ఇంతకీ, ఆ పరమేశం గాడెక్కడ? మొగుడు తిడితే మాదా కవళంవాడూ తిట్టాడని – వాడు కూడా నీ పక్కన జేరి, 'నువ్వు ప్రమోషన్ తెచ్చుకో. నేను ఉద్యోగం తెచ్చుకుంటా, నని వెధవ కూతలు కూశాడు. వాడ్ని రానీ చెబుతాను!" అంటూ వీరభద్రం మీసం మెలేశాడు. ఇంతలో పోలీస్ కానిస్టేబుల్ వేషంలో అల్లుడు పరమేశం (చంద్రమోహన్) వచ్చి అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశాడు. ఎవరో అని కంగారుపడి, వీరభద్రం కూడా సెల్యూట్ చేసేశాడు.

"నేను మావయ్యా, పరమేశాన్ని! చూశావా .... నువ్వు ప్రమోషన్ తెచ్చుకున్నావు, వెంటనే నేను ఉద్యోగం తెచ్చుకున్నాను."



"తేనెమనసులు"లో కృష్ణ, జయప్రద

అలివేలు ఎంతగానో మురిసిపోయింది. "అయ్, మా ఆయన! నాన్నా! పోలీస్ డ్రెస్ నీకన్నా మా ఆయనకే బావుంది."

వరలక్ష్మి ఆనందం ఇంతా అంతా కాదు. "అదృష్టమంతా కట్ట కట్టుకుని ఒక్కసారే మనింటికొచ్చింది. ఉండండి – ఇద్దర్నీ కూర్చోబెట్టి దిష్టి తీస్తాను." అంటూ లోనికెళ్ళింది.

ఇంతలో వీరభద్రానికి తన అల్లుడి చొక్కా మీద తన నెంబర్ కనిపించింది. "ఒరేయ్! నా డ్రెస్సు వేసుకొచ్చావా? నిజం చెప్పు. నీకీ ఉద్యోగం ఎవరిచ్చార్రా?"

"నీకు ప్రమోషన్ ఇచ్చిన వాళ్ళే! రేపొద్దున స్టేషన్‌కి ఈ ఎస్. ఐ. డ్రెస్‌లో వెళ్ళు. అప్పుడు నిజంగానే వస్తుంది ప్రమోషనూ, ఆపైన మోషనూ!" అని ఎద్దేవా చేశాడు పరమేశం.

వీళ్ళిద్దరి మోసాలూ బయటపడి, తల్లీ కూతుళ్ళు దిష్టి పళ్ళేన్ని కింద పడేశారు.

రాఘవేంద్ర మూవీ క్రియేషన్స్ "ఉమ్మడి మొగుడు" చిత్రాన్ని బి. భాస్కరరావు దర్శకత్వంలో కె. వి. వి. సత్యనారాయణ నిర్మించారు.

"తల్లి గోదావరి"లో కె. ఆర్. విజయ, సత్యనారాయణ



## వెంకటేశ్, ఎస్. ఎస్. రవిచంద్ర కాంబినేషన్‌లో సంయుక్తా మూవీస్ చిత్రం

"మమతానురాగాలు, కుటుంబంలోని ప్రతీకార సంఘర్షణల ఆధారంగా రూపొందించబడిన కథ. వెంకటేశ్ సరసన 'ఫాస్‌లే' అనే యాష్ చోప్రా చిత్రంలో సూపర్బ్‌గా నటించిన ఫరాను హీరోయిన్‌గా పరిచయం చేస్తున్నాం," అన్నారు "దేశోద్ధారకుడు" ఖ్యాతి ఎస్. ఎస్. రవిచంద్ర. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. నరసారెడ్డి నిర్మిస్తున్న సంయుక్తా మూవీస్ చిత్రంలో రావు గోపాలరావు, చరణ్‌రాజ్, జగ్గయ్య, నూతన్‌ప్రసాద్, రాళ్ళపల్లి, వీరభద్రరావు, సుజాత, అన్నపూర్ణ, వై. విజయ ఇతర నటవర్గం. సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, మహీధర్ ఛాయ, భార్గవ- ప్రసాద్ సహకార దర్శకత్వం, రామచంద్రసింగ్ శిల్పం, పొన్నతోట రఘురాం ప్రొడక్షన్, కె. ధనుంజయరెడ్డి నిర్వహణతో ఈ చిత్రాన్ని సమర్పించే డాక్టర్ ఎం. తిరుపతిరెడ్డి "సెప్టెంబర్ 20 నుంచి 26 వరకు మొదటి షెడ్యూల్ పూర్తి చేశాం. నవంబర్ నుంచి వచ్చే ఫిబ్రవరి వరకు ప్రతినెలా 11-25 తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది. మార్చిలో పాచ్‌వర్క్," అని తెలిపారు.

# ఆంధ్రసచిత్రవారపత్రిక



## పాఠకులకు అభినేత్రి భానుప్రియ సమాధానాలు!

### త్వరలో ప్రారంభం!

తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలని విశేషంగా చూరగొన్న ప్రముఖ నటీమణి భానుప్రియ ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము. త్వరలో ప్రారంభం కాబోయే ఈ శీర్షికకి పాఠకులు అర్ధవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము. వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం భానుప్రియ ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపిన వారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫోటో బహుమతిగా లభిస్తుంది. ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్ పాయింట్ పెన్‌తో రాసి తమపేరు, పూర్తి చిరునామాతో - సహా "భానుప్రియ సమాధానాలు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ –520003 అన్న చిరునామాకి పంపాలి. ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి. విడిగా రాసి పంపినవి పరిశీలింప బడవు.

పాఠకులు ఈ అవకాశాన్ని ఉత్సాహంతో వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము.

కూపన్.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ______________________

______________________

______________________

పంపిన వారి పేరు ______________________

పూర్తి చిరునామా ______________________

______________________



## ఏటేట దీపావళి!

1984లో దీపావళి పండుగను విశాఖపట్నంలో జరుపుకున్నాను.

అప్పుడక్కడ "శ్రీవారికి ప్రేమలేఖ" షూటింగ్. జంధ్యాలగారు ఆ దీపావళినాడు షూటింగ్ రద్దు చేశారు. అందరికీ స్వీట్స్ తెప్పించారు. రకరకాల టపాకాయలు తెప్పించారు. నేను సీమ టపాకాయలే కాల్చానండోయ్.

హీరో నరేష్‌కి మాత్రం టపాకాయలు కాల్చడమంటే భయం. దూరంగా కూర్చుండిపోయి వేడుకలు చూస్తుండి పోయారు.

ఆ రాత్రి జంధ్యాలగారు యూనిట్‌లోని అందర్నీ "మంత్రిగారి వియ్యంకుడు" సినిమాకు తీసుకెళ్లారు.

1985లో దీపావళి పండుగను ఊటీలో జరుపుకున్నా. అప్పుడక్కడ సంసారం ఓ సంగీతం షూటింగ్. నిర్మాత నవత కృష్ణంరాజుగారు కూడా ఎన్నో టపాకాయలు తెప్పించారు. గాని, అక్కడి విపరీతమైన చలివల్ల కామోసు- ఒక్కటైనా పేలలేదు. కాని, నేను వేసిన ఒకటి రెండు జోక్స్ మాత్రం బాగా పేలాయండోయ్!

ఈ ఏడు దీపావళికి మద్రాసులోనే ఉంటున్నాను. వేకువ ఝామున నేను అభ్యంగన స్నానం చేసి కొత్త బట్టలు ధరించగానే మొక్కేది ప్రత్యక్ష దైవాలైన నా తల్లిదండ్రులను. ఆ తర్వాత నా ఇష్ట దైవం సుబ్రహ్మణ్యస్వామిని.

ఆ రోజు మద్రాసు టి. వి. లో ఎన్నో ప్రత్యేక కార్యక్రమాలు ఉంటాయి. వీడియోలో కొన్ని చక్కని సినిమాలు చూస్తాను.

ఈ దీపావళికి మరో విశేషముంది. మా స్వంత భవనంలో జరుపుకుంటున్న తొలి దీపావళి ఇది! (జి. వి. జి.)

## మోహన్‌గాంధి దర్శకత్వంలో రోజా మూవీస్ రెండవ చిత్రం

"తణుకు పక్కనున్న గోటేరు గ్రామంలో పూర్తిగా పల్లె వాతావరణంలో ఆగస్టు 22 నుంచి సెప్టెంబర్ 20 వరకు ఒకే షెడ్యూల్లో పూర్తి చేశాం. కూటికి పేద అయినా గుణానికి పేద కానక్కర్లేదు. సభ్యత, సంస్కారంతో కూడిన సత్ప్రవర్తనే ప్రగతికి మూలం. ధన సంపద కన్నా గుణ సంపదే మిన్న అని సూచిస్తూ హాయిగా నవ్వించే చిత్రం. బోళా శంకరుని వంటి తాత (జగ్గయ్య), విలాస పురుషుడుగా మారిన మెడిసన్ చదివిన మనవడు (భానుచందర్), అతని భార్యగా నటించడానికి వచ్చిన సద్గుణవతియైన రంగస్థల నటి (శోభన), ఆమె తండ్రిగా పరిచయం చేయబడ్డ వ్యక్తి (వేలు), ఇంకా శుభలేఖ సుధాకర్, బాలాజీ, పి. ఎల్. నారాయణ, కృష్ణవేణి, పొట్టి ప్రసాద్, ఏలేశ్వరం రంగా, చంద్రిక పాల్గొన్నారు." అన్నారు మోహన్‌గాంధి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. శివరామరాజు నిర్మించిన పై చిత్రానికి జంధ్యాల సంభాషణలకర్త. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. డి. ప్రసాద్‌బాబు ఛాయ, భాస్కరరాజు శిల్పం, ప్రకాష్ నృత్యాలు, రామచంద్రరావు – బాలాజీ ప్రొడక్షన్, డి. సాయికృష్ణ సంయుక్త దర్శకత్వం, గౌతంరాజు కూర్పు నిర్వహించారు.

"మామూలు మతాబాకే చెవులు మూసుకునే నువ్వు ఇక ఆటంబాంబు ధ్వనిని ఎలా భరించగలవయ్యా?"

(ఫొటో : ప్రసాద్)

## శ్రీ సారథీ స్టూడియోస్ "జైలుపక్షి"

"దుష్టులకు పక్కలో బల్లెం అయి, సహృదయుడు, ఆత్మాభిమానం, కార్యదీక్ష గల పోలీస్ ఇన్స్పెక్టర్ ప్రతాప్ ప్రతి మూడు నెలలకు బదిలీ చేయించబడుతూంటాడు. దిక్కులేని ఏకాకిగా జీవిస్తున్నా – తనకు నా అనే వారెవరూ లేని బాధను దిగమింగడానికి చలాకీగా తిరుగుతూ పదే పదే జైలుకి వెళ్ళి వస్తూంటుందామె. ఇన్స్పెక్టర్ ప్రతాప్‌గా శోభన్‌బాబు, జైలుపక్షిగా రాధిక పోటీ పడి నటించారు. వాణిజ్య రంగం నుంచి చిత్రరంగంలో ప్రవేశించిన చలసాని కృష్ణారావు అనే స్ఫురద్రూపి ఒక కీలకమైన పాత్రను, సుమలత ఒక ప్రత్యేకమైన

పాత్రను పోషించారు. దేవీపట్నం వద్ద చిత్రీకరించిన సన్నివేశాలు ఈ చిత్రంలో హైలైట్," అన్నారు కోడి రామకృష్ణ. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. శశిభూషణ్ నిర్మించిన "జైలుపక్షి" చిత్రంలో రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, నూతన్‌ప్రసాద్, సాక్షి రంగారావు, పి. జె. శర్మ, వంకాయల, రాజ్‌వర్మ, వేలు, బేబీ శాలిని, నిర్మల, కృష్ణవేణి ఇతర నటవర్గం. కళైమణి కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. సి. నారాయణరెడ్డి, సీతారామశాస్త్రి గీతాలకు కె. వి. మహదేవన్ బాణీలు కూర్చారు. ఎస్. గోపాలరెడ్డి ఛాయ, భాస్కరరాజు శిల్పం, కె. సూర్యనారాయణ నిర్వహణ, సురేష్ కూర్పు, వి. సుబ్బరాజు నిర్మాణ పర్యవేక్షణ తెరవెనుక హంగులు.

## "కలెక్టరుగారి అబ్బాయి"

"మంచిని ఆకళింపు చేసుకోవాలన్ని చెప్పే కలెక్టర్‌గా ఎ. ఎన్. ఆర్., మంచితో పాటు చెడును కూడా ఆకళింపు చేసుకోవాలని వాదించే కొడుకుగా నాగార్జున, నటిస్తున్నారు. సెప్టెంబర్ 20న ప్రారంభించాం. నవంబర్ 1 నుంచి ప్రతి నెలా 15 రోజుల చొప్పున మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది. పాటలను కేరళలో గాని, కర్నాటకలోని కుద్రేముఖ్‌లో గాని చిత్రీకరిస్తాం," అన్నారు ఎస్. ఎస్. క్రియేషన్స్ అధినేత యార్లగడ్డ సురేంద్ర. ఈయన "ముచ్చటగా ముగ్గురు" అనంతరం నిర్మిస్తున్న పై చిత్రంలో శారద, రజని,



కేవలం నీ అందచందాల మీద ఆధారపడ సినిమా తీస్తున్నాం! అందుచేత నువ్వు టపాకాయలు కాల్చకు తల్లీ!

శ్రీలక్ష్మి, వరలక్ష్మి, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, సుధాకర్, వేలు, శుభలేఖ సుధాకర్, రాళ్ళపల్లి, ప్రభృత నటవర్గం. కొమ్మనాపల్లి గణపతిరావు, సూర్యదేవర రామ్మోహన్‌రావు సమకూర్చిన కథకు గణేష్‌పాత్రో సంభాషణలకర్త. చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. ఎస్. గోపాలరెడ్డి ఛాయ, కె. ధర్మరాజు సంయుక్త దర్శకత్వం, రఘు నృత్యాలు, మార్తాండ్ కూర్పుతో బి. గోపాల్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

## చిత్రీకరణ ముగిసిన "సంకెళ్ళు"

"సర్వమానవ సమానత్వాన్ని, సౌభాతృత్వాన్ని చాటి చెప్పే చిత్రం. కారంచేడు, కుంకలమర్రు, చీరాల ప్రాంతాలలో మొదటి షెడ్యూల్ జరిపాం. తలకోన అడవుల్లో రెండో షెడ్యూల్, సెప్టెంబర్ 18 నుంచి 30 వరకు అరకులోయలో ఆఖరి షెడ్యూల్ పూర్తి చేశాం. దగ్గుబాటి రాజా, బాలాజీ అనే ఇద్దరు హీరోలను ఈ చిత్రం ద్వారా పరిచయం చేస్తున్నాం," అన్నారు ఆర్. పి. ఆర్ట్స్ అధినేత జి. రాజేంద్రప్రసాద్. ఈయన నిర్మించిన "సంకెళ్ళు" చిత్రంలో రమ్యకృష్ణ, సాగరిక నాయికలు. గొల్లపూడి మారుతీరావు, కాశీ విశ్వనాధ్, కె. ఎస్. ప్రకాశరావు, అంజలీదేవి, చలపతిరావు, కొంగర జగ్గారావు, సి. హెచ్. కృష్ణమూర్తి, మిఠాయి చిట్టి, సజ్జనరావు తతిమా నటవర్గం. కాశీ విశ్వనాధ్ మాటలు, వేటూరి పాటలు రాశారు. ఎం. ఎస్. విశ్వనాధం సంగీతం, నవకాంత్ ఛాయ, శివశంకర్ నృత్యాలు, పి. వి. రాజు సంయుక్త దర్శకత్వం, పి. వి. రామారావు సహకార దర్శకత్వం, స్వామినాధన్ ప్రొడక్షన్, కె. నాగేశ్వరరావు కూర్పుతో పి. సాంబశివరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించారు.



"సంకర్తన"లో నాగార్జున, రమ్య



"డబ్బెవరికి చేదు"లో రాజేంద్రప్రసాద్, సత

## కృష్ణ ద్విపాత్రాభినయంతో "సర్దార్ క్రిష్ణమనాయుడు"

"పగ, ప్రతీకారంతో కూడుకున్న ఓ వినూత్నమైన ఇతివృత్తం. తండ్రీకొడుకులుగా కృష్ణ ద్విపాత్రాభినయం అమోఘం. సెప్టెంబర్ నుంచి నవంబర్ వరకు 21వ తేదీనుంచి ప్రతి నెలాఖరు వరకు జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో బి. హెచ్. అజయ్‌కుమార్ నిర్మిస్తున్న బాలబాలాజీ ప్రొడక్షన్స్‌వారి పై చిత్రంలో శారద, విజయశాంతి, రావుగోపాలరావు, సత్యనారాయణ, రంగనాథ్, గొల్లపూడి మారుతీరావు, చలపతిరావు, రమణారెడ్డి, అన్నపూర్ణ, ఈ చిత్ర రచయితలు పరుచూరి సోదరులు నటిస్తున్నారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ఎస్. సుధాకరరెడ్డి ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, సలీం నృత్యాలు, చలసాని రామారావు సంయుక్త దర్శకత్వం, కాపుగంటి రమణరావు - చంద్రశేఖర్ ప్రొడక్షన్, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో బి. హెచ్. వరహాల్రాజు సమర్పణ.

## "దయామయుడు" విజయచందర్

"క్రీస్తుకు, సెయింట్ పాల్‌కు మధ్య జరిగిన కథ. మోషే ధర్మశాస్త్రాన్ని త్రికరణశుద్ధిగా నమ్మి, దాని పరిరక్షణకు నియమించబడ్డ యోధానుయోధుడు పాల్. ఇతని దృష్టిలో క్రీస్తు, ఆయన భక్తులు అందరూ సంఘవిద్రోహులు. కాని ఆఖరున ఇతడు క్రీస్తు భక్తుడై క్రైస్తవమత వ్యాప్తికి పాటుబడి, క్రీస్తుకన్నా దారుణంగా వధించబడతాడు. అమెరికాలో ఎందరో మతగురువులతో చర్చించి, ఈ చిత్ర కథను రూపొందించాం. స్పెషల్ ఎఫెక్ట్స్ కార్యక్రమాలు కాలిఫోర్నియాలో అప్పుడే ప్రారంభమయ్యాయి. అక్టోబర్ 12న విజయదశమినాడు హైదరాబాదులో ప్రారంభించే షూటింగ్ రెండు నెలల్లో పూర్తవుతుంది. హొగెనకల్ పరిసరాలలో పాటలను చిత్రీకరిస్తాం", అన్నారు సెయింట్‌పాల్, క్రీస్తుగా నటిస్తూ రాధాచిత్రవారి పై చిత్రాన్ని స్వీయ దర్శకత్వంలో నిర్మించే విజయచందర్. కథా విభాగంలో నాబర్ట్ కృషి చేశారు. మోదుకూరి జాన్సన్ మాటలు, సీతారామశాస్త్రి పాటలు, సత్యం సంగీతం, తీలాకృష్ణ శిల్పం, పద్మారావు ప్రొడక్షన్, ఉమాశంకర్‌బాబు కూర్పుతో సజ్జల శ్రీనివాస్ ప్రొడక్షన్ డిజైనర్. వానపల్లి బ్రహ్మాజీ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. సమర్పకుడు, సాంకేతిక సలహాదారుడు : జాన్ గిల్‌మేన్. వారన్‌మార్కస్ స్పెషల్ ఎఫెక్ట్స్ డైరెక్టర్. జాన్ ఫిడ్లరిస్ స్పెషల్ ఎఫెక్ట్స్ ప్రొడ్యూసర్.

"పగ సాధిస్తా"లో కీర్తి



## బి. భాస్కరరావు దర్శకత్వంలో బి. ఆర్. రెడ్డి చిత్రం

"తమిళంలో హిట్ అయిన 'ముదల్ వసంతం' చిత్రం ఆధారం. అక్టోబర్ 13 నుంచి 19 వరకు పిచ్చాటూరు, పుత్తూరు పరిసరాలలో, నవంబర్ 18 నుంచి 24 వరకు నెల్లూరు ప్రాంతాలలో, చివరి షెడ్యూల్ డిసెంబర్ 1 నుంచి 20 వరకు రాజమండ్రి వద్ద," అన్నారు బి. భాస్కరరావు. ఈయన దర్శకత్వంలో బి. ఆర్. మూవీస్ అధినేత బి. ఆర్. రెడ్డి "గృహలక్ష్మి" అనంతరం నిర్మిస్తున్న ద్వితీయ చిత్రంలో చంద్రమోహన్, చరణ్‌రాజ్, రాజేంద్రప్రసాద్, రమ్య, మహాలక్ష్మి, కోట శ్రీనివాసరావు ఆదిగాగలవారు పాల్గొంటున్నారు. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. ఇళయరాజా సంగీతం, సత్తిబాబు ఛాయ, సూరి శిల్పం, హార్స్‌మన్‌బాబు సాహసాలు, ఇ. ప్రకాష్‌రెడ్డి – రఘు సహకార దర్శకత్వం, ప్రకాష్ ప్రొడక్షన్, ఆత్మారాం కూర్పు నిర్వహిస్తున్నారు.

## రమేష్ "చిన్ని కృష్ణుడు"

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని వాషింగ్టన్, పిట్స్‌బర్గ్, డెట్రాయిట్, లాస్ ఏంజిల్స్, నయాగరా జలపాతం వద్ద సెప్టెంబర్ 10 నుంచి అక్టోబర్ 10 వరకు షూటింగ్ జరిపాం. మిగతా షూటింగ్ మద్రాసులో," అన్నారు "రెండురెళ్ళు ఆరు" అనంతరం విజయ సినీ క్రియేషన్స్ వారి "చిన్ని కృష్ణుడు" చిత్రానికి రచన, దర్శకత్వ బాధ్యతలు వహించిన జంధ్యాల. రమేష్ సరసన ఖుష్బూ నాయిక. ఇంకా శరత్‌బాబు, భారతి, వీరభద్రరావు, పి. ఎల్. నారాయణ, శ్రీలక్ష్మి నటించారు. భమిడిపాటి రాధాకృష్ణ కథకుడు. యు. వి. పాణి సంయుక్త దర్శకత్వం, యోగానంద్ ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పు, వేటూరి గీతాలు, ఆర్. డి. బర్మన్ సంగీతం, శాస్త్రి సహకార దర్శకత్వం, అమెరికాలోని ప్రముఖ ఇంజనీర్ గుమ్మలూరు శాస్త్రి సహకారంతో జి. సుబ్బారావు నిర్మాత. □

ఆ రుచి ఆ విలువ...
ఇప్పుడు ఆ కొత్త అందాల స్టైల్‌లో.

ప్రవేశపెడుతున్నాం

Style
MINI KINGS

స్టైల్‌ని మీ ప్రియమైన సిగరెట్‌గా తీర్చిన
ఆ అన్ని విశిష్టతలతో ఇప్పుడు
అందమైన ప్యాక్‌లో మీకోసం వస్తోంది.
మంచి మేళవింపుతో, మంచి రుచితో,
మంచి నాణ్యతతో.





Style
MINI KINGS
GOLDEN'S











Govan/SMK/1E/86/TEL

STATUTORY WARNING: CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

# సీక్రెట్ ఏజెంట్ విక్రమ్

మోహన్ * దీలీపకదమ్

9



ఆ రాత్రి చడీచప్పుడు కాకుండా ఆ హొటెల్ వెనుక వైపు ద్వారంనించి విక్రమ్ బయటికి వచ్చాడు.






కొంతసేపటి తర్వాత




ఎవరికీ కనిపించకుండా 180వ నెంబరు ఇంటిని చేరుకున్నాడు.




వాళ్ళు ఇంటి వెనుక వైపుకి వెళ్లారు. అక్కడ పాత సామాన్లలో కనిపించకుండా ఒక ట్రాన్స్‌మిటర్ ఏర్పాటు చెయబడి ఉన్నది.


















(ఇంకా ఉంది)

